# ఆంధ్రసచిత్రవారపత్రిక



ANDHRA PATRIKA
ILLUSTRATED WEEKLY

25 నయాపైసలు
24-9-58



ప్ర కృ తి

—ఫొటో : వి. వి. రామమూర్తి]

C. SAMPATHKUMAR



నరుడు—నారి —చిత్రం: సి. సంపత్ కుమార్, మద్రాసు

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై.

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

సంపుటము 53
సంచిక 2
24-9-58

Founder : K. NAGESWARA RAO

విలంబి భాద్రపద శుద్ధ ద్వాదశి బుధవారం

### విషయానుక్రమణిక



## వచ్చే సంచిక నుంచీ ప్రారంభం:
## 'బాలసాహితి'లో కొత్త శీర్షిక

★

## "ఆంధ్రుల రాజధాని

## హైదరాబాదు"

★

శేఖరానికి సూరి వ్రాసిన లేఖల రూపంలో
మన రాజధాని గాథల వివరణ

మీ కాపీ ముందే రిజర్వు చేసుకోండి.

# మద్రాస్ రెజిమెంట్

## ద్వితీయశతవార్షికోత్సవం

మద్రాసు రెజిమెంటు భారతీయ సైన్యంలోని అతిపురాతనమైన రెజిమెంటలో ఒకటి. ఈ రెజిమెంటు ఊటీ సమీపంలోని వెల్లింగ్టన్‌లో సెప్టెంబరు 15 నుంచి 17 వరకు 200 వ వార్షికోత్సవాన్ని, పునర్మిళనోత్సవాన్ని జరుపుకుంటున్నది.

ఈ రెజిమెంటుకు కర్నల్ కమాండెంటు మాజీ సైనిక శాఖాధిపతి అయిన జనరల్ శ్రీ ఎస్. ఎమ్. శ్రీనగేశ్ ఈ ఉత్సవాలలో ప్రధానాతిథి. వెల్లింగ్టన్‌లోని యుద్ధస్మారక చిహ్నంవద్ద మృతయోధుల సంస్మరణతో ఈ ఉత్సవాలు ప్రారంభమవుతున్నాయి. ఉత్సవాల సందర్భంలో క్రీడలు, వినోద ప్రదర్శనలు, సాంఘిక సమావేశాలు జరుపుతున్నారు. వృద్ధయోధులూ, కొత్తగా సైన్యంలో ప్రవేశించిన వారూ పరస్పరం కలుసుకొని, రెజిమెంటు గత చరిత్రను స్మరించుతారు. మాజీ సైనికుడైన జనరల్ శ్రీనగేశ్ ఇక్కడజరిగే యోగ్యతా ప్రధాన కవాతులో సైనికవందనం స్వీకరిస్తారు. రెజిమెంటులో చేరినవారి శిక్షణ పూర్తిఅయి యీ కవాతులో వారికి యోగ్యతా ప్రదానం జరుగుతుంది. కొత్తగాసమీకరించబడిన సైనికులు యీ కవాతు సందర్భంలో రెజిమెంటుపట్ల తమ భక్తివిశ్వాసాలకు చిహ్నంగా ఒక వెండిగిన్నెలోంచి ఒక ఉప్పుగలు తీసుకుంటారు. రాష్ట్రపతిపట్లా, దేశంపట్లా భక్తివిశ్వాసాలను ప్రకటిస్తూ ప్రమాణస్వీకారం చేస్తారు. ఈ కవాతు అయిన అనంతరం కొత్తగా సమీకరించబడిన సైనికులను పూర్తిప్రతిపత్తి పొందిన సైనికులుగా పరిగణించడం జరుగుతుంది. ఆ తర్వాత వారిని రెజిమెంటులోని ఆయా దళాలలో నియమించడమవుతుంది.

## పూర్వగాథ

ఫ్రెంచివారు 1758 లో కోరమాండల్ కోస్తాలో బ్రిటిషువారిపై దాడిజరిపి మద్రాసు కోటపై ముట్టడిసాగించిన రోజుల్లో ఈ రెజిమెంటు అవతరించింది. అప్పుడు మద్రాసులోని బ్రిటిషు ప్రభుత్వం మొదటి మద్రాసు పటాలాన్ని నిర్మించింది.

ఆ తర్వాత 70ఏళ్ళలో ఇంకా అనేక పటాలాలను నిర్మించడం జరిగింది. 1826 నాటికి వాటి సంఖ్య 52కు పెరిగింది. మొదట్లో ఈ రెజిమెంటును "మద్రాసు దేశవాళీ పదాతి దళం" అని పిలిచే వారు. 1885లో మద్రాసు పదాతి దళం అనీ, 1903లో 'కర్ణాటక పదాతి దళం అనీ' 1922 లో 3-వ మద్రాసు రెజిమెంటు అనీ పిలిచి వ్యవహరిస్తూ వచ్చారు. ఆ తర్వాత 6ఏళ్లకు యీ రెజిమెంటుకు ఉద్వాసన చెప్పడం జరిగింది. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో అనగా 1942లో ఈ రెజిమెంటును పునర్నిర్మించారు. "మద్రాసు రెజిమెంటు" అనే పేరు దీనికి 1950లో వచ్చింది.

దక్షిణాదిన బ్రిటిష్ వారికీ ఫ్రెంచివారికీ జరిగిన యుద్ధాలలో మద్రాసు దేశవాళీ పదాతి దళాన్ని బ్రిటిషువారు ఫ్రెంచి వారిపై ఉపయోగించారు: కర్ణాటక యుద్ధాలలో నేకాక హైదరాలీపైన, టిప్పుసుల్తాన్ పైన జరిగిన హాలు మైసూరు యుద్ధాలలోనూ, మరాటి యుద్ధాలలోనుకూడా యీ దళాన్ని ప్రయోగించారు.

రాబర్ట్ క్లైవు, కర్నల్ వెల్లసీ ఈ రెజిమెంట్లకు నాయకత్వం వహించారు. వాటి శౌర్యసాహసాలను గురించి అనేక సందర్భాలలో ప్రశంసించారు. ఈ రెజిమెంటును గురించి కర్నల్ వెల్లస్లీ ఇలా వ్రాశారు:

"ఈ సైనికుల ప్రవర్తనం ఎంత ప్రశంసించినా అది అత్యుక్తి కాబోదు. ఒక్క మన స్వంత దళాన్ని మినహాయిస్తే ఇండియాలో నేను చూసిన అన్ని దళాలలోకి ఇదే శ్రేష్ఠమైనది. సైనికులు, ప్రశంసనీయంగా ప్రవర్తించారు. ఈ సిపాయీలను చూస్తే నాకు పరమాశ్చర్యం వేసింది."

## అడవులలో...

మొదటి రెండవ బర్మా యుద్ధాలలో మద్రాసు రెజిమెంటు అడవులలో కూడా పోరు సాగించింది. మూడవబర్మాయుద్ధంలో కూడా పాల్గొన్నది. 1910 నాటికి మొత్తం 28 సైనిక సన్మానాలు పొందింది.

చైనా, పెగు, బర్మా, అఫ్ఘనిస్థాన్ బాగ్దాద్, మెసొపొటేమియా, పర్షియా, తూర్పు ఆఫ్రికా, కిలిమంజారు ఇత్యాది దూరదేశాలలో యుద్ధాలలో పాల్గొని మద్రాసు రెజిమెంటు అఖండ ఖ్యాతి సార్జించింది.

రెజిమెంటు పునర్నిర్మాణం అయిన తర్వాత 1944 లో నాటి భారతీయ సర్వసేనాని జనరల్ ఆకినెక్ రెజిమెంటులోని ఒకదళం తొలూకు కమాండింగు ఆఫీసరుకు ఇలా వ్రాశారు:

# ★ మద్రాస్ రెజిమెంట్ ★

"మద్రాసు రెజిమెంటు భక్తి విశ్వాసాలతో చిరకాలం సేవచేసి పేరు సంపాదించుకుంది. బర్మాలో ఈనాడు పోరాటం సాగిస్తున్న ఈ రెజిమెంటు 200 ఏళ్ళ క్రిందట ప్రదర్శించిన ధైర్య సాహసాలను తిరిగి ప్రదర్శించగలదని విశ్వసిస్తున్నాను."

## ఇటీవలి గాథ

స్వాతంత్ర్యప్రాప్తి అనంతరం మద్రాసు రెజిమెంటు ఢిల్లీ, బెంగాలు, బీహారులలో అల్లరులను అణచడంలో ఎంతో తోడ్పడింది. ఇందుకు ప్రధానమంత్రి నెహ్రూ, నాటి గవర్నరు జనరలు అడ్మిరలు లార్ లూయీ మౌంట్ బాటెన్ ఈ రెజిమెంటును వేనోళ్ల ప్రశంసించారు. ఈ రెజిమెంటు తాలూకు కొన్ని దళాలు జమ్ము-కాశ్మీర్ యుద్ధ చర్యలలో పాల్గొన్నాయి. అక్కడవారు ఒక మహావీర చక్రాన్ని, 8 వీరచక్రాలను సంపాదించుకున్నారు.

సంస్థాన సైన్యాలను పునర్వ్యవస్థీకరించడంతో తిరువాన్కూరుకు చెందిన రెండు దళాలు, మైసూరుకు చెందిన ఒక దళం, కొచ్చిన్‌కు చెందిన ఒక దళం మద్రాసు రెజిమెంటులో విలీనమైనాయి,

## కేంద్రంలో శిక్షణ

మదరాసు రెజిమెంటు కేంద్రంలో ఆంధ్ర, మైసూరు, కేరళ రాష్ట్రాలనుండి సమీకరించే సైనికులకు శిక్షణ ఇస్తారు. ఈ కేంద్రం ఉదకమండలానికి 10 మైళ్లు దిగువన వెల్లింగ్టన్ బారకాసులలో ఉంది. ఈ బారకాసులను 1860 లో నిర్మించారు. శిక్షణ 44వారాల పాటు ఇస్తారు.

సమర్థులు, సుశిక్షితులు, సాహసవంతులూ అయిన సైనికులను తయారు చేయడమే ఈ కేంద్రం లక్ష్యం. రెజిమెంటు తాలూకు కర్నల్ కమాండెంటు అయిన జనరల్ ఎస్. ఎమ్. శ్రీనగేశ్ చెప్పినట్టు మదరాసీ సైనికుడు సాహసవంతుడు. ఎన్ని కష్టాలు వచ్చినప్పటికీ ధైర్యంతో నిలబడగలవాడు." ★

# కూచిపూడి నాట్యం

## రాష్ట్ర అకాడమి గురుతర బాధ్యత

ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ రాష్ట్ర రాజధానిలో ప్రత్యేకంగా కూచిపూడి నాట్యసదస్సు జరపాలని నిర్ణయించటం సంతోషించదగిన విషయం. మన నాట్యానికి ఆరునెలల క్రితం జరిగిన అన్యాయాన్ని సరిదిద్దటానికి మరి ఆరునెలల తరువాత పూనుకొంటామని కార్యవర్గం ప్రకటిస్తున్నది. ఈ జాప్యానికి కారణం ఏదైనా, కూచిపూడి నాట్యాన్ని ఆవరించివున్న అయోమయ పరిస్థితులదృష్ట్యా, ఈ నృత్య సంప్రదాయ పూర్వ స్వరూపాన్ని తెలుసుకోటానికీ, ప్రస్తుత లోపాలు సవరించుకొని ఒక నిర్దుష్ట ప్రమాణం నిర్ణయించటానికీ ఈ వ్యవధిని వినియోగిస్తే మన నాట్యకళకు శాశ్వతమైన మేలు కలుగుతుంది.

ఈ నాడు రాష్ట్రఅకాడమీ నిర్వహించవలసిన బాధ్యత గురుతరమైనది. వ్యక్తిగత, ప్రాంతీయాభిమానం ఎలాంటి నష్టం కలిగించగలదో మనకు ఢిల్లీసదస్సు అనుభవాలవల్ల స్పష్టపడింది. ఇంతవరకు ఒకదారీ తెన్నూ లేకుండా విశృంఖలంగా విహారం చేస్తూ, పూర్వరూపాన్ని పోగొట్టుకుంటున్న కూచిపూడి నాట్యమునకు నిర్దిష్ట ప్రమాణములు నిర్ణయించాలనే జిజ్ఞాసతో, సత్యాన్వేషణపట్ల శ్రద్ధతో, రాష్ట్రఅకాడమీ కృషి చేయవలసివుంటుంది.

ఇటువంటి ఉదాత్తమైన నిర్మాణాత్మక కృషి ఒక ప్రత్యేకసదస్సు జరిపి కొందరు ప్రముఖులచేత ఉపన్యాసాలు చదివించటంతోనూ, కొందరు కళాకారులచేత ప్రయోగాలు చేయించటంతోనూ పూర్తిగాదు. కాకపోగా, ప్రస్తుతం దేశంలో పలువురు పండితుల నిశిత విమర్శలకు గురిఅవుతున్న మన ప్రయోగాలలోని లోపాలే పునరావృతమయ్యే ప్రమాదం వున్నది.

కాగా, హైదరాబాదులో కూచిపూడి నాట్యసదస్సు జరుపటానికి పూర్వమే, శాస్త్రపండిత పరిషత్తు ఒకటి జరిపి, నాట్యానికి సంబంధించిన విభిన్నవిషయాలపై పండితామోదము పొందగల నిర్ణయాలతో కూచిపూడి నాట్య సమగ్రస్వరూపాన్ని నిరూపణచేసి దేశంలోని నాట్యాచార్యులకు, కళాకారులకు ఆ నిర్ణయాలను తెలియపరచాలి. అకాడమీ ముందుగా నిర్ణయించి, ప్రకటించే ప్రమాణములదృష్ట్యా నాట్య సదస్సును నిర్వహించాలి.

కూచిపూడి నాట్యస్వరూప నిర్ణయంలో ఈ దిగువ తెలిపిన విషయాలు పరిశీలిస్తే మంచిదని నా అభిప్రాయం.

1. ప్రాచీనకాలంలో అనుసరించి ఆచరణలో పెట్టిన నాట్యస్వరూపం ఏమిటి? దీనిని కాలానుగుణంగా సంస్కరించి, మూలమునకు అఘాతం కలుగకుండా ఎలా పరిపుష్టం చేయాలి?

2. అభినయంలో వీరు ఏయే హస్తములు, అంగహారములు, కరణలు, రేచికలు అనుసరిస్తున్నారో నిరూపించాలి.

3. గానమునకు ప్రాధాన్యతగల కూచిపూడి నాట్యకళాకారునకు నేపథ్యగానము లేక సహకారగానము ఆలంబనంగా వినియోగించటం ఈ సంప్రదాయ విశిష్టతకు అనుగుణమైనది అవునో, కాదో తేల్చాలి.

4. ఆహార్యం ఈ నాట్య సంప్రదాయానికి ప్రత్యేకతను సంతరించుకున్నది. వీరు ఉపయోగించే కిరీటములు, కరాళములు, పతకములు, గండభేరుండ దిహారములు, భుజకీర్తులు, జడలు, కొయ్యతో చేసినవి, అనుసరించటంలోని ప్రత్యేకతను నిలుపుకోవలెను. స్త్రీ పాత్రలు ధరించేవారు చీరెలు (అధునాతనమైన ఆరుమూరలుగల రేషన్ చీరెలు గాక) ఆయాపాత్రల స్వభావమును, ప్రయోగ సౌలభ్యమును, అనుసరించి పాత్రల సౌందర్యమును పెంపుగావించునట్టి, దూష్యము గానట్టి ఆయాదుస్తులను నిర్దేశించాలి.

5. ఆతోద్యములలో శబ్దపూర, వాయుపూర, తంత్రీవాద్యములు, తంబుర, పిలనగ్రోవి, మృదంగము, సుశబ్దముగల తాళములు, గజ్జెలుమాత్రమే చెప్పబడినవి. సంగీత విద్వాంసులచేత పరిగ్రహించి గౌరవించబడిన ఫిడేల్ అనుసరించబడుతూంది. కాని పాశ్చాత్య వాద్యములు వినియోగించకుండా, ఈ సంప్రదాయమును ఆకర్షణీయంగా, విలక్షణంగా శ్రవణపేయంగాచేసే అవకాశము కల్గించాలి.

6. సాహిత్యంలో ఈ సంప్రదాయానికి విశిష్టతను కలిగించిన తరంగములు, అష్టపదులు, జతిస్వరములు, శబ్దములు, పదములు నిరూపించాలి.

7. నృత్తరూపకం-నాట్యం వీటి సారూప్యత, ప్రత్యేక ప్రయోజనాలు; సమగ్ర నాట్యస్వరూప నిరూపణలో చరమ లక్ష్యానికి ఏది పరమావధో చూడాలి.

నాట్యాచార్యులలోను, ప్రయోగంచేసే వారిలోను ఈ నాడు బహుళంగా కనిపిస్తున్న వైవిధ్యాలకు, లోపాలకు కారణం లక్షణాన్వితమైన లక్ష్యంలేక పోవటమే. దీనికితోడు దురదృష్టవశాత్తు మనం ఒక పెద్ద లోపాన్ని ఎదుర్కొనవలసి వస్తూంది. ఇప్పుడుకూడా శాస్త్రం క్షుణ్ణంగా తెలిసిన పండితులు దేశంలో అక్కడక్కడ వున్నప్పటికీ, లక్ష్యానికి సరియైన ప్రమాణాన్ని ఇతరులకు విశదీకరించటానికి తగిన భాషాపరిజ్ఞానం, ప్రయోగ కౌశలం చాలామందికి లేదు. ప్రయోగంలో కౌశలంగలవారిలో అనేకులకు లక్ష్యానికి ప్రమాణం నిరూపించగల శాస్త్ర పరిచయంలేదు. కొంచమైన శాస్త్రపరిచయం గలిగి ఒకనాడు నిర్దిష్ట శాస్త్ర విహితప్రయోగం చేయగలవారు కూడా ఈ నాడు వార్ధక్యంవల్ల ప్రయోగం చేయలేకుండా వున్నారు. ఇటువంటి పరిస్థితులలో మనకు నాట్యాచార్యులు ఉద్భవిస్తున్నారు. వీరి వద్ద శిక్షణపొందే సాధకులు మిడిమిడి జ్ఞానంతో నాట్యకళా సంస్కృతిని అభివృద్ధిలోకి తీసుకొని రావలసిన దుస్థితి మన అలక్ష్యఫలితంగానే ఏర్పడింది. కాబట్టి, ఇప్పుడైనా రాష్ట్ర అకాడమీ ఈ బృహత్కార్య నిర్వహణకు పూనుకుని, కూచిపూడి నాట్య కళాభివృద్ధికి ఘంటాపథములైన మార్గములు నిర్మిస్తే, ఒక మహత్తరమైన విజయాన్ని సాధించినట్లవుతుంది. హైదరాబాదులో కూచిపూడి సెమినార్ జరిపే నాటికి, ఈపండిత పరిషత్ నిర్ణయముల దృష్ట్యా కూచిపూడి నాట్య సంప్రదాయంలోని ప్రత్యేకాంశములనుగురించి ప్రముఖుల ఆంగ్ల వ్యాసములతో కూచిపూడి డాన్సు సింపోసియంను తయారు చేయించి, మన కళాకారుల ప్రత్యేక భంగిమల త్రివర్ణ చిత్రరువులతో ముద్రించి, కేంద్ర అకాడమీకి పంపినఎడల మనకుగల ప్రత్యేకతను ఢిల్లీవారికి నివేదించుకోటానికి ఒక ఆధార మేర్పడుతుంది.

హైదరాబాద్‌లో జరుగగల డాన్సు సెమినార్‌ను రాష్ట్ర అకాడమీ నిర్ణయించే శాస్త్ర ప్రమాణముల దృష్టితో నిర్వహించిన యెడల దేశంలోని కళాకారులు ఒక లక్షణమును, లక్ష్యమును తమ దృక్పథంలో నుంచుకుని కృషిచేసి, కౌశలమును పెంపొందించుకొనగల అవకాశం చేకూరుతుంది.

—తుమ్మలపల్లి సీతారామారావు



# విజయవాడ వింతలు



ఏ క్విజ్ ప్రోగ్రాములోనైనా ఈ క్రింది ప్రశ్నలు వేస్తే తడుముకోకుండా ఏసమాధానం వస్తుందో ఆలోచించండి!

ప్రజారోగ్యశాఖ వున్నదన్న సూచనైనా పైకి కనుపించని తెలుగు పట్టణమేదో చెప్పుకోండి?

రోడ్లమీద నడుస్తుంటే సినిమా పాటల గోలతప్ప కార్ల, లారీల హారనయినా వినిపించని పట్టణమేదో చెప్పుకోండి చూద్దాము?

మూడువంతులు మురుగు, ఒకవంతు నేల గల పట్టణమేదో మీకు తెలుసా?

పందులకు రోడ్డే నిత్య నివాసంగా వుండే తెలుగు పట్టణమేదో తెలుసా?

కాలమునాడు వైద్యవిద్యలో చరక మహర్షి పాండిత్యాన్ని పరీక్షించడానికి ఆయనగురువుగారు "రెండు మైళ్ళలోగా వైద్యానికిపనికిరాని మొక్క ఏదైనావుంటే తీసుకురా" అన్నారట. చరకుడు రెండు మైళ్ళూతిరిగి తిరిగి రిక్తహస్తాలతో వచ్చి వైద్యానికి పనికిరాని మొక్కంటూ ఏదీలేదని గురువుకు బదులు చెప్పాడట.

మనవిజయవాడ మున్సిపాలిటీ జ్ఞానత్వాన్ని పరిశీలించటానికి మీపట్టణంలో పంది లేనిసందు,మురుగులేని గొంది చూపించగలరా అని ఎవరిని ప్రశ్నించినా టెలిస్కోపు, బైనాక్యులర్స్ మొదలైన భూతద్దాలు పెట్టి వెతికినా ఒక బజారుకూడా వారికి కనబడదేమోనని నాకు అనుమానం.

విజయవాడకు వచ్చే కొత్తవారు పందులు చేసే చిలిపిపనులుచూసే (అవివారికే జరుగకుండావుంటేనే సుమండీ!) తప్పకుండా ఆశ్చర్యపడతారు. మా అన్నయ్య ఏదోపనిమీద వెళ్తూ ఒక చిన్న కొట్లో నన్ను కూర్చోబెట్టి వెళ్ళాడు. ఆయనమీద వుండే గౌరవం కొద్దీ కొట్టువాళ్ళు బజారులో కుర్చీ వేసి కూర్చోమని మర్యాదచేశారు. ఇంతలో ఎక్కడినుంచి వచ్చిందో ఒక ఆదివరాహం భక్తితో నాచుట్టూ ప్రదక్షిణం చేస్తున్నది.

ఏవరం అనుకుంటుందోరా బాబూ అనుకుని నాగుండెలు చెట్టెక్కాయి. ప్రియురాలి ఎడబాటు భరించలేక కాబోలు దాని ప్రియుడు ఘూకరిస్తూ అఘ మేఘాలమీద వచ్చి కాలంవృధా పుచ్చకుండా దానితో సరససల్లాపాలు ప్రారంభించాడు. ఎలాగురా బాబు ఈభక్తుల బారినుండి తప్పించుకోవటం అని ఆలోచిస్తుండగానే, గజేంద్రుణ్ణి రక్షించటానికి వచ్చిన మహావిష్ణువులాగ మా అన్నాయి రానేవచ్చాడు. వాడు నా గాథ రాచూచి "అలా కంగారు పడతావేరా బాబూ, మనవూళ్ళో లేగదూడలు మనతో ఎలా ఆడుకుంటాయో ఇక్కడ పందులు ప్రజలతో అలా ఆడుకుంటాయి" అన్నాడు.

బాబూ గాంధీనగరంలో మన స్నేహితులున్నారు చూసివద్దాంరారా అన్నాడు మా అన్నాయి. ఏమీ జరగకుండా వస్తే ఆకుపూజ చేస్తానని భగవంతుణ్ణి ప్రార్థించి మరీబయలుదేరాను. ఇద్దరం ఒక సందులో ప్రవేశించాము. ఆ సందులో అక్కడక్కడ గోష్పాదమంత చోటు తప్ప, మిగతా ప్రదేశం అంతా ఆవరించుకొని వున్నది మురుగు. ఆ సౌరభాన్ని భరించలేక ముక్కు దగ్గరకు జేబురుమాలా చేర్చాను. ఆ సందులోని గృహస్థులు "ఎవడో కొత్త జంతువు వచ్చినట్లు"



వన్నెల విసనకర్ర!

—చిత్రకారుడు: వి. పూర్ణానందశర్మ.]

కొడుకు : (బస్ కండక్టరుగా పనిచేస్తున్న తండ్రితో) 'నాన్నా 'రైట్' (Right)కు వ్యతిరేక పదమేమిటి?

తండ్రి : (తడుముకోకుండ) హోల్డాన్.

కె. భారతీదేవి. (భిలాయి)

వా వంక చూడసాగారు. ఇంతలో ఒక గంగా భాగీరథీసమానురాలు తన మనుమడితో ఇలా చెప్తున్నది. "మనకు 360 రోజులూ లేని వాసన ఈ కుర్రాడికి వేస్తున్నదిరా! ఏం నాగరీకంరా!"

ఆవిడ ఇలా అనటంలో తప్పులేదు; ఎందుకనంటే నేను ముక్కు మూసుకోవటం వారిని వెక్కిరించటానికేనని ఆవిడ అనుకొని వుండవచ్చు! ఎలాగో మా మిత్రుల గది చేరాము. అక్కడున్నంతసేపూ ఎలారా భగవంతుడా మళ్ళీపోయేది అన్న ఆలోచనే నాకు.

వచ్చేటప్పుడు పంచేంద్రియాలూ బంధించి నడవడం మొదలుపెటా. (ముక్కు మూసుకుంటే ఆ బజారువాళ్ళు ఏంతేరమో అని భయంకల్గి) ఆ కంగారులో జనిమీదైతే అడుగు వేయరాదో దామీదే వేశా. కాలికి బూటేగనుక లేకపోతే, అంతవరకూ కోయించవలసి వచ్చేదేమోననిపించింది. మున్సిపాలిటీవాళ్ళని మనసులో తిట్టుకున్నా. నాకు తెలియకుండా ఆ తిట్లు నోటివెంట వచ్చేశాయి.

"నీలాగా వాళ్లని చాలామంది తిట్టారు కాని ఆ తిట్లన్నీ వాళ్లకు దీవెనలు నాయనా!" అన్నాడు ఓ గృహస్థు. అలాగా అని కళ్లు తేలవేసి నోరుమూసుకుని తలవంచుకొని నడచిపోయాను.

నాలుగు మెతుకులుతిని రూము చేరుకుందామని వస్తుంటే, ఎక్కడిదో ఒక శునకరాజము మామీద మెరుపుదాడి ప్రారంభించింది. మేముకూడా ఎదురుదాడి ప్రారంభించేసరికి ఇద్దరు దంపతులువచ్చి "అది మా కుక్క. అలా అనవసరంగా కొట్టారేమిటి?" అని మమ్మల్ని మందలించారు.

"మీకుక్క అయితే ఇంట్లో కట్టేసుకోవాలి కాని రోడ్డుమీద వదుల్తారా?" అన్నాను.

"ఇది నీవు సంపాదించినరోడ్డా!" అంది ఆ ఇలాలు కలకత్తా కాళీ పోజు పెటి!

"అది మీకుక్కా, రోడ్డు మునిసిపాలిటీది; శరీరాలు మావి కొబట్టి వాటిని రక్షించుకోవాలన్నదే మా తాపత్రియం" అని చల్లగా సమాధానం చెప్పి రూముకుచేరాము!

అరగంట అయిందో లేదో "అమెరికన్ గన్‌పాట్" సినిమాలో రెడ్ ఇండియన అరుపులు వినవచ్చాయి. ఏమిటిదని క్రిందికివెళ్ళి విచారిస్తే, ఒక కుక్క పక్కనున్న గుడిసెలో దూరి మాంసం కూర భక్షించిందట!

ఆ అభాగ్యుడు ఆకోపం భరించలేక పలుగు పెటి దాన్ని పొడిచాడట. ఇది ఇందాకటి కుక్కయితే బాగుండుకదా అనిపించింది! ఆ కుక్క యజమాని ఆ కుక్కను పొడిచినట్లు నిన్ను పొడుస్తానని వాణి బెదిరిస్తున్నాడు. "ఆ కుక్కకు లైసెన్సులేదు; అది నీ కుక్క అనేఏమిటి?" అంటున్నాడు రెండో వ్యక్తి. ఈ రాత్రికి నిద్రబోయే అదృష్టం లేదనుకున్నాను. రూముకు చేరాము.

"భాయీ: విజయవాడకు ఒక్క సుగుణం వుంది" అన్నాను.

"ఏమిటి?" అన్నాడు అన్నాయి దోమల సంగీతం వినే అదృష్టం లేదన్నాను. వాడు పొట్ట చేతో పట్టుకుని నవ్వుతున్నాడు.

"ఏమిటిరా అలా కక్కు వచ్చినట్లు నవ్వుతావు?" అన్నాను.

"నీవింత పిచ్చివాడివేమిటి బాబూ, మనిద్దరికోసం మూడో అంతస్తుకు క్రమపడి వచ్చే అంత తెలివి తక్కువవి అనుకున్నావా విజయవాడ దోమలు? క్రిందికి వెళ్లి రండోళు మోగిస్తాయి!" అన్నాడు.

విజయవాడ దోమలబుద్ధి సూక్ష్మతకు చాలా ఆశ్చర్య పడాను!

రాత్రి 11 గంటలైనా, ఒక పక్క నిద్రపట్టి పట్టనట్లుండి నేను బాధపడుతుంటే, మరోక పక్కనుంచి "నన్ను ఏతలికన్నది ఏ రమణయ్య మామా!" అంటు గొలగాపాట! ఇంకో వైపునుండి "వివాహభోజనంబు వింతైన వంటకంబు" అని పోటీగా ఫుల్ వాల్యూములో పాట! ఇవ్వాళిటికి నిద్రను ఇనుపపెటెలో పెటినట్లేరా భగవంతుడా అని నాఖర్మను శపించి లేచి కూచున్నా.

"ఇక్కడ పబిక్ డిసర్బెన్సు న్యూసెన్సు లాంటి రూల్సేమి లేవా ఏమిటి?" అని అన్నాయిని అడిగా. పుటానికి ఫైల్సులో అన్నీ వున్నాయిరా! ఛైర్‌మన్‌గారి ఇంటి ముందు జరిగితేనే దిక్కు వుండదు! నీ గోడు ఆలోచించెవారెవరు? అన్నాడు.

ఈ ఒక్క రోజుకే ఇన్ని అనుభవాలు పొందానే, ఇంకా 4 రోజులుంటే ఎలా అనుకుని బలవంతంగా కన్నుమూసుకున్నాను. కలకత్తా మెయిలు కూతతో మెలకువ వచ్చింది. శరీరం 103 డిగ్రీల జ్వరంలో మండుతున్నది. జ్వరం వచ్చినందుకు కొంచెం సంతోషమే కలిగింది. ఎందుకంటే నాలుగు రోజులు రూములోపడి వుండవచ్చని. అందువల్ల విజయవాడ వివరాలను ఇంతటితో ముగిస్తున్నాను. 

—బొప్పన సీతారామారావు]

# చినబాబు
# పెళ్ళిసంబరం

ఆది నిశీధ సమయం. గాఢాంధకారం పక్షపాతం లేకుండా నలువైపులా క్రమ్ముకుని భీతి గొల్పుతోంది. ఊరిచివర నున్న పూరిపాకలో దీపం మినుకు మినుకుమంటూ మధ్యమధ్య గాలికి రెపరెప కొట్టుకుంటోంది.

నిద్రపట్టక నులక మంచంలో దొర్లుతూన్న గౌరి ఆ దీపపుబుడ్డిని తదేకదృష్టితో చూస్తోంది. ఇంతలో గాలికి యెగిరివచ్చిన పురుగొకటి ఆ దీపంమీద పడింది. దీపం ఆరిపోయింది. గౌరి తలగడ క్రిందనున్న అగ్గిపెట్టె తీసింది. అగ్గిపుల్లగీసి మళ్ళీ దీపం వెలిగిస్తూ మాడిమసిబోగు అయిన పురుగును చూచింది. 'ఎంతలో జీవితాన్ని సమాప్తం చేసుకుంది!' అనుకుని ఒక వేడి నిట్టూర్పు విడిచింది.

పొలాల్లో పక్షులు అరుస్తున్నాయి. ఇంటిచుట్టూ కీచురాళ్ళు శ్రుతి తప్పకుండా విశ్రాంతిలేకుండా రాగాలాపన చేస్తూనే ఉన్నాయి. ఊరిమధ్య బ్యాండుమేళం సన్నాయిమేళం ధ్వనులేగాక మధ్య మధ్య గుండె లదిరేటట్లు మందుసామాను కాలుస్తున్న ధ్వనులు గౌరి హృదయాన్ని కలవరపెడుతున్నాయి.

ఆప్యాయంగా అనుక్షణం పలకరించే అయ్య యీనాడు మారుమొగం పెట్టుకుని కూడు కొస్తూ రెండుముద్దలో తిని తనతో మాట్లాడకుండా సైకిల్ తీసికొని వెళ్ళిపోయాడు. రోజూమాదిరిగా గోనెపటాలోంచి పుగాకుముక్క తీసి యివ్వబోతే పుచ్చుకోకుండా వేరొక పుగాకు కాడతీసికొని వెళ్ళిపోయాడు. రోజూ తలుపు వేసుకోమ్మా అని చెప్పి వెళ్ళేవాడు. ఆమాటైనా తండ్రినోటి వెంట వస్తుందని యెదురుచూచిన గౌరికి నిరాశే మిగిలింది.

తన పరిస్థితిని తండ్రి అనుమానించినట్లు తోచింది గౌరికి. మనస్సులోని ఆవేదనను వెలిబుచ్చుకుని బావురుమని యేడుద్దామనుకున్నా ఆదరించే అమ్మ చిన్నప్పుడే తనను వదలిపెట్టి వెళ్ళిపోయింది. తండ్రితో ఏమని చెబుతుంది. ఏ ముఖం పెట్టుకుని చెబుతుంది.

రత్తయ్యకాపు అంటే కూటికి బీదయినా కులానికి బీదగాడని, గౌరవంగల కాపుఅని, మాట అననే అనడు, అన్నాడా ప్రాణాన్నయినా యిచ్చి నిలబెట్టుకుంటాడని ఆ ఊళ్ళోనేకాకుండా చుట్టుప్రక్కల గ్రామాల్లోకూడా పేరు సంపాదించుకున్నాడు. అయినింటికాపని అందరూ పొగడేవారు.

ఈనాడు రత్తయ్యకాపు గౌరవాన్ని కాస్తా గంగపాలుచేసింది కూతురు గౌరి. అయితే యింతవరకు వస్తుందనుకోలేదు.

ఒకనాటి సంగతి. ఆ నాడు కట్టుబడికి

మల్లాది
సత్యనారాయణ

తీసుకున్న చినబాబుగారి పొలంలో దుక్కి దున్నుతున్న తండ్రికి అన్నం దీసికొని బయలుదేరింది గౌరి. మధ్యలోనున్న చినబాబుగారి దూడలపాక దగ్గరకు వచ్చేసరికి పెద్దగాలి, వాన, వచ్చింది. చినబాబు చూచాడు. గౌరి తడిసిపోతాననే భయంతో దూడల పాకలోనికి వచ్చింది. చినబాబుని చూచి కొంచెం కంగారుపడింది. 'భయం లేదు గౌరీ! వర్షం వెలిశాక వెళ్ళు' అన్నాడు చినబాబు. ఇంతలో వెనుకనుంచి గౌరిని పోట్లఆవు తరుముకొచ్చి కొమ్ములతో ఒక్క పోటు పొడిచింది. హడలిపోయిన గౌరి అమాంతంగావచ్చి ఎదరఉన్న చినబాబు కాళ్ళమీద పడింది. గౌరికి గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. మోకాలిమీద దెబ్బ తగిలింది. చినబాబు ఆవును దూరంగాతోలి గౌరిని లేవదీశాడు.

నవయౌవనంలో అడుగు పెడుతున్న గౌరికి చినబాబుచేతులు తగిలేసరికి సిగ్గుతో శరీరమంతా ముంచుకుపోయింది. చెప్పరాని అనుభూతి హృదయంలో చెలరేగింది. చినబాబు కళ్ళల్లోకి చూచింది. ఆ కళ్ళు రెప్పలు వాల్చకుండా కోరికలు కేకతిస్తూ తన కళ్ళవంకే చూస్తున్నాయి. చూడలేకపోయింది గౌరి. రెండు చేతులతో కళ్ళు మూసుకుని చినబాబు చేతుల్లోంచి విడిలించుకుని వర్షంలో తడిసినా సరే అనుకుని పరుగెత్తింది గౌరి. తదేకదృష్టితో చూస్తున్నాడు చినబాబు. తానూ యెందుకో తనకు తెలియకుండానే రెండుసార్లు వెనక్కి తిరిగిచూచింది. కనీసం వెళ్ళొస్తాననేనా చినబాబుతో చెప్పకుండా వచ్చేశానే అని బాధపడుతునే ఉంది గౌరి. తండ్రికి అన్నం యిచ్చి తిరిగి వచ్చేటప్పుడు పాకవంక చూచింది. ఇందాకటిచోటే నిలుచుని ఉన్నాడు చినబాబు. చూడడానికి సిగ్గేసింది గౌరికి. అయినా మళ్ళీ మళ్ళీ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళలేకపోయింది గౌరి.

ఆ రాత్రి గౌరికి నిద్రపట్టలేదు. ఆవు తరుముకురావడం తలుచుకుంటే భయం వేసేది. చినబాబుచేతులో ఉన్న విషయం తలుచుకుంటే సిగ్గువేసేది. కన్నుమూస్తే చాలు ఆవు తరుముకొస్తున్నట్టుండేది. ఉలిక్కిపడి లేచేది. ఇంకా తాను చినబాబు చేతులోనే ఉన్నాననే అనుభూతి అనుక్షణం గౌరికి కలిగి ఆ రాత్రి తెల్లవార్లూ గౌరిని ముప్పుతిప్పలూ పెట్టింది. ఎప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు చినబాబుని చూస్తానా అనే ఆరాటం గౌరి హృదయంలో నూతనంగా కలిగి క్షణక్షణాభివృద్ధిచెంది తెల్లవారేసరికి పూర్తిగా గౌరి మనస్సును పాడుచేసింది.

మరునాడు మామూలువేళకు కొంచెం ముందే తండ్రికి 'అన్నం తీసుకు బయలుదేరింది గౌరి. చినబాబు దూడలపాకలో ఉంటాడా ఉండడా అనుకుంటూ నడుస్తోంది.

'ఉంటేమాత్రం నేనెందుకు వెళ్ళాలి అక్కడికి? ఎవరైనా చూస్తే?.... అమ్మయ్యో!... నేనసలు వెళ్ళనే వెళ్ళను.. వెళ్ళకపోతే చినబాబు యేమనుకుం

టాడో?...చూడనట్టు తలవంచుకు వెళ్ళిపోతే సరి...తీరా చినబాబు పిలిస్తే?... వినబడనట్టు తలెత్తకుండా వెళ్ళిపోతే సరి...'

అని పరిపరి విధాల ఊహించుకుంటూ నడుస్తోందేగాని చినబాబు పాకలోనుంచి తనను చూస్తున్నట్లు, చూచి నవ్వుతుంటున్నట్టు, నవ్వుతుని గౌరీ అని పిలచినట్లు తనలో తానే భావించుకుని అకస్మాత్తుగా దూడల పాకవంక తిరిగింది. ఎక్కడా కనబడలేదు చినబాబు. రెండుకళ్ళు పదికళ్ళు చేసుకుని వెతికింది. చినబాబు లేడు. చినబాబు లేకపోవడం యేదో బాధగానే ఉంది మనస్సుకు. అనుక్షణం తనను చినబాబు గౌరీ అని పిలుస్తున్నట్లుగానే భావించుకుని పాకవంక చూస్తోంది. తనకు తెలియకుండానే కాళ్ళు అప్రయత్నంగా పాక వద్దకు నెమ్మదిగా తీసుకువెళ్ళాయి. పాకలోను లేడు చినబాబు. గౌరి పాకలో అడుగు పెట్టేసరికి పోట్లఆవు తనవంక బుసలు కొడుతూ చూస్తోంది. ముందు గౌరి హడలిపోయిందిగాని ఆ ఆవును కట్టివేసిన యినుప గొలుసును చూచాక కొంత మనశ్శాంతి కలిగింది. పాకంతా కలియచూచింది. చినబాబు కనబడలేదు. ఏదో నిరాశ బాధ పెడుతూనేవుంది గౌరిని. తాను పాకలోనికి రావడం యెవరూ చూడలేదుకదా అని అనుమానంతోచి నలుప్రక్కలా చూచింది. ఎవ్వరూ కనుచూపుమేరలో కనబడలేదు. అమ్మయ్య అనుకుంది. కొన్నేపు నిలుచుంది. పోట ఆవు తనవంకే చూస్తూ ముట్టె పైకెత్తి బుస్సుమంటోంది. గౌరి కూడా ఆవు వంక చూచి ఒక అడుగు పైకెత్తి బుస్సుమంది. చినబాబుతో చెప్పి నీ పని పట్టిస్తానుండు అంది. ఆ అనడం కొంచెం గట్టిగానే అంది. మళ్ళీ ఎవరైనా విన్నారేమోనని భయంవేసి నలువైపులా చూచింది. ఎవరూ లేరు. నిన్న ఆవు తరుముకొచ్చినచోటు, చినబాబు కాళ్ళ మీద తాను పడ్డచోటు చూచుకుంది. ఆ ఘటాన్ని మళ్ళీ భావనలోనికి తెచ్చుకుని ఆనందిస్తోంది గౌరి. అప్రయత్నంగా కళ్ళు మూతలుపడ్డాయి. క్షణకాలం ఆనందపారవశ్యంలో మైమరచింది గౌరి. ఉలిక్కిపడింది. వెనక్కు తిరిగింది. చినబాబు కనబడనందుకు కొంచెం కోపమే వచ్చింది ఇంకెప్పుడూ పాకదగ్గరకు రాకూడదనుకుంది ఎక్కడైనా చినబాబు కనిపించి పలకరించినా మాటాడకూడదనుకుంది గౌరి. చకచకా నాలుగు అడుగులు వేసింది. వెనకాల యెవరో జడపట్టుకు లాగినట్లయి వెనక్కు తిరిగింది గౌరి. ఇంకెవరు?...చినబాబు. గౌరీ అన్నాడు. సిగ్గు ముంచుకొచ్చింది గౌరికి. రెండుచేతులతో కళ్ళుమూసుకుంది. ఆ రెండు చేతులు తీసేశాడు చినబాబు. తల వంచుకుంది గౌరి. తల పైకెత్తాడు చినబాబు. చినబాబుని చూడడానికి సిగ్గువేసింది గౌరికి. సిగ్గుతోపాటు భయం ఆవరించింది. ఎవరైనా చూస్తున్నారేమోనని నలువైపులా చూచింది. చినబాబు చేతుల్లోంచి బయటపడాలని ప్రయత్నిస్తోంది. వదులు చినబాబూ అంటోంది. మాట్లాడలేకపోతున్నాడు చినబాబు, కాని గౌరిని వదలిపెటడంలేదు. ఇద్దరికీ యెందుకో చేతులు వణుకుతున్నాయి. 'నిన్ను పెళ్ళిచేసుకుంటాను గౌరీ' అంటున్నాడు కంగారుగా వణుకుతున్న పెదవులతో చినబాబు. 'అమ్మయ్యో! నన్నా? పెళ్ళా? నాకొద్దు బాబూ!' అంటూ గౌరి చినబాబు చేతుల్లోంచి బయటకు రావడానికి పెనగులాడుతోంది. వదలిపెట్టడంలేదు చినబాబు. మొదట్లో చినబాబును చూడడానికి గౌరి ఎంత తహతహలాడిందో ఇప్పుడు చినబాబు చేతుల్లోంచి బయటపడడానికి అంతకంగారు పడుతోంది. బయట వర్షం ప్రారంభించింది. తడిసిపోతావు గౌరీ అంటూ చినబాబు గౌరిని ఏలాగయితేం పాకలోకి తీసుకువెళ్ళాడు

బయట ఉరుములు మెరుపులతో వర్షం ప్రారంభమైంది. హోరుమని వీస్తోంది గాలి. ఇదేదో ప్రళయానికే దారితీస్తుందేమో అనుకుంటున్నాడు దుక్కి దున్నుతున్న రత్తియ్య కాపు. తనకు భోజనం తెస్తూ తనబిడ్డ గౌరి ఈవర్షంలో ఏంచిక్కుపడిందోనని బాధపడుతున్నాడు. వేళ తప్పిపోయింది. పాపం పాటుపడుతున్న రత్తియ్యకాపు ఆకలితో బాధపడుతున్నాడు. ఆ అన్నం కాస్తా మధ్యదారిలో చినబాబు పాకలో చిక్కుపడిందని. రత్తియ్యకాపుకేం తెలుస్తుంది. ఎదురుచూస్తున్నాడు. ఆఖరికి గౌరి ఆ వర్షములో తడుస్తూనే అన్నం తెచ్చింది. తండ్రి ముఖం చూడడానికి భయంగావుంది గౌరికి. పాపపంకిలంలో మునిగిన తన చేతులతో తండ్రికి అన్నం పెటడానికి జడుస్తోంది గౌరి చేతులు వణుకుతున్నాయి.

'ఏం అమ్మా! అలా ఉన్నావేం' అన్నాడు రత్తియ్య కాపు వర్షంలో తడవడం మూలంగా జరవొచ్చినట్టుందయ్యా' అంది గౌరి జడుస్తూ.



# చినబాబు పెళ్లిసంబరం



ఏం చెయ్యనమ్మా, రెక్కాడితేగాని డొక్కాడదు. తల్లిలేని నిన్ను సుఖపెట్టడానికి బదులు యీ విధంగా కష్టపెడుతున్నా తల్లీ! అని కళ్లనీళ్ళు పెట్టాడు రత్తియ్య కాపు.

అది ఆనాటిసంగతి. దానికి ప్రతిఫలంగా గౌరి యీనాడు మాతృమూర్తి కాబోతోంది. మూడోమాసం గర్భిణి ఏవని చెబుతుంది తండ్రికి.

ఈరోజు తండ్రి అనుమానించినట్లు పసిగట్టింది గౌరి. నిద్రపట్టడం లేదు. మాడిమసి బొగ్గు అయిన పురుగును మరోసారి చూచింది. అప్రయత్నంగా గౌరికంటి వెంట నీటి బిందువులు బయలుదేరి ధారగా ఏర్పడ్డాయి. ఊరుకోబెట్టే వారెరీ! లేరు. ఎంతో సేపు యేడ్చింది.

ఊరిమధ్యలో చినబాబు పెళ్ళి ఊరేగింపులో వాయించే వాయిద్యాల శబ్దాలు గౌరి హృదయంమీద సమ్మెట దెబ్బలులా తగులుతున్నాయి. పటేలు పటేలు మని పేలే టపాకాయలశబ్దాలతో తనగుండె పగిలిపోతున్నట్టే భావించుకుంటోంది. తన పీకను యెవరో రెండు చేతులతో నసుకుతున్నట్లనిపించింది గౌరికి. కంగారుగా మంచంమీద నుంచి లేచింది. నలుప్రక్కలా చూచింది. ఎవరూ లేరు.

నక్కల అరుపులు, కీచురాళ్ళ కూతలు గౌరికంగారుకు మరింత దోహదం చేస్తున్నాయి. తలుపుతీసి చూచింది. గాఢాంధకారం చినబాబు పెళ్ళితాలూకు తారాజువ్వలు ఆకాశంలో పేలి రంగు రంగుల కాంతుల్ని వెదజలుతున్నాయి. ఆకాంతుల్ని చూడలేకపోయింది గౌరి. దభాలున తలుపు మూసేసింది. అప్రయత్నంగా గౌరిదృష్టి మాడిన పురుగుమీద మరోసారి పడింది. వచ్చి మంచంమీద పడిపోయింది. వెక్కి వెక్కి యేడుస్తోంది. ఆమె ఆ వేదనను అర్థం చేసికొని ఆమెతోపాటు యేడుస్తోందా అన్నట్లు ఆ పూరిపాక ప్రక్క ఒక కుక్క మెయ్యోమని మోరపైకెత్తి యేడుస్తోంది. అలా కుక్క యేడవడం అపశకున మనుకుని అదలిస్తున్న రత్తియ్యకాపు గొంతు గౌరి చెవులబడింది. నిద్రపోతున్నట్లు పడుంది. రత్తియ్య కాపు తలుపుతోసుకు లోనికి వచ్చాడు. దీపపు బుడ్డిని చేత్తోపట్టుకుని గౌరి మంచందగ్గరకు వచ్చాడు. గౌరి నిద్రపోతున్నట్లు పడుంది. పళ్ళు పట పట కొరికాడు రత్తియ్యకాపు, వెనక్కి తిరిగాడు. దీపం యథాస్థానంలో ఉంచాడు. చూరులో ఉన్న గొడ్డలిని ఒకచేత్తో లాగాడు. ఆగుడ్డి దీపపు కాంతిలో ఆ గొడ్డలి మొన తళుక్కున మెరిగింది. గౌరి చూస్తూనే ఉంది. గుండెలు కొట్టుకుంటున్నాయి. రత్తియ్య కాపు గౌరి మంచం దగ్గరకు వచ్చాడు. బలంగా గొడ్డలి పైకెత్తాడు. కెవ్వుమని కేకేసి అయ్యా అంటూ తండ్రి కాళ్ళమీద పడింది గౌరి. రత్తియ్య కాపు హృదయం ద్రవించింది. గొడ్డలి పారేశాడు. కూతురుదగ్గరకూలబడ్డాడు. రెండుచేతులతో తల బాదుకుని యేడుస్తున్నాడు రత్తియ్యకాపు. గౌరి యేడుస్తోంది.

'ఎంతపని చేశావమ్మా! నా గౌరవాన్ని కాస్తా గంగలో కలిపేశావా?' అన్నాడు. అంతలోనే కోపంతో రత్తియ్యకాపు ఆపాదమస్తకం వణికిపోయింది. రెండు చేతులతో గౌరి జుట్టు రెండు ప్రక్కల పట్టుకొని తలపైకెత్తాడు. ముఖంలో ముఖంపెట్టి గద్గదస్వరంతో ఎవరైనా వింటారనే భయంతో నెమ్మదిగా 'నిజం చెప్పు. ఎవడు నిన్నిట్లా చేసింది. నా కొంపకు చిచ్చు పెట్టింది యెవడు? నిజంచెప్పు' అంటూ రెండు చేతులతో గౌరి పీక పట్టుకున్నాడు.

చెప్పు. నిజం చెప్పు. చెప్పకపోతే పీక పిసికేస్తా. నిన్ని కొంపలో కట్టేసి యీ కొంపకి నిప్పంటిస్తా. నేను కూడా ఇందులో పడి చచ్చిపోతా. చెప్పు. నిజం చెప్పు! అని గౌరి పీక పిసుకుతున్నాడు రత్తియ్య కాపు.

ఆ రౌద్రాకారాన్ని చూచిన గౌరి హడలిపోయింది. అప్రయత్నంగా 'చిన బాబు' అంది.

తోకత్రొక్కిన త్రాచులా లేచాడు రత్తియ్యకాపు. 'చినబాబా' అని అరిచాడు.

అవునంది గౌరి.

గొడ్డలి తీసుకున్నాడు రత్తియ్యకాపు, ఆవేశంతో తలుపు లాగాడు. అంధకారం లోకి పరుగెత్తాడు. అయ్యా అయ్యా అంటున్న గౌరి మాటలు వినిపించుకోలేదు. తిన్నగా ఊరేగింపులోనికి వచ్చాడు.

నాయుడుగారి కున్న పలుకుబడి మూలంగా కొడుకు చినబాబు పెళ్లికి ఊరిడి జనం ఊరేగింపులో పాల్గొన్నారు. రత్తియ్యకాపు గొడ్డలితో తిన్నగా పల్లకీ దగ్గరకు వచ్చాడు.

ముత్యాల పల్లకీలో ముచ్చటగా కూర్చున్నాడు చినబాబు. ఎదురుగా పెళ్ళికూతురు కూర్చుంది. పూర్వాచారంప్రకారం తల వంచుకుని కూర్చోలేదు. మధ్య మధ్య వారగంటిని చినబాబుని చూస్తోంది. చినబాబు కూడా మందహాసం చిందుతున్న ముఖంతో పెళ్ళికూతురు వంక చూస్తున్నాడు. చూచాడు రత్తియ్యకాపు.

నాయుడుగారి పాలెం చేస్తున్నాడు గనుక యెప్పుడూ నాయుడుగారి యింటి దగ్గరే ఉండేవాడు రత్తియ్యకాపు. చినబాబు తల్లి చిన్నతనంలోనే చచ్చిపోతే చినబాబుని తన బుజంమీద యెక్కించుకుని త్రిప్పేవాడు. తన వీపుమీద కూర్చోబెట్టుకుని గుర్రంలాగ నడిచేవాడు.

అకస్మాత్తుగా చినబాబు రత్తియ్యకాపు ముఖం వంకచూచి సిగ్గుపడి చిరునవ్వుతో తలవంచుకున్నాడు. చిరునవ్వు చిందులాడుతున్న చినబాబు ముఖం చూచేసరికి రత్తియ్యకాపు కోపం అంతా చల్లారింది. తన చేతులలో చినబాబుని పెంచిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. మానవత్వాన్ని కూడా వశింపజేసిన తన ఆవేశాన్ని తానే నిందించుకున్నాడు. వారగంటిని భార్య చూపుల్లో చూపుల్ని కలిపి మందహాసం ఒలికిస్తున్న చినబాబు ముఖం చూచే సరికి జాలివేసింది. జీవితాంతం చినబాబుతో సంసార సుఖం అనుభవించాలని వచ్చిన ఆ పెళ్ళికూతురు మెడలో మంగళసూత్రం కాస్తా తెంపాలనుకుని వచ్చిన తన ఆవేశానికి తానే సిగ్గుపడ్డాడు. ఆ నూతన దంపతుల్ని సుఖంగా ఉండమని మనస్సులో దీవించాడు. ఊరేగింపు ముందుకుసాగింది. నిలబడిపోయాడు రత్తియ్యకాపు, క్షణకాలం మౌనం. వెనక్కి తిరిగాడు. గుండె గుభేలుమంది. ఊరి చివర ఆకాశం యెత్తున మంటలేచింది. అది తన యింటి వేపేనని గ్రహించాడు. ఇళ్లు అంటుకున్నాయి అని ఊరేగింపులో కలవరం పుట్టింది. గుండెలు బాదుకుంటూ రత్తియ్యకాపు పరుగెత్తాడు. ఇంకేముంది తన యిల్లే లోపలే అంటుకుంది. గౌరీ అని అరిచి లోనికి పరుగెత్తాడు. గౌరి చీర మీద కిరసనాయిలు పోసుకుని అంటించుకుంది. ఆవేశం ఆవేదన యేకమై అమ్మా అని వెళ్ళి గౌరిని కౌగిలించుకుని బయటకు తీసుకురావడానికి ప్రయత్నించాడు. నలుప్రక్కలా అంటుకున్న పూరిపాక కూలిపోయింది. గౌరితో పాటు రత్తియ్య కాపుకూడా కాలిపోయాడు. వారిద్దరి ప్రాణవాయువులు అనంతవాయువులో కలిసిపోయాయి. పరుగెత్తుకు వచ్చిన జనం నీళ్లకోసం కంగారుపడే సరికి అగ్నిహోత్రుడు ఆ రెండు ప్రాణాల్ని వారి గౌరవ రక్షణార్థం తానుభక్షించి శాంతించాడు.

చినబాబుచేసిన మోసం యెవరికి తెలుస్తుంది. రత్తియ్య కాపు గౌరవానికి అవంతైనా లోటురాలేదు. బ్రతికిన నాలుగు రోజులూ పౌరుషంగానే బ్రతికాడు రా అన్నారు. పాపం ఆతండ్రి కూతుళ్లకి యీ రూపేణా చావు రాసిపెట్టాడు భగవంతుడు అని కొందరన్నారు. అంతే గాని అసలు సంగతి యెవరికి తెలుస్తుంది ఒక్క చినబాబుకి తప్ప. గౌరి పరిస్థితికి కన్నీరు కార్చే దెవరు? అయితే హాయిగా, వినోదంగా, భార్యతో కేళీవిలాసాలలో కాలంగడిపేటప్పుడైనా చినబాబు హృదయంలో గౌరి జ్ఞప్తికి రాకపోతుందా? వచ్చి హృదయాన్ని దహించకుండా ఉంటుందా? కళ్ళు చెమ్మగిల్లకుండా ఉంటాయా? ★




రాయుడు, దిలుబాల కో క్రొనీల విషాద గాథ మొదలుపెట్టేవరకు ఎగురుగా గేటుదగ్గర కారొకటి ఆగింది. డ్రైవరు ఇవతలికివచ్చి గేటుతీసి, బండి తోలుకుని లోపలికి వస్తున్నాడు.

"లేవండిసార్ లేచి నించుని ఆ సిగరెట్టు కాలుస్తూ పోజులో నిలబడండి చేపా" అన్నాడు రాయుడు హటాత్తుగా లేచి నిలబడి. రాజుకి బుర్రపని చేసేలోగానే శరీరం రాయుడి ఉత్తర్వును అమలు జరిపింది. అంతలోకే కారు పోర్టికోలో ఆగింది. అందులోంచి నల్లటి గుండ్రటి కాలీదిగి, గుండారి ఓసారి సరిసరి చేసుకుని "అణ్ణా ఇల్లెయో?" అంది తెల్లగా నవ్వి:

రాయుడు వెంటనే జవాబివ్వలేదు. "ఎవరు సుబ్బన్న గారేనా? లేరు. బెంగుళూరెళ్ళారు" అన్నాడు ఎటో చూస్తు. రాజేదో అనబోయి రాయుడు గిలగానే ఆగిపోయి, తెలబోయాడు. ఆ వైనం చీకట్లో ప్రేతకులకు కొట్టొచ్చినట్టు కనబడనందువల్ల, రాయుడు పచ్చి అబద్ధాలు ఆడుతున్నట్టు పసిగట్టడానికి వీలులేక పోయింది.

ఆ వచ్చిన పెద్దమనిషి నొచ్చుకున్నాడు. "ఆ...చ్చో...చ్చో...చ్చ్రా ఉంట్రని దా వె వసిణే. నేటికి షో ఉణని నేన్నా చెప్పి ఉంశ్నె. పద్దుకొండు గంటకు బండి తెస్తుననికూడ చెప్ప శె. యేమి ఇది. నిండా అక్రమంగా ఉందే" అన్నాడు జనాంతికంగారుగా.

రాయడు గొంతు సరిచేసుకున్నాడు.

"అదేనండి. చెప్పారు. అరెంటు పనిగా బెంగ్లూరు..." అన్నాడు. తరవాత 'మీరు రాజన్ గారు' అని ఆరోపించాడు. ఆయన ఘను పిచ్చరు పెద్ద హిట్టయిందని ఉద్ఘాటించాడు. దారుణమైన హిటు అని పునరుద్ఘాటించాడు. ఇపుడు కాష్యము పిక్చరు తీరారు అని వెల్లడించాడు. ఇది గారంటీ హిట్టవుతుందని హామీ ఇచ్చాడు భయపడ్డని ఉద్ఘోషించాడు. ఆ తరవాత వీరు రాజు గారు. ప్రొడ్యూసరు. పై పెచ్చు సుబ్బన్న గారికి అల్లుళ్ళ" అని పరిచయం చేశాడు రాజుని.

"రొంబసందోషం. అదిసరిదా...అప్పా తాంగళ్ యార్." అన్నాడు రాజన్ గారు ఆనందభరితుడై.

రాయుడు సకుపడాడు. "ఘోనిట్టోమన్ని గురించి మనం చెప్పకోకూడదుగాని మనం కారెక్టరాక్టరం, ఏలనంటెండి. రెండు మూడు హిట్ పిక్చర్లలో చిన్న వేషాలుకూడా వేశాం" అన్నాడు.

* * *

మళ్ళీ పాతసమస్య వచ్చింది. రాజన్‌కి. సుబ్బన్న గారు లేరుగాబట్టి ఏంచెయ్యాలి అని.

వారి అల్లుడిగారిది చాలా మంచిచెయ్యి అని వెల్లడిచేశాడు రాయుడు. రాజు తక్షణం సిగరెట్టు పారేసి చేతులు వెనకదాచుకున్నాడు. రాయుడు బలవంతాన వాటిని ముందరికిలాగి రాజన్ చేతులో పెటాడు. ఆనక, రాజు హస్తవాసిపడి హిట్టయి ఊరుకున్న హిందీ, మలయాళి, తమిళ పిక్చర్ల జాబితా ఒప్పగించాడు.

రాజన్ పరమానందభరితుడైపోయి, రాజుని కౌగలించుకుని, "మీరువచ్చిదా కావలెసార్. పిచ్చరు చూసిదా కావలె. మాకు మీ బ్లెస్సింగ్సు ఇచ్చిదా కావలె." అని అతన్ని లాక్కుపోయి కార్లో కూచో పెట్టి తను ఎక్కాడు. ఆనక ఏదో తోచి, సార్ మీరు కూడ వస్తురా" అంటూ వరండాలోకి చూసి అన్నాడు

"నేను వచ్చిదా కావలె. రాజు ఎక్కడ పోతే అక్కడ ఉండిదా కావలె" అన్నాడు రాయుడు కారు సీటు అవతలయాలలోంచి.

రాజన్, ఈ చుశుదనం చూసి ఆశ్చర్యపడి లేవడం మరిచిపోయి కుని పాట్లుపడసాగాడు.

రాజుకి నోటమాట లేదు.

కారు నేరుగా... స్టూడియోలో, ప్రివ్యూధియేటర్ దగ్గర ఆగింది. అరు బయట కుర్చీలు వేసి ఉన్నాయి. ఇద్దరు కురాళ్ళు బీడి కాలుస్తున్నారు. రాజన్ కారు దిగుతూనే రాజానీ, రాయుణ్ణీ కూర్చోమని, కుర్రాళ్ళని ఎటో పంపి, తను మరో వైపు వెళ్ళాడు హడావుడిగా.

"ఏమిటిదంతా బ్రదర్" అన్నాడు రాజు దగరో ఎవరూ లేకుండా చూసి.

"మీకు తెలీదాండి ఇంకా తెలీలేదా?" అన్నాడు రాయుడు ఆశ్చర్యంగా.

"నేన వేషా లెయ్యక చెప్పు" అన్నాడు రాజు ముక్తసరిగా.

రాయుడు జాలిపడ్డాడు.

"మీరు లాభం లేదు సార్ సినీఫీల్డుకి... ఇవన్నీ తెలీపోతే రేపొద్దున్న పెద్ద ప్రొడ్యూసరెలా అవుతారు?...ఇపుడు మన్ని తీసుకొచ్చాడే రాజన్ గారూ. ఈయన టమిల్ ప్రొడ్యూసరనమాట ఈయన మొదటి పిచ్చరు తీసినపుడు, ఓ తమాషా అయింది. అవాళా ఇలాగే మే 18 తారీకు రాత్రి పన్నెండింటికి రాహుకాలం లేదని ఈయన షో వేసుకుంటున్నాడు ఇక్కడ అలా వేస్తారులే. డిస్ట్రిబ్యూటరూ, స్టార్లూ వాళ్ళవాళ్ళూ చూడడానికని. ఏం. అవాళ మీ మామగారు సుబ్బన్న గారు ఇక్కడే తిరుగుతున్నారు, ఎవరన్నా కారులో లిఫిచ్చి మాంబళంలో దిగబెడతారేమోనని. ఆయన కారు చెడిపోయింది. పళే ఇంతలోకి రాజన్ ఆయన్ని పలకరించా

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

ఓ నాలుగు గంటల లాగితే తను దిగ చెడతానన్నాడు. అప్పటికీ వీళ్ళకి కొంచెం పరిచయం వుంది. సరే, సరేనన్నాడు మీ మామగారు. అయితే వచ్చి మా ఫిలిం చూడండి అని పిలిచాడు రాజన్. ఫిలిం మొదలెడుతూండగా ఎలకొకటి తెరదగ్గర్నుంచి పరిగెత్తి వెళ్ళింది. అప్పుడు మీ మామగారు ఎగ్గిరి గంతేసి, మీ పిచ్చరు హిట్టవుతుంది రాజన్ గారూ. ఈ స్టుడియో ఎలక చాలాలక్కీ ఎలకా, షో వేసినప్పుడు గాని, రికార్డింగు టైములో గాని ఇది కనిపిస్తే ఆ పిచ్చరు హిటేనూ అని చెప్పాడు. రాజన్‌కి ఆ సంగతి కొద్దిగా తెలుసు.

ఆయన పొంగిపోయాడు ఆనందంతో. నిజమేనండీ జుప్పగారూ! మా పిచ్చరు ఫస్టు సాంగు రికార్డింగు టైములో కూడా ఈ ఎలిదా వచ్చింది అని చెప్పాడు.

"అప్పుడు సుబ్బన్నగారు నవ్వి, ఈ ఎలక రావాలని ఎందరో తపస్సు చేస్తారండీ రాజనుగారూ.—మీకు షాడైనా నరే ఇది ఒక్కసారి కనిపిస్తే లక్షలు కుమ్మరిస్తారండీ బాబూ. మీరు గొప్ప అదృష్టవంతులు బాబోయ్! కాబట్టే వచ్చిందండి అన్నాడు. అంతలోకి—"

* * *

అంతలోకి ఒక రాజకుమారుడు అలావెళ్తున్నాడు. ఎవరో ఎక్కడినించో ఓ మంగళ హారతి పళ్ళెపట్టుకు వచ్చారు. అతడు హారతికళ్ళకద్దుకుని, మూడుగుంజీలు తీసి ప్రసాదం పుచ్చుకుని, కారెక్కి వెళ్ళిపోయాడు.

అదేమిటన్నాడు సద్దప్పగించి చూస్తున్న రాజు.

"వాళ్ళో పిచ్చరు తీస్తున్నారులే. ఇవాళ కెమేరస్సీరు తీశారు. అందులో గవుణ్ణి కొప్పడ్డం ఆదీ ఉంటుంది. ఎందుకేనా మంచిదని పూటింగు ముందరా, అయిపోయాక రెండుపూజలు చేసి హారతిపుచ్చుకుమరీ తిడతారులే...నీకు తెలీదా? తరవాత ఈ పిలిం డబ్బాల పెట్టు ఒకటి తిరపతి వెళ్తుంది. అక్కడ స్పెషలు పూజా, హారతీ అయ్యాక నే పిక్చరు రిలీజు చేస్తారు. దేవుడితో గొడవగదా. వీళ్లు తిటినట్టు దేవుడు లేకపోతే ఫరవాలేదుగాని, ఉంటే పగబట్టి పిచ్చరు హిట్టవకుండా చెయ్యొచ్చుగదా. అంచేత" అన్నాడు రాయుడు గంభీరంగా.

"హశారా" అన్నాడు రాజు.

'హశారా లేదు కలకత్తా లేదు. వినండి సార్. ఏం? చివరికి రాజన్ సంగతి ఏమైందో తెలుసా, ఆ పిచ్చరు సిల్వరు జూబిలీలు చేసుకుంది. అప్పట్నుంచి రాజన్‌కి ఆ స్టుడియో ఎలకన్నా, మీ మామగారన్నా మహాగురి. ఆ పిచ్చరుకి మే 13-న అర్ధరాత్రి షో ఇచ్చారుగదా. అది హిట్టయింది. అందుకని ఈ పిచ్చరుకీ మే 13 నే అర్ధరాత్రే ఇస్తున్నారు. అవాళ సుబ్బన్నగారు ఆ పిచ్చరు చూసి రాజన్ కారులో పానగల్ పార్కుదాకా వెళ్ళారు. ఇవాళా అలా చేద్దామనే ఇతను ఇందాకా వచ్చాడు మీరు ఆయన అల్లుడనీ, మీ హోందుకూడా లక్కీదనీ చెప్పబట్టే మన్ని పిల్చాడనమాట."

"మరి ఎలకో"

"ఎలక వస్తుంది. మీ మామగారూ లేపోతే, ఎలకా రాపోతే ఇవాళ షో అసలు వెయ్యరంతే......మా లేక! ఇప్పుడు రాజన్ గబగబా పరిగెత్తాడు. ఎందుకని?" అన్నాడు రాయుడు.

'ఏమో.'

"ఏట్బే లాభంలేదు. ఉల్లిపాయ పకోడీలు దల్లితే ఎలక ఎక్కడున్నా వస్తుందని ఆయనకి ఆశ. అందుకని పకోడీలు తెప్పించడానికి పరిగెత్తాడు ఈమాత్రం తెలీదా?" అన్నాడు రాయుడు హేళనగా.

'తెలీదు' అన్నాడు రాజు.

"అయితే మీరు లాభం లేదు." ★

(మరోవారం వచ్చే కథ)

సీరియల్ నవల......

# జీవనలీల

..మూలం.....

మానిక్ బంద్యోపాధ్యాయ

...అనువాదం...

మద్దిపట్ల సూరి



## 4

[గతవారం తరువాయి]

ఈసారి పూజలు కార్తీక మాసంలో వచ్చాయి. సేన్‌దీదీశరీరం మీద మశూచికపు పొక్కులు బాగా పైన కన్పిస్తున్న రోజుల్లోనే ఊళ్లో పూజా ఉత్సవాలు ప్రారంభమయాయి. ఈ యేడు మామూలు ఉత్సవాలుకావు. ఊళ్లో జమీందారు శీతలబాబుగారింటివద్ద మూడురోజులు వరుసగా ఒకటే యక్షగానాలు, ఒకటే బొమ్మలాటలు... సాంత్ గ్రామపు ప్రదర్శనశాల-ఇవా పూజలూ అదీ యేటా ఉండనే ఉంటాయి. ఏదో నిద్దరలో తున్నట్టుండే గ్రామీణ జీవితంలో హఠాత్తుగా పెద్ద సంచలనం ప్రారంభమైంది. ఒక్క శశిమాత్రమే సేన్‌దీదీనిగురించిన ఆదుర్దాలో ఉన్నాడు.

భాగోతాలు సప్తమిరోజు రాత్రినుంచి మొదలు. భాగోతుల జట్టు వాళ్లు అంతకుముందే ఊళ్లోకి వచ్చారు. శీతలబాబు బయానా ఇచ్చేప్పుడే వాళ్ల అధికారితో 'మీజట్టులోని వారంతా ఒకటి రెండురోజులు ముందుగానే రావాలి. ఒకరోజల్లా హాయిగా నిద్రపోయి, ప్రయాణపు బడలికతీర్చుకుని, తర్వాత ప్రారంభిద్దురుగాని ప్రదర్శనాలు, అని చెప్పాడు.

ఈ సారి బయానా యిచ్చిన యక్షగాన సమాజం ఈ ప్రాంతపుదికాదు. వినోదినీయక్షగాన సమాజం ప్రధాన కార్యాలయం కలకత్తాలో ఉంటుంది. రాజపూర్ లోని మధురాసాహాలు వ్యాపారంమీద కలకత్తా తరచు వెళ్లి వస్తూంటారు. కొద్దిరోజుల క్రితం కొడుకు పెళ్లి సందర్భంలో ఈ సమాజంవాళ్లనే వారు కలకత్తానుంచి పిలిపించి రప్పించారు. ఊళ్లో అందరూ ఆ సమాజాన్ని మెచ్చుకోవటం చూసి, శీతలబాబు అప్పుడేవారికి బయానా యిచ్చి ఉంచాడు.

నిన్న సాయంత్రమే వినోదినీ యక్షగానసమాజం ఊళ్లోకి వచ్చింది. పెద్దపార్టీ, జనం చాలామంది ఉన్నారు—వాదివెంట బోలెడన్ని కొయ్యపెట్టెలనిండా ఎన్నో సామానులు. అవి అన్నీ చూసి ఊళ్లో [illegible] చాలా సంబరపడ్డారు. ఆ జట్టు అధికారి బి. ఏ. ఫెం[illegible]యితే యేం వారిజట్టులో ఇద్దరు బి. ఏ. ప్యాసయిన వాళ్లుకూడా ఉన్నారని విన్న దగ్గర్నుంచి అందరూ తహతహ పడసాగారు.

"డ్రామాలా? ఆఁ?"

"ఉహూఁ. యక్షగానాలు—వీధి భాగోతాలు..."

"బావుంది, బావుంది. అవి ఐతే నేబాగుంటాయి అసలు."

సాంత్ గ్రామంలోని కచేరీ చావడి బాగుచేయించి సమాజం వారికి విడిది ఏర్పాటుచేయించారు. జట్టులో వాళ్లందరికీ దోమతెరలేవు. ఒక్క కుముద్ కే వుంది. అతడు రాత్రంతా హాయిగా నిద్రపోయాడు. పొద్దున్నే లేచి శశిని కలుసుకుందామని వచ్చాడు శశి తెల్లబోతూ "నువ్వు? అరె నువ్వా కుముద్?" అన్నాడు.

కుముద్ నవ్వుతూ—"అహఁ నేను ప్రవీరుణ్ని ఇప్పుడు."

శశి కిదేమిటో అర్థం కాలేదు సరిగ్గా. "ప్రవీరుడేమిటి ప్రవీరుడు?" అనిఅడిగాడు.

"ఊళ్ళోకి వినోదినీ యక్షగాన సమాజంవచ్చింది. ఎక్కడ చూసినా ఓః ఒకటే కోలాహలంగా ఉంది కదా. నీకు తెలియదూ?"

"నువ్వు ఆసమాజంతో వచ్చావా కుముద్! యక్షగానాలాడుతున్నావా నువ్వు?"

ఆమాట విశ్వసించటానికి వీలేనంత విస్మయం కలిగింది శశికి. కుముద్ మారిపోయాడు. ముఖంలో ఆ తేజస్సు లేదిప్పుడు. ఏదో పరధ్యానంగా ఉంటున్నట్లు—ఇదివరకులాగా జుట్టు రేగిలేదు. ఇంత ప్రొద్దున్నే వచ్చినా జుట్టు దువ్వుకుని, టాయ్‌లెట్ అయ్యే వచ్చాడు. ఏమయినా ఎంత మారినా కుముద్ కుముదే. నిఘంటువు చూడకుండా తమకు ప్రధాన పాఠ్యభాగమైన 'షెల్లీ' కవిత్వాన్ని వ్యాఖ్యానించి చెప్పినవాడు కుముద్!

"ఆపకేం? ప్రవీర్, లక్ష్మణ్, చంద్రకేతు, మొదలైన వేషాలెన్నో వేస్తూఉంటా. గొంతు చించుకుని, పోర్షన్ అప్పచెప్పేస్తూ ఉంటాను. ఏడు మెడల్స్ వచ్చాయి, ఇప్పటికే నాకు."

శశి తెల్లబోతూ—"రా, లోపలికి రా, వచ్చికూర్చుని అన్నీ సవిస్తరంగా చెప్పు అసలు." అన్నాడు.

కుముదుణ్ని శశి తన గదిలోకి తీసుకువెళ్లాడు...గదిలోకి వచ్చి కూర్చున్నాక—"ఎన్నాళ్లకెన్నాళ్లకి వచ్చావ్ కుముద్! ఇన్నా



# జీవనలీల



శీ మళ్ళీ ఇప్పుడు కలుసుకున్నాం. ఆశ్చర్యంగానే ఉంది" అన్నాడు మళ్ళీ మరోకసారి శశి. అతడి పక్కమీదకూర్చుని, ఇలంతా పరిశీలనగా చూసూ—"అంత ఆశ్చర్య పడాల్సిందేముంది ఇంగులో! మూడేళ్లనుంచీ—మన వంగదేశంలోని ఎన్ని ఊళ్లు తిరిగామో లెఖ్ఖలేదు—ఈ సారి మీ ఊరు వచ్చాను" అన్నాడు.

"ఆ జట్టులో ఎందుకు చేరావ్ ?"

"అదంతా ఓ గాథలే శశి! ఇంట్లోంచి వెళ్లకొడితే వెళ్లి ఉద్యోగంలో పోయిచేరాను. ఆ ఉద్యోగంలోనుంచీ వెళకొట్టడ్డాను. ఒక్కరోజులో ఉద్యోగం పోగొట్టుకున్నవాణ్ణి మళ్లీ ఎవరు పెట్టుకుంటారు? గాలికి తిరుగుతూ తిరుగుతూ బహరంపూర్ లో వినోదినీ యక్షగానసమాజం ఉందని తెలియటంతో, అక్కడికివెళ్లి వాళ అధికారితో స్నేహంచేసుకున్నాను. అతడు చాలా మంచివాడు. నన్ను పరీక్షచేసి, డెబ్బై రూపాయలు జీతం మీదం తన సమాజంలో చేర్చుకున్నాడు. రెండు మూడు సేనాధిపతి వేషాలు వెయ్యటంతో కంఠం జీరపోవటం తగ్గింది. బిగరగా ఆవేశంతో అరవటం నేర్చుకున్నాను. ఒక సంవత్సరంలో 'మానోయాక్టర్' నయాను. ఎనభై రూపాయలయింది జీతం. నెలకి ఎనిమిది ప్రదర్శనాలకంటె ఎక్కువ వేయాల్సివసే ఒక్కొక్కదానికి పది రూపాయలు అదనంగా యిస్తారు. మా గ్రూప్ లో నాకెంత పేరుప్రఖ్యాతులనుకున్నావ్ ?" అని నవ్వుతూ "'గ్రాండ్ సక్సెస్' పో. ఏమనుకున్నావ్ ?" అన్నాడు కుముద్.

శశికూడా నవ్వాడు. "నువ్వు చివరికి యక్షగానాల్లోకి దిగిపోతావని నేను కల్లోకూడా అనుకోలేదు కుముద్ !"

"నేనుమాత్రం అనుకున్నానా ?"

అప్పుడిహ ఏం మాట మాట్లాడటానికి తోచక హఠాత్తుగా—"నువ్వు ఇవాళ ఇక్కడే భోంచేద్దువుగాని భాయీ! ఇవాళ్లా ఇక్కడే ఉండువుగాని" అన్నాడు శశి.

"ఓ! అలాగే."

శశిలో లోపల చాలా సంతోషించాడు-కుముద్ మళ్లీ ఇన్నాళ్లకి కన్పించాడుకదా అనికాదు ఆ సంతోషం. కుముద్ క్రిందికి దిగివచ్చాడు కదా అని. కుముద్ లో ఇప్పుడా పరధ్యానం — ఆ ఔద్ధత్యం లేవు. 'నేను అందరికంటె చాలా స్వతంత్రుణ్ణి, చాలా గొప్పవాణ్ణి' అని అనుకోవటంమరిచిపోయాడతడు. శశి ఇది అతణ్ణి చూసినప్పుడే గమనించాడు. కుముదుడి ముందు తాను చాలా అల్పుణ్ణని, హీనుణ్ణని అనుకునే వాడిదివరకు శశి. కుముదుడి గాథంతా విన్నప్పట్నుంచీ-ఇంత తెగింపు, ఇంత నిబ్బరం తనకి లేవుకదా అని అతడి మీద ఈ పత్తుగా ఈర్ష్యకూడా పడ్డాడు. ఇలాంటి అసాధారణమైన వ్యక్తిత్వం లేకపోవటంవల్ల తన జీవితంవృధా అయిపోయింది: ఇప్పుడు కుముద్ లో కన్పించే రవంత అశాంతి, సహజంగా ఉండాలని అతడు చేసే ప్రయత్నం యక్షగాన సమాజంలో చేరేటంత అధఃపతితుడు కావటం—చూస్తే అతడు శశికంటె కూడా క్రిందికి దిగజారిపోయాడు. కుముదుడు గొప్పవాడు అన్న భావం కాస్తా కరిగిపోవటం మొదలెట్టింది.

"నీ యిలూ-అదీ ముచ్చటగా ఉన్నాయి శశి, పల్లెటూళ్లో ఉన్నా అడివిలా చేసుకోలేదు." అంటూ కుముద్ మళ్లీ కొంచెం నవ్వాడు, ఆ నవ్వులో భీరుత్వం, అపరాధిత్వం వ్యక్తమయాయి శశికి. "నీ కెవరిల్లైనా పెళ్లి యెన్నాళ్లయిందనుకున్నావ్ ? జాలుగెళ్లయింది. సాంసారిక వాతావరణంముగ్ధుణ్ణి చేస్తోంది నన్ను, పెళ్లిచేసున్నావా?

"లేదు"

"చేసుకోలేదూ? మీ యిల్లుచూస్తే నీకుపెళ్లి అయివుంటుందని తోచింది. ఈ గది మరింత చక్కగా సర్ది పెట్టిందెవరు? చెల్లెలా? మెల్లాలో కన్పించిందీ ?"

"ఆ అమ్మాయి చెల్లెలుకాదు. మేనకోడలవుతుంది నాకు. నాకో చెల్లెలూ ఉంది, కాని చిన్నపిల్ల, ఎనిమిదేళ్లుంటాయి. సర్దటానికి బదులు అన్నీ చిందరవందంచేసి పోతుందది. నా మంచాన్ని అది బొమ్మరిల్లుగా చేసుకుంటుంది అటు చూడు, బొమ్మలన్నీ వరుసగా పడుకుని నిదరోతున్నాయి. అది వచ్చే వేళవుతోంది. వీటికి ఇహ మెలుకువ వసుంది. కాస్త ప్రయత్నంచేస్తే చనువవుతుంది భలే చలాకీగలది, తెలివైందీకూడా వచ్చేయేడు స్కూల్లో చేర్పించాలి"

శశి ఆలోచనలోపడి, తల ఊగిసూ "చేర్పించాలి అన్నాను, కాని అది సాగుతుందో లేదో భగవంతుడికి తెలియాలి. మా నాన్నకిలాంటివన్ని గిట్టవు. కొడుకు చదువుకొని చెప్పినమాట వినని వాడిలా తయారయాడుగా, ఇహ అదికూడా చదువుకుంటే ఎలా తయారవుతుందో స్కూల్లో గీలో చేర్పించవలసిన అవసరం లేదు లెదూ నేర్చుకుంటే ఇంట్లోనే నేర్చుకుంటుందిలే. అని అనవచ్చు ఆయన." అన్నాడు.

కుముద్ శశిముఖంలోని భావాన్ని గమనిస్తూ "ఈరోజుల్లో ఆడపిల్లల్ని స్కూల్ కి పంపించక వీల్లేదని మీ నాన్నకి నచ్చచెప్పు" అన్నాడు.

"నచ్చచెప్పటమా? నాన్నకా? ఆయన పూర్వకాలపు మనిషి."

శశి మాటమార్చి—"గది ఎవరు సర్దారన్నావ్ కాదూ? మనుషులకేం తక్కువ? ఇదీ వంగదేశం. సంపాయించేవాడొకడు. తినేవారుమాత్రం పదిమంది. ఇట్లా వాకిలీ సర్దిపెట్టేవాళ్ళు లేకపోలేదు. అయినా"—అంటూ "నాగది నేనే సర్దుకుంటాను." అని మిత్రుడికి కనుసైగలతో వ్యక్తపరిచాడు.

శశి యామినీకవిరాజ్ భార్యదగ్గరకి వెళ్లాలి. ఈ కర్తవ్యాన్ని త్రోసిపుచ్చుకునే మార్గంలేదు. మిత్రుడిచేత భోజనంచేయించి శశి వెళ్లిపోయాడు.

ఊళ్ళో 'పరదా' పటింపు ఇప్పుడంతగాలేదు. అయితే అది ఈ ఉళ్ళోని ఎరిగిఉన్నవాళ్లు ఎదురుపడ్డప్పుడే. శశియింటో ఆడవాళ్లు ఒకచోటకూడి, జపలు వేసుకుంటూంటే కుముద్ వారికేసే చూస్తూ కూర్చున్నాడు కాసేపయేసరికల్లా ఓ కుర్రాడువచ్చి తలుపు మూసివెళ్లాడు. కుముద్ గతుక్కుమని—'నేను వాళని చూడటం లేదే? వాళ్లు ఏంచేస్తున్నదీ చూస్తున్నాను. ప్రొద్దున్నే అందరూ కలిసి ఏంపనులు చేస్తున్నారా అని చూస్తున్నాను, అంతే—' అనుకున్నాడు తనలో...

చొక్కా వేసుకుని, కుముద్ అలాతిరిగి వద్దామని బయటికి వెళాడు. వీధిలోకిరాగానే హోరూఘోష్ యింటివెనుక తాటితోపుకి అవతలవైపుగాఉన్న పెద్దదిబ్బ కన్పించిందతడికి, అతడు అటువైపునే నడకసాగించాడు.

తాళ్ళచెరువు ఒడ్డుకు వచ్చాక, హఠాతుగా తన కాలు ఏదో రబ్బరులాంటి మెత్తటిదానిమీద పడ్డట్టు తోచింది అతడికి. రెప్పపాటులో ఆ మెత్తటిదానితల మట్టిలోంచి పైకివచ్చి అతడి చీలమండదగ్గిర చుట్టేసి కరిచింది. తోకవైపు అతడి పాదానికి చుట్టుకుపోయింది.

కుముద్ జీవితంలో చేసిన పాపం కాస్తా కూస్తాకాదు, కొద్దిగా చేసుకున్న పుణ్యానికి కొన్ని నిమిషాలపాటు లభించిన అసాధారణమైన గౌరవానంతరం ఇదీ ఇతడికి జరిగిన శాసి. కుముద్ దాన్ని తల దగ్గిర పటుకుని కాలినుంచి లాగేసేశాడు:

పాము! పాము!

ఆ కేక విని ముందు మతివచ్చింది—తడి ఒంటిమీద పాడిచీరని ఎలాగో అలా చుట్టపెట్టుకుని...

కుసుమ అలా రాలేకపోయింది. ఆమె రావటం కాస్త ఆలస్యమైంది.

మతి పాముని చూడగానే—"అది బురదకొయ్య. నీళ్ళల్లో ఉండేపాము. దానికి విషం ఉండదు" అన్నది.

కుముద్ కి మృత్యువంటే విపరీతమైన భయం. కుసుమ వచ్చి చెప్పేటంతవరకు కుముద్ కి మతిమాటమీద విశ్వాసం కలగలేదు. విశ్వసించాక కూడా సీలమండ పైభాగంలో జేబు రుమాల గట్టిగా బిగించి కట్టి—"శశికి ఒకసారి కబురుపంపు అమ్మాయి, చూస్తాడు. ఒక వేళ విషం ఉంటే? శశిని ఎరుగుదువుగా మావీధిలోనే ఉంటాడు! డాక్టరు" అన్నాడు.

కుసుమ ముసిముసినవ్వొకటినవ్వి, "ఇదుగో అమ్మాయ్ చినబాబుని పిలుచుకురా" అన్నది. ఆమెనవ్వు కుముద్ కి నచ్చలేదు.

"చినబాబు ఏమవుతారు?" కొంచెం సేపయాక కుసుమ అడిగిన ఈ ప్రశ్నకు కుముద్ ముక్తసరిగా "నా మిత్రుడు" అన్నాడు.

"చినబాబు - చెప్పాలంటే మాకు చాలా కావలసినవారు రెండుపూటలా వస్తూంటారు."

ఈమాట అన్నాక కూడా కుసుమని ఆత్మీయురాలినిగా భావించేట్లుగా లేదు కుముదుడి మనస్థితి. "బురదకొయ్యకి విషం ఎందుకుండదు?" అని అడిగాడు.

"అన్ని పాములకీ విషం ఉంటుందా? అది నీళ్లల్లో ఉండేది. ఒకసారి నన్ను కరిచింది. బహుశా ఆపామే అయి ఉంటుంది. ఓనాడు చాలా చీకటిలో ఈ చెరువులో స్నానం చేస్తున్నాను. షికారుగా వచ్చిన చినబాబూ గటుమీదనుంచుని మాట్లాడుతున్నారు. అప్పుడు సరిగా ఇక్కడే కరిచింది." అంటూ అకరిచినచోటు చూపించింది కుసుమ. మానవులకి హృదయం ఉండేదక్కడేనని ఆమె ఉద్దేశమై ఉండొచ్చు. "పాము కరిచింది చినబాబూ! అని చెప్పాను వారితో. ఆమాట వినగానే చినబాబు ముఖం అదోలా అయిపోయింది"

"ఏమయింది?" కుముద్ కి కుతూహలం రేగింది.

"వాడిపోయింది. బూడిదరంగుకి మారిపోయింది."

"పాము కరిచినందువల్ల నీకేమీ కాలేదూ?"

కుముద్, నీవు అని అనటంతో కుసుమకోపం తెచ్చుకుని, "మీరు మర్యాదగా మాట్లాడటం నేర్చుకోలేదులా ఉంది. మళ్ళీ పెద్దమనుషులు" అన్నది.

దాంతో ఇహ ఇద్దరు ఆగటంతో ఇంకేమాటలూ రాలేదు. తాటిచెట్లు మౌనంగా అలా నిలబడి ఉన్నాయి. ఇంతలో లకుముకి పిట్టఒకటి వచ్చి తాళ్ల చెరువులో దభీమనిపడింది.......

మధ్యాహ్నం మిత్రులతో మాట్లాడుతూ కూర్చుని, ప్రొద్దు ఏటవాలి పోతూంటే కుముద్ ఇహ అక్కడి నుంచి లేచాడు.

"పెందరాళే ప్రారంభమవుతుంది ప్రదర్శనం...వస్తావా శశీ?"

"ఎందుకురాను? తప్పకుండా వస్తా." వారూ వాళ్ల ఇంటి వెనుక నుంచి సాంత్ గాంవ్ వరకూ అన్నీ వరి చేలే. తాళ్ల చెరువు ప్రక్కనుంచి - చేలగట్ల వెంబడే కుముద్ సాంత్ గాంల్ కచేరీ చావడికి చేరుకున్నాడు. తాళ్ళ చెరువు దగిర మతికన్పిస్తుందని ఆశ పడ్డాడు. కాని ప్రదర్శనానికి వెళ్లే ప్రయత్నంలో హడావిడిగా ఉన్నమతికి రావటానికి తీరుబడి కాలేదు. కుసుమ వంట చేస్తోంది. సంజెపడే లోపుగానే అందరిభోజనాలూ అయిపోవాలి. మతి ఇవాళ మారుమాట్లాడకుండా అమెచెప్పిన పనులన్నీ చేసేస్తోంది.

పరాన్ ప్రతివిషయంలోనూ అంటీ పట్టనట్లుగానే ఉంటూ ఉంటాడు. సంజె పడుతున్నకొద్దీ తన చెల్లెలు, భార్య ఎంత కంగారుపడ పోగారో అతడంత కునికిపాటు పడసాగాడు. వంటయింట్లో కూర్చుని అతడు కుసుమతో కాసేపు కబుర్లాడదామని చూశాడు. మాట్లాడే తీరుబడి లేకపోవటంతో కుసుమ అతడితో కబుర్లు పెంచలేదు! 'వసారాలోకిపోయి కాసేపు హుక్కా తాగుతూ కూర్చోరాదూ? ఆడవాళ్ళకొంగు పట్టుకు తిరిగే మగవాళ్లంటే నాకు మహామంట' అన్నది.

కుసుమ విదిలింపులంటే పరాన్ కి మొదట్నుంచీ ఏవగింపే. ఆ ఏవగింపంతా కాసేపట్లో మనస్సుకి ఉదాసీనతగా, శరీరానికి బద్ధకంగా మారిపోవటంతో కోపపడే అవకాశం సాధారణంగా రాదతడికి. మధ్య మధ్య అతడికి కుసుమ మరీ చిన్నపిల్ల అనే భావం కలుగుతూంటుంది. ఆమె పధ్నాలుగో యేట తనకి భార్య అయింది. ఇప్పటికి కుసుమకి వయసు పెరిగినా బుద్ధిమాత్రం పెరగలేదని అతడి భావం.

మోక్షదా చెంగావిబట్ట కట్టుకోవటం చూసి "నువ్వుకూడా వెడతావా అమ్మా భాగోతం చూడటానికి?" అని అడిగాడు పరాన్.

"ఊహూఁ. ఇంక నా బ్రతుక్కి తోడు భాగోతాలు కూడానా?"

గట్టిగారమ్మని బలవంతంచేస్తే మోక్షదాకి రావటానికేం అభ్యంతరం ఉండదు. కాని వీళ్ళెవరూ మాటవరసకైనా రమ్మని అనరు. ఆసంగతి మొదట్నుంచీ తెలుసు మోక్షదాకి. అంచేత సాంత్ రా వాళ్ళ ముసలమ్మతో ఆమె ముందుగానే చెప్పి ఉంచింది—తామిద్దరం భాగోతానికి వెడదామని...ఇంటికి వచ్చి మోక్షదా తనకి భాగోతం చూడాలనే కొంతు వలుసంతయినా లేదని చెప్పవచ్చు. ఏంచేస్తుంది? మరొకవ్యక్తి తనని బలవంతంగా లాక్కుని వెళిపోతోంది!

"చెంగావి పంచెకట్టుకుని ఎక్కడికి వెడుతున్నావయితే నువ్వు?" అని అడిగాడు పరాన్.

"సాంత్ రా వాళ్లయింటికి వెడతాను నాయనా! యదూ వాళ్లత్త ఓసారి రమ్మని కబురంపింది."

కుసుమ రుసరుసమంటూ వచ్చింది.

"త్వరగా వెళ్లండి అత్తయ్యా, త్వరగా వెళ్లండి. మేమిప్పుడే బయలు దేరుతున్నాం. మీరు సాంత్ రా వాళ్లయింటికి వెడితే—ఇహ ఇంట్లో యెవరుంటారు?"

అది మోక్షదాకేం తెలుసు? ఎవరిష్టం వాళ్ళది.

"మీరెటూ భాగోతం చూడటానికి వెడతారు కనుక ఇంటి సంగతికూడా మీరే చూసుకోండి. నాకదంతా ఏంతెలుసు? నేను ముసలిదాన్ని ప్రతిదాంట్లోకి నన్నులాగటం దేనికి? నాగొడవలతో—నాయాతనలతో నే సతమతమవుతూంటే—"

కుసుమకి కోపంవచ్చి—"సంసారంలో యాతనలనేవి అందరికీ ఉంటాయి నెత్తినెక్కికూడా వేధించాలా? ఇంతకృతఘ్నత్వం దేనికి? చివరికేదో అవాంతరంవచ్చి పడుతుందని నాకు మొదట్నుంచీ తెలుసు" అన్నది.

మోక్షదాకి కొంచెం సిగ్గేసినట్టుంది. ముసలిదేదో భాగోతం చూడటానికి బయలుదేరితే దానికింత హంగామాజరగటం భావ్యం కాదని ఆమెకితోచి ఉండొచ్చుబహుశా. ఇంట్లో ఉండటానికి అంగీకరించి ఆమె మెదలకుండా ఊరుకుంది.

వంట చేసేసి, కుసుమ ముందు భర్తకి పెట్టి, తర్వాత ఆడబిడతో పాటు కూర్చుంది తానుకూడా. పరాన్ కడుపు నిండా తిన్నాడు. కుసుమ—మతి ఇద్దరూ ఎక్కడివక్కడ వదిలేసి, ఎలాగో అలా భోంచేశామని అనిపించుకున్నారు. చీకటి పడుతున్న కొద్దీ అక్కడ ప్రారంభమై పోయిందేమో అన్నభయం పట్టుకుంది. మతిని చీర కట్టుకుని సిద్ధంగా ఉండమని చెప్పి, కుసుమ వంట యిల్లు సర్దుకుంది. చెరువుకి వెళ్ళే వ్యవధి లేదిహ. మెల్లాలోనే ఒకవైపున ఉన్నమామిడి చెటుకింద కూర్చుని, అంట్లగిన్నెలు రెండూ ఎలాగో తోమేసింది—తొందర తొందరగా. ఈ యేర్పాటు ఆమె సాయంత్రమే చేసి ఉంచుకుంది. ఇవాళ రెండు భుజాలమీద రెండు బిందెలు పెట్టుకుని, ఆమె ఎన్ని నీళ్ళు చేరేసి, గంగాళాలు, గాబులూ నిండాపోసిందో!

తనే కూడా కాస్త సాయం చెయ్యనా వచ్చికి దప్పనయి



పోతుంది" అన్నది మతి.

"వద్దులే" మతి త్వర త్వరగా పనులు చెయ్యగలదనే నమ్మకం లేదు కుసుమకి. మామూలుగా అందరికీ ఒక నిమిషం పట్టే పని మతికి పది నిమిషాలు పడుతుంది.

"చెప్పిన పనేదో చెయ్యి చాలు. చీర సింగారించటానికే ఓ పూట పడుతుంది నీకు."

గోధూళి వేళలోపునే పనంతా ఎలా పూర్తి అవుతుంది! చిన్నం చితుక ఏదో పని ఉంటూనే ఉంటుంది. ఆ పనులు చేసుకున్నా ఫరవాలేదు. చేసుకోకపోయినా ఫర్వాలేదు. కుసుమ తొందర పెటటంతో పరాన్—మతి ముస్తాబవటం పూర్తి చేసుకున్నారు. తానూ ముస్తాబు చేసుకోబోతూ వాళ్ళిద్దర్నీ చూసి, ఇంత సేపటికి ఓ చిరునవ్వు నవ్వింది. కుసుమ పర్టుమీద ఉత్తరీయం కప్పుకోవటంతో పరాన్ చాలా పెద్ద మనిషిలా కన్పిస్తున్నాడు. డోర్యా చీర కట్టుకోవటంతో మతి అతిలోకసుందరి అయిపోయినట్లుంది. మతి లేత శరీరాన్ని చూస్తే కుసుమకి ఈర్ష్యగా ఉంటూ ఉంటుంది. తనకింత పరిపూర్ణమైన ఆరోగ్యం లేకపోయినా బావుండేదని పిస్తూంటుంది. డోర్యాల చీరె తనకి మాత్రం ఎందుకులేదు. కాని యిప్పుడు అలాంటి చీరెలు కట్టుకోవాలంటే కుసుమకి ఎక్కడలేని సిగ్గూ వేస్తూ ఉంటుంది.

వాళ్ళుపందిరి దగ్గిరికి వెళ్ళేసరికి ప్రదర్శనం ప్రారంభ మవటానికింకా ఆలస్యం ఉంది. పరదాచాటున కూర్చునే చోటు కోసం అప్పుడే తగాదాల ప్రారంభమైనాయి. అందరికీ పరదా దగ్గిరగా కూర్చోవాలనే అభిలాష— పన్నెండేళ్ళొచ్చిన —అప్పుడే ఘోషాలోకి దిగిన పిల్లదగ్గర్నుంచి—యాభై యేళ్ళు నిండిన వాళ్ళ అమ్మమ్మలవరకూ అందరూ అక్కడ కూర్చోవాలని చూసేవాళ్ళే. ఇలాంటి సందర్భాలలో కుసుమ చాలా గడసరి. అందర్నీ త్రోసుకుంటూ వెళ్ళిపరదా ముందు మొదటి వరుసలో పోయి కూర్చుంది. అక్కడినుంచి ఇంక ఆమెని ఎవరూ కదల్చలేకపోయారు. మతి ఆమెవెనకాలే సూదివెంట దారం లా వచ్చి కూర్చుంది. కుసుమ వీపుని ఆనుకుని. ఆమెయించుమించు చరణ దత్తుగారి భార్య ఒళ్ళోకే వచ్చి కూర్చుంది. చరణదత్తుగారి భార్య త్రోయటం మొదలెట్టగానే మతి కుసుమ నడుంగట్టిగా పట్టుకుంది......

కుసుమ వెనక్కి తిరిగి, కళ్ళెర్రచేసి, చరణ దత్తుగారి చరణదాసితో—"ఎందుకమ్మా అలా తోస్తావ్ పిల్లని? నాచేత తిట్లు తినాలని ఉందా? సర్దుకుకూచో — కాస్త చోటియ్యి. అందరూ కూర్చోవాలి, అందరూ చూడాలి. నీ ఒక్కదానికోసమే కాదు భాగోతం—!" అన్నది.

మతికి కుసుమ ఎంతో నచ్చిందిప్పుడు. ఆమెమీద మతికి క్కడలేని కృతజ్ఞతాభావం కలిగింది.

ప్రదర్శనం ప్రారంభమవబోతూండగా "అదుగో, చూడు మతీ! చినబాబు" అన్నది కుసుమ,

"చూస్తున్నాను."

ఇంతమంది జనం, ఇన్ని లైట్లు, ఇంత సందడి—మతికి మత్తెక్కినట్లుంది. పట్టుశాలువా పైన వేసుకోవటంతో శశి పెద్ద జమీందారులా కన్పిస్తున్నాడు. పందిట్లోకి రాగానే మతి అతణ్ణి చూసింది. శీతల బాబు స్వయంగా అతణ్ణిపిలిచి తన ప్రక్కన కూర్చోపెట్టుకోవటంలో, శశికి జరిగిన గౌరవం తనకికూడా జరిగినట్లే ఉంది మతికి.

పందిరి అంతానిండి, ఆరుబయట కూడా కూర్చున్నారు జనం. ఇద్దరు స్థూలకాయినులమధ్య పడటంతో మతికి ఉక్కగా ఉంది. ఇంతలో ఇక్కడ వాద్య సంగీతం ప్రారంభమైంది, అది వింటూంటే అనుభవయోగ్యమైనదేదో అయిదు నిమిషాల్లో వచ్చి ఒళ్ళో పడుతుందేమో అన్నంత ఆరాటంగా ఉంది. ఆ వాద్య సంగీతం ఆగగానే యక్షగాన ప్రదర్శనం ప్రారంభ మయింది. పదహారుగురు సఖులు వచ్చి నాట్యం చేయసాగారు, వాళ్లుఘాగ్రాలు ధరించి ఉన్నారు.

మతి కుసుమచెవిలో "మగవాళ్ళే ఆడ వేషాలు వేసినట్లున్నారు కాదు వదినా?" అడిగింది.

సఖులు నాట్యంచేసి నిష్క్రమించగానే జనా, అగ్నిదేవ్ ప్రవేశించారు.

'జనా'ని చూడగానే మతికి అనుమానం కలిగింది. "ఈ వేషం కట్టింది తప్పకుండా ఆడదే అయి ఉంటుంది కాదూ?"

"నీ తలకాయ నోరుమూసుకో. చూడనియ్."

ప్రవీరుడి ప్రవేశం రెండో దృశ్యంలో. పుత్రఘాతకుడైన అర్జునుడికి తగిన ప్రతీకారం చేస్తానని ప్రతిజ చేస్తూ గంగాదేవి స్వగతం అయాక ప్రవీరుణ్ణి చూడగానే ప్రేక్షకులంతా ముగ్ధులై పోయారు. ఎంత అనువైన దుస్తులు వేసుకున్నాడు! ఎంత మనోహరంగా ఉన్నాడు! ఫళ ఫళలాడుతోంది. అతడిచేతిలోని ఖడ్గం. అతడు గొంతు ఎత్తగానే సభికులకి శరీరంగగుర్పొడిచింది. ఎంతో సంతృప్తి కలిగింది. ప్రవీరుడి పాత్రచాలా చక్కగా రాణించింది. ముఖంలో రాజఠీవి ఉట్టిపడుతున్నట్టే కంఠం కూడా కమ్మగా ఉంది. ప్రవీరుని ప్రియురాలు మదనమంజరి కూడా అక్కడే ఉంది. ఇంతమంది జనంలో ఏదో నిర్జన రాజోద్యానంలో లాగా నిష్పంకోచంగా ఉద్వేగంతో ఆమెని ప్రేమించటం మొదలెట్టాడు. రంగస్థలం మీదచెయి పట్టుకోవటం తప్ప మిగిలినవ్యర్థాలన్నీ నిషిద్ధాలు. అది ప్రవీరునికి అంతరాయంగా ఉన్నట్టేం కన్పించటం లేదు. కేవలం మాటలో అభినయంలో తమ ఇద్దరిదీ శరీరాలు వేరైనా మనసు ఒకటేనన్న విశ్వాసాన్ని ప్రేక్షకులందరికీ కలిగించాడు. మతి, కుసుమ విస్తుపోయారు.

"ఇదిగో ఆయనేగా ఈయన!" అన్నది కుసుమ.

"ఏం చక్కగా చేశాడు వదినా! యథార్థమేమో అనిపించాడు"

"నీతో చేచేసినట్టు ఉంది, కదూ!"అన్నది కుసుమ నవ్వుతూ.

మతి మాట్లాడలేదు. అతడి పాట వింటోంది.......

"కోపమా?

కోప మేల చెలా

అభిమాన మేలనాపై......"

మతికి గుండెలు దడదడలాడాయి. కుసుమఇంక ఉండపటలేక తనలోతానే 'చెప్పు దౌర్భాగ్యురాలా, కోపగించుకోలేదని చెప్పు. నోరుతెరిచి ఆ మాట కాస్తా చెప్పలేవూ నువ్వు? భలేదానివే' అనుకున్నది..

—ఇంకా వుంది.]



యెంకి వేషంలో కుమారి ఏకుల జయశ్రీ..
విశాఖపట్నం భీమునిపట్నంలో చక్కగా నాట్యం చేస్తుంది.

# మనిషిలాగా మనిషి

(నాటకం)

## ప్రఖ్యా శ్రీరామమూర్తి

(10వ తేది సంచిక తరువాయి)

సరళ : ఏం పనిచేశావు రఘూ!

గురవా: నలభైయేళ్ళనుంచీ నాటకా లేస్తున్నాను— నలభై యేళ్ళనుంచీ! జన్మలో చూసి యెరగనిలాంటి అవాచకం! నాటకం మధ్యలో తెర దింపించడమూ! నా పోర్టు ఇప్పుడిప్పుడే అందుకుంటోంది కూడాను.

సరళ : అదియన్న —

గురవా: కుర్చీలు విరగ్గొడతారు — స్టేజిమీదికి రాళ్ళువిసురుతారు— మరో మరో వూరైతే కుళ్ళిపోయినదోసకాయలు టొమాటోలు కూడా విసురుతారు.

సరళ : డబ్బులు రిఫండ్ ఇచ్చెయ్యమంటారేమో ?

గురవా: అరసెకను కనిపించకపోతే అప్పుడుంటుంది మనపని!

సరళ : ఏమౌతుంది శేఖరం ఇప్పుడు ?

శేఖర్: (భగవంతుడికి తెలియాలి అన్నట్టు పైకిచూస్తాడు).

గురవా : హుఁ... బళ్ళారి రాఘవ దగ్గర్నుంచీ నేకలిసి యాక్టుచెయ్యని యాక్టరు లేడు! ఎన్నడూ — ఎక్కడా ఇలాంటి చిత్రం - ఇంత అవమానం ఎక్కడా పొందలేదు! అరెరె - బోలెడుమంది నామిత్రులు, నాపిల్లలు, పెళ్ళాం ముందువరసలో కూర్చుని చూస్తున్నారు! కొత్త టాలెంట్ కావాలి కావాలి అని సతమతమౌతున్న డైరెక్టర్ ప్రొడ్యూసరుగా రొకడొచ్చాడు నన్ను చూట్టానికి! తెర దించేశాడు — తెర! ఇవ్వాళే చెయ్యాలా నాయనా నువ్వీ ఘనకార్యం?

[ఉమేష్ — మేకప్ సగం తీసేసుకున్నాడు — టవలుతో మొహం తుడుచుకుంటూ వస్తాడు.]

ఉమేష్; ఏమిటటా — ఏమిటి గొడవ ?

గురవా : ఏమిటా!? రఘుపతి రావుగారు తప్ప తాగి వొళ్ళు మరిచిపోయి నాటకం నాశనం చేశారు! నాటకం మధ్యలోనే తెర దింపేశారు!

ఉమేష్ : మైగాడ్!

గురవా : నా పెద్ద స్పీచీ అసలు ప్రారంభించనేలేదు కూడానూ నేనింకా!

[సరళ కొంచెం ముందుకొచ్చి (ఊహా మాత్రమైన) అంతర్యవనిక చిరుగులోంచి హాలులోకి చూస్తునటు నటిస్తుంది—]

సరళ : పాపం — అంతా క్యూసిస్టంలో బైటికెళ్ళిపోతున్నారు!

గురవా : (నెత్తిమీది విగ్ తీసి రఘువైపు చూపుతూ) ఇదుగో అబ్బాయ్- చిన్నవాడివి కనక చెప్తున్నాను- ఇలాగే ఇంకో సారి చెయ్యి - నీ కెరీర్ క్లోజ్! ఫినిష్! టాలెంటూ ప్రజ్ఞా వుంటేసరా - పబ్లిక్ అంటే కాస్త మర్యాద, గౌరవం కూడా వుండాలి!

ఉమేష్ : ఇదుగో - ఎందుకట్లా కొట్లాడతారు!

గురవా : కొట్లాటా ? ఎసోసియేషన్ సెక్రటరీవి-పోయి ప్రేక్షకులకు క్షమాపణ చెప్పకోకుండా ఇక్కడనుంచుని మామీదేమిటో చలాయించబోతావేమిటయ్యా ?

శేఖర్ : (మళ్ళీ చిరుగులోంచి చూస్తున్న సరళతో) ఏంజరుగుతోంది అక్కడ ?

సరళ : పాపం - పిచ్చిమాలోకాలు - మాట్లాడకుండా ఖాళీచేస్తున్నారు హాలు... కాస్త స్టన్ అయినట్టే కనిపిస్తున్నారుగాని- నిజంగా చెయ్యెత్తి దణ్ణం పెట్టాలి-దేవుళ్ళు!

శేఖర్ : పాపం!

గురవా: నా స్నేహితులంతా ఏమనుకుంటారు - ఆ ప్రొడ్యూసర్ డైరక్టరేమనుకుంటాడు- ఆఁ? హుఁ-! నలభైయేళ్ళు-నలభయ్యేళ్ళ నా నాటకరంగానుభవంలో ఎన్నడూ-ఎన్నడూ కూడా ఇల్లాంటి సంఘటన ఎరగనే!

శేఖర్ : అవును - అన్నట్టు మీ అనుభవంలో ప్రేక్షకులే తెర వేయిస్తారుగదూ!

గురవా: చాల్లే. ఆ పంతటేలో. మరీ పెద్దా చిన్నా లేకుండా పోతోంది. నిన్నగాక మొన్న ఉబుసుపోక నాటకాల్లో అడుగుపెట్టినవాళ్లు మీరు - నలభైయేళ్ళ మట్టీ నా జుట్టు ఇందులోనే నెరిసిపోయింది తెలుసా ? ఆ బళ్ళారి రాఘవుడే ఈ పూట ఇక్కడుంటే-

శేఖర్ : 'ఏరా గురవా! ఇంకా అరిచి గొంతు చించుకుంటూనే వున్నావా' అని అడిగేవాడు-పాపం వేషం సరైంది దొరక్కపోయిందిగానీ!

[సుజాత పరుగెత్తుకుంటూ వస్తుంది.]

సుజాత: ఐతే ఇది నిజమేనన్నమాట ? ఏమిటట్టా ఇది ? పిచ్చెక్కిందా మీకందరికీ!

గురవా: మాకెందుకు పిచ్చి ? అదుగో ఆ మహానుభావుడి కెక్కింది పిచ్చి పైత్యమూ కైపూ అన్నీనూ.

[తనవిగ్గు, గొడుగు, సంచీ పోగుజేసుకుని ఒళ్ళో పెట్టుకుని ఓ మూల సోఫాలో కూర్చుంటాడు.]

సుజాత: ఏమిటటా— ఏ మైందసలు ?

శేఖర్ : ఏముందీ—కొంచెం ముందుమీదున్నాడు మనిషి.

సుజాత : ఫస్ట్ఆక్ట్ బాగానే లాగాడుగా,

శేఖర్ : రాను రాను వశం తప్పినట్టుంది, ఎందుకూ—వాడు ఈ అంకంలో తల్లకిందు

కం ఆపేసి తెరదింపించాను. దిగిన తెర దిగినట్టే వుణ్డేయండి. మళ్ళీ ఆనాటకం జోలికి పోకండి. అది నాటకం కాదు—అది జీవితానికి దర్పణం కాదు-అదంతా బూటకం? మోసం! ఆ రచయిత ప్రపంచమంటే యేమిటో తెలిసినవాడైతే జీవితంలో ఎన్నడైనా ఇలాంటి అనుభవం పొందినవాడైతే వాడికి తెలిసివుండేది మీనాక్షి తిరిగిరాదని! మీనాక్షి తిరిగిరాదు-రాదు! వచ్చినా మొహంచేటంత చేసుకుని చేతులు బారజాచుకుని దానికి నేను స్వాగతమిస్తాననుకుంటున్నారా? దాన్ని...దాన్ని...దాని గొంతుపట్టుకుని...గొంతుపట్టుకుని...

[స్టూలుమీద కూలబడి రెండు చేతులా మొహం కట్టుకుంటాడు-ఒక్కక్షణం సంపూర్ణ నిశ్శబ్దం.]

సరళ: (లేచి అతనికేసివస్తూ) లోపలకు రా రఘూ. మేకప్ తీసేసుకుందువుగాని.

[మళ్ళీ నిశ్శబ్దం]

సుజాత: (అందర్నీ ఇవతలకు వచ్చెయ్యమని సౌజ్ఞచేస్తూ నెమ్మదిగా) కాస్సేపలా ఒంటరిగా వదిలెయ్యండి అతన్ని.

[శేఖర్ తప్ప అంతా నెమ్మదిగా వెళ్ళిపోతారు.]

శేఖర్: లే రఘూ పోదాం. ఇంటికి పోయి కాస్సేపు పడుకుని విశ్రాంతి తీసుకుందువుగాని-లే.

రఘు: ఇంటికి!...ఎందుకింటికి? అది నా యిల్లె వొ౦గబెట్టిందేమిటి? ఇది నా యిల్లుకాక పోశిగించనిదేముంది! ఇక్కడ నాటకం-అక్కడ జీవితం! నా పాత్ర ఇక్కడా అక్కడా కూడా ఒక్కటే శేఖర్! ఇక్కడైతేనేం అక్కడైతేనేం-ఇక్కడే విశ్రాంతి తీసుకుంటాను...... (కట్టలు తెరచుకుంటున్న ఆక్రోశం అణుచుకుంటూ) ఊరెయ్-కాస్సేపు నన్నిక్కడ వదిలెయ్‌రా-నీకు పుణ్యముంటుంది.

శేఖర్: సరే నీ యిష్టం......

శేఖర్: సరే నీ యిష్టం. తెల్లారితే మళ్ళీ నీకు 'రాలుగాయి పెళ్లాం' పిక్చర్ షూటింగ్ వుంది జ్ఞాపకం వుంచుకో. అందులో నీ వేషం కాస్త వెర్రిబొంగళాయి వేషం కూడాను. రాత్రంతా నిద్రపోయి కాస్త మూడ్ని తెచ్చుకోడానికి ప్రయత్నించు.

[వెళ్తాడు]

రఘు: బొంగళాయి! అవును - వెర్రిబొంగళాయి! చూడండి-జాగ్రత్తగా చూడండి! మీరు చూస్తున్నది నన్ను-వెర్రిబొంగళాయిని! నవ్వులపాలు నాగమ్మని! ఇంతకంటే వెర్రినాగమ్మ ఇంకెవడుండగలడు? నా పెళ్ళాం నన్నో దేవయ్యనిచేసి కూర్చోబెట్టింది. దానికో ప్రియుడున్నాడు... చాలారోజుల్నుంచీ వున్నాడు. అందరికీ తెలుసు - ఈ వెర్రివెధవకి తప్ప దేశంలో అందరికీ తెలుసు చాలా తమాషాగావుందికదూ? అన్నిటికంటే మించిన తమాషాయేమిటంటే - ఆ తిరుగుబోతు పెళ్ళాం లేచిపోయినందుకు ఈ వెర్రివెధవ ఏడుస్తూ కూర్చుంటాడు. బాధపడతాడు. అవును - చిత్రహింస అనుభవిస్తాడు. అది మరీ వెర్రితనంకదూ? వాణ్ణి చూసి లోకం నవ్వుతుంది - పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతుంది-పరిహాసిస్తుంది-ఎగతాళి చేస్తుంది. అవును - ప్రేమమీద ప్రపంచానికంత నమ్మకంవుంది! చాలా తెలివిగలదికదూ లోకం!

[ఫుట్ లైట్స్ దగ్గరకొచ్చి నాటివిగాద ఒక కాలు పెట్టినుంచుని-]

మీకర్థమౌతుందనుకోను. నా భార్య అందరు భార్యల్లాంటిది కాదు - అది లేచిపోవడం అందరూ లేచిపోయినట్టు కాదు. భార్యలు లేచిపోయిన భర్తలు చాలామంది వుండొచ్చు. వాళ్ళంతా జీవితంలో రాజీపడగలరేమో. మరో పెళ్లి చేసుకుని సుఖపడగలరేమో. కాని అది నావల్ల కాదు. నాకు కలిగిన దుర్ఘటన నాకు కలగడం ఇదే మొదలు. నాకొక్కదాన్నైన భార్య నన్ను వదిలిపెట్టడం ఇదే మొదలు. లోకంలో ఒక్కత్తే మీనాక్షి వుంది. నా కదే కావాలి. నా యిల్లూ వాకిలీ నా వొళ్ళూ మనసూ అంతా అదే! అదిలేకపోతే నా కిల్లులేదు-వాకిలిలేదు. వొళ్లులేదు-మనసులేదు.

[రఘు చూడకుండా మధ్యగుమ్మంలోంచి మీనాక్షి ప్రవేశించి గుమ్మంవారే నిలబడుతుంది. ఆమెచేతిలో ఆడవాళ్ళ చేతిరుమాలొకటి వుంటుంది.]

ఎందుకు - ఎందుకని వెళ్ళిపోయావు మీనాక్షీ నువ్వు? నువ్వు వెళ్ళిపోయి నా చేతులు విరగ్గొట్టావ్! నా మనస్సు వికలం చేశావ్! ఏదో కోపంలో అనేశాను మీనాక్షీ-నువ్వు మళ్ళీ వస్తే నిన్ను చంపేస్తానని అనేశానుగాని అదినిజం కాదు మీనాక్షి. నువ్వు చెప్పాలేగాని-ఎంత ఘోరాబద్ధమైనా సరే నమ్మతాను. ఒక్క అబద్ధం ఆడు-నమ్మేస్తాను. నువ్వేం చెప్పినా నమ్ముతాను. (మనసు మెలికలు తిరిగిపోతూ) నన్ను ప్రేమించని మనిషివిగా మారిపోవడంకంటే దారుణమైన అబద్ధం యింకేం వుంది మీనాక్షీ?...నువ్వేం చెప్పినా నమ్ముతాను. అసలు నన్నొదిలేసి వెళ్లిపోలేదుగదూ! నువ్వాడిందంతా నాటకం కదూ!

[మీనాక్షి వెక్కి వెక్కి వస్తున్న దుఃఖం ఆపుకుంటూ కళ్లనీళ్లు ఒత్తుకుని గబగబా వచ్చి రఘు కాళ్లమీద పడుతుంది.]

మీనాక్షి: అవును-నాటకమే. నేను నిజంగా లేచిపోలేదు. నన్ను క్షమించండి.

రఘు: మీనాక్షీ!...నువ్వు...!

[ఆమె భుజాలు పట్టుకుని లేవదీసి ఆమె ముఖంలోకి-ఆమె కళ్ళల్లోకి చూస్తూ—]

నిజంగా-నిజంగా నువ్వేనా మీనాక్షీ..?

మీనాక్షి: నేనని చెప్పుకోడానిక్కూడా సిగ్గుగా వుంది. నన్ను క్షమించాననండి - నన్ను క్షమించాననండి.

రఘు: కాని...కాని...ఎందుకు ఎందుకని మీనా? ఏం నేరం చేశానని? ఎందుకు నన్నిలా ఒంటరిగాణ్ని చేసి వెళ్లిపోయావ్? నేన్నీకేం అపకారం చేశానని—?

(మీనాక్షి అతని భుజంమీదపడి ఏడుస్తూంటుంది...రఘు ఆమె చేతిలోని రుమాలుతో ఆమె కళ్లు తుడవబోతూ గభాల్న దాన్ని గుర్తిస్తాడు—)

ఇదేనా—దీని మూలంగానేనా నువ్వు వదిలిపెట్టి వెళ్ళిపోయింది?...చెప్పు మీనా.

మీనాక్షి: (అవునని తలవూపుతుంది.)

రఘు: ఈ చేతిరుమాలు గురించి ఇంట్లోంచి లేచి పోయావా నువ్వు!"

మీనాక్షి: నేను నిజంగా పోలేదండీ. పూరికే పోయినట్టు నటించానంతే! నన్ను నమ్మండి.

రఘు: నటించావా?...నటన! జీవితం! జీవితంలో నటన...నటనలో జీవితం... (హఠాత్తుగా) కాని—ఆ రుమాలు సంగతంతా నేను చెప్పానుగా మీనా నీకు!.

మీనాక్షి: అది మీ జేబులో చూడంగానే నన్ను అనుమానపిశాచం ఆవరించింది. ఈర్ష్య ఆక్రోశం—

రఘు: ఈ వెధవ రుమాలు గురించి—!

మీనాక్షి: నేనేం చెయ్యను చెప్పండి-అనుమానం సానుభూతిపై చెప్పరానిపనులు చేయించింది నా చేత.

రఘు: ఇవ్వాళంతా తప్పతాగాను—నాటకం అభాసుచేసి హాంలో తెరవేయించాను—.

మీనాక్షి: అవును— మీ మనసు కష్టపెట్టాను—మిమ్మల్ని దారుణవేదన పాలుజేశాను—యమయాతన పెట్టాను—నన్ను క్షమించాననండి—క్షమించాననండి—.

(56-వ పేజీ చూడండి)



# సాటిలేని శ్రేష్ఠతకు
# అద్భుతమైన పనితనమునకు

## రెండు దివ్యమైన నేషనల్-ఎక్కో మోడలులు




ఇవిగో, మీరు రేడియో ప్రసారములను దివ్యముగా విని ఆనందించుటకు చక్కగా పనిచేసే అత్యంత శ్రేష్ఠమైన రెండు నేషనల్-ఎక్కో మోడలులు! అవి 'మాన్‌సూనైజ్' చేయబడినవి మరియు వాటితో ఒక సంవత్సరము గ్యారంటీ యివ్వబడుతుంది. మీ దగ్గరలోనున్న నేషనల్-ఎక్కో వ్యాపారివి వాటిని పెట్టమని నేడే వినండి!



మోడలు 717: బంగారు రంగు తాపడములతో, మరూన్ రంగు ప్లాస్టిక్ క్యాబినెట్. మోడలు యు-717: 5 వాల్వులు, 3 బ్యాండులు: 230 వోల్టుల కరెంటు మీద పనిచేసే ఎసి/డిసి సెట్. మోడలు బి-717: 4 వాల్వులు, 3 బ్యాండులు: డ్రై బ్యాటరీ సెట్.
రు. 250/-

అన్ని ధరలూ నెట్.
స్థానిక పన్నులు అదనము



మోడలు 187: 8 వాల్వులు, 8 బ్యాండులు. అందమైన కఱ్ఱ క్యాబినెట్. మోడలు ఎ-187 ఎసి సెట్; మోడలు యు-187 ఎసి/డిసి సెట్ రు. 475/-

నేషనల్-ఎక్కో రేడియోలు
శ్రేష్ఠమైనవి - అవి




చేయబడినవి.




జెనరల్ రేడియో అండ్ అప్లయన్సెస్ ప్రైవేట్ లిమిటెడ్
ఒపేరా హౌస్, బొంబాయి 4 • 3, మదన్ స్ట్రీట్, కలకత్తా 13 • 1/18 మౌంట్ రోడ్, మద్రాసు
86/79 ఇర్విన్-ఆల్బర్ట్ పార్కు రోడ్, బెంగుళూరు • లోథియాన్ పాలెస్, చాందినీ చౌక్, ఢిల్లీ
ఫ్రేజర్ రోడ్డు, పాట్నా.

GRA 6392

# అనసూయ

రాత్రి పదకొండుగంటలు కొట్టారు. శస్త్ర చికిత్స వార్డులోని రోగులందరూ ఇంచుమించు విశ్రాంతి తీసుకుంటున్నారు. వార్డులోని పెద్ద దీపాలన్నీ ఆర్పేశారు. చిరంజీవికి ఆపరేషన్ అయి అప్పటికి నాలుగైదు రోజులయింది. అంతకుముందు పది, పదిహేను రోజులనుంచి నిత్యం ఆస్పత్రిలో రాత్రి పగలూ అనే విచక్షణ లేక గంటలతరబడి ఉండడంచేత, ఇంచుమించు ఆ వార్డు నర్సులందరితోనూ నాకు పరిచయమైంది. పెద్ద డాక్టరుగారికి ముందే బాగా ముట్టచెప్పడంచేత, చిరంజీవి విషయంలో ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయించారు. మిగిలిన నర్సులందరి మాట ఎలా ఉన్నా, అనసూయ మాత్రం తన పనులు చాలా ఓర్పుతోనూ, నేర్పుతోనూ చేసుకుపోయేది. రాత్రి ఎవరు ఎన్నిసార్లు పిలిచినా, విసుక్కోకుండా సపర్యలు చేసేది. అసలు మొదటిరోజున అనసూయను చూచిన కొద్దిసేపటికే ఆమెతో మాట్లాడుదామనిపించింది. ఇదేమంత కష్టమైన పని కాకపోబట్టి, మూడు నాలుగు రోజులలో కొద్ది పరిచయం ఏర్పడింది. దానికితోడు, నేను కాలక్షేపానికని తీసుకువెళ్ళే పత్రికలూ, పుస్తకాలు ఆమెను ఆకర్షించేవి. అడిగి తీసుకుని తీరిక సమయాలలో చదువుకునేది.

ఎంత ప్రయత్నించినా నిద్రరాకపోవడంవల్ల ఏదో పత్రిక తిరగవేస్తూ చిరంజీవి మంచానికి కొద్దిగా దూరంగా వరండాలో బల్లమీద కూర్చున్నా.

"ఏమండీ ఇంకా నిద్రపోలేదా?" అంటూ అనసూయ వచ్చి మరో బల్ల లాక్కుని నాకు దగ్గరగా కూర్చుంది.

"చిరంజీవిగారు మీకు ఏమౌతారు?" అన్నదామె.

"మా మేనత్తకొడుకు"

"ఆయన ఏం చేస్తున్నారు?"

"రాజమండ్రి బ్రూక్ బాండ్ కంపెనీలో ఎక్కౌంటెంట్."

"మరి మీరేంచేస్తున్నారు?"

"మొన్న మార్చిలో ఇంటర్ పరీక్షకు వెళ్ళా."

"ఆయనకు వివాహమయిందా?"

"లేదు."

"శీనుగారు మీకు ఏమౌతారండీ?

"చిరంజీవి తమ్ముడు. మేం ఇద్దరంకలసి మా పినతండ్రిగారింట్లో చదువుకుంటున్నాం. వాడూ నాతోబాటే ఇంటర్ పరీక్షలకు కూర్చున్నాడు."

ఇంకా ఏమేమో ప్రశ్నలడిగింది, అన్నిటికీ జవాబులు చెప్పా. రెండుమూడు దినాలనుంచి, ఆమెగురించి వివరాలు తెలుసుకుందామనే కుతూహలం ఉండడంచేత ఈ అవకాశం వదులుకోకూడదనుకొని, "ఏమండీ మీదేవూరు?" అన్నాను.

"బళ్ళారి"

"మీరు ఈ పనిలో అభిలాషఉంటే చేరారా?"

"లేదండీ. కేవలం పరిస్థితుల ఒత్తిడివల్ల చేరవలసివచ్చింది."

"ఎంతకాలమైందండీ మీరు చేరి?"

"రెండు నెలలు."

"మీకు తెలిసినవాళ్ళు ఎవరైనా ఈ ఊళ్ళో ఉన్నారా?"

పి. నరసింగరావు

"లేరండి. కనీసం మీఅంతదయగా మాట్లాడినవాళ్ళైనా ఎవరూ లేరు"

"ఎలా ఉందండీ మీ పని?"

"ఏడుపొస్తుందండీ. కాని ఏం చెయ్యడం?"

"అసలు మీరు అంతదూరంనుంచివచ్చి నర్సుగా ఎందుకు చేరవలసివచ్చింది? చక్కగా ఎవరినైనా తగినవాణ్ణి చూసుకుని పెళ్ళిచేసుకోలేక పోయారా?"

ఆమె నిరుత్సాహంగా తన కథ చెప్పుకుపోయింది. తాను ఒక సామాన్య కుటుంబానికి చెందిందట. తండ్రి రాష్ట్రప్రభుత్వంలో ఉన్నతోద్యోగం చేస్తూ హఠాత్తుగా మరణించడంచేత ఇతరత్రా ఆస్తిపాస్తులుగాని, చేరదీసే దగ్గర బంధువులుగాని లేకపోవడంచేత తనూ, తల్లి, ఫిఫ్తుఫారం చదువుతున్న తమ్ముడూ దిక్కులేనివాళ్ళయ్యారట. తగిన సంబంధం కావాలంటే, కనీసం రెండు మూడు వేల రూపాయలైనా ఖర్చు చెయ్యాలి. తన తండ్రి తాలూకు ప్రావిడెంటుఫండు సుమారు నాలుగు వేల రూపాయిల వరకూ వచ్చినా ఆ సొమ్ము ఖర్చుచేసి తాను వివాహం చేసుకుంటే, తన తల్లి, తమ్ముని భవిష్యత్తు ఏం కావాలి? అంచేత, అప్పటికే స్కూలు ఫైనల్ ప్యాసై ఉండడంచేత ఏదైనా ఉద్యోగంలో చేరి, తమ్ముణ్ణి కనీసం స్కూలు ఫైనల్ వరకైనా చదివించాలని పట్టుబట్టి తల్లిని ఒప్పించి, ఆ ప్రయత్నం చెయ్యకుండానే లభించింది కదా అని స్వస్థలానికి దూరమైనా వచ్చి నర్సుగా చేరినని చెప్పింది. తెల్లవారుఝామున ఇంచుమించు ఐదుగంటలదాకా మాట్లాడుతూనే ఉన్నాం. మధ్యలోమాత్రం రెండు మూడుసార్లు ఎవరో రోగులు పిలవడంచేత ఆమె వెళ్ళి వాళ్ళకు సపర్యలుచేసి తిరిగి వచ్చింది. ఐదు గంటలయిన తరువాత మా శీను వచ్చాడు. జంబుఖానా, తలగడా చుట్టుకుని ఇంటికి బయలు దేరా.

* * *

రాత్రల్లా నిద్రలేకపోవడంనుంచి ఇంటికి రాగానే ముఖం కడుక్కుని, కాఫీ తాగి నిద్రపోయా. బహుశా పన్నెండు గంటల ప్రాంతంలో మా పినతండ్రిగారి కూతురు "అన్నా! అమ్మ అన్నానికి రమ్మంటోంది" అని లేపింది. స్నానంచేసి భోజనానికి కూర్చున్నా. మా పినతండ్రిగారి భార్య, సాయంత్రం మెయిలులో తాను, పిల్లలు బరంపురం పుట్టింటికి వెళ్ళదలచినట్లు, మా పినతండ్రి గారికి, సెలవు దొరకనందువలన, నేను సాయం రాక తప్పదని అన్నారు. ఎలాగూ సెలవులవడంచేత, మరేమీ పని లేకపోబట్టి 'సరే' అన్నా. ఆ దినం బరంపురం వెళ్ళాం. తిరుగు రైల్లో వచ్చేద్దామనుకున్నా. కాని చాలా రోజుల నుంచీ వెళ్ళక పోవడంచేత, మూడు నాలుగు రోజులు ఉండందే వదిలేరుకాదు. ఇంకా నాలుగు రోజులు ఉండమని బలవంతం చేస్తున్నా వెళ్ళకపోతే చిరంజీవికి ఆస్పత్రిలో ఇబ్బంది ఔతుందనిచెప్పి తిరిగి వచ్చేశా. ఇంటికి వచ్చేసరికి శీను ఇంకా భోజనం చెయ్యకపోవడంచేత ఇద్దరం కలిసి భోజనంచేసి మా గదిలో పక్కలు పరుచుకున్నాం. "చిరంజీవి ఎలా ఉన్నాడని" శీనుని అడిగా.

"పూర్తిగా కోలుకొన్నాడు. బహుశా మరో నాలుగైదు రోజులలో ఇంటికి వెళ్ళడానికి అనుమతి ఇస్తారు" అన్నాడు.

"ఇంకేమైనా విశేషాలున్నాయా?" అన్నా.

"నీ కోసం అనసూయమాత్రం తెగ కలవరిస్తోందిరా భాయ్! నువ్వు వెళ్ళిన తరువాత నీ గురించి రోజుకు వందసార్లయినా అడుగుతోంది; ఆవిడగారి అనుమతి తీసుకోందే నీవు వెళ్ళావని అందిరా" అన్నాడు నవ్వుతూ.

#  అనసూయ 

"ఇది మరీ బాగుంది" అన్నా.

"బాగుండడం ఏమిటి, కథ వదుల్తున్నావ్, కానీ" అన్నాడు.

ఇంతలో మా గదిలోకి ఎవరో రావడం నుంచి ఆ ప్రసక్తి కట్టిపేశాం.

సాయంత్రం నాలుగ్గంటలకు స్నానం చేసి బట్టలు వేసుకుని ఆసుపత్రికి వెళ్లా. చిరంజీవితో కొంతసేపు బరంపురం కబుర్లు వగైరాలు మాట్లాడిన తరువాత, "అనసూయ ఏమైంది" అని అడిగా. నాలుగు గంటలతో డ్యూటీ అయిపోవడంవల్ల బహుశా క్వార్టర్సుకు వెళ్లిపోయి ఉంటుందని చెప్పాడు. "రాత్రి పడుకోవడానికి వచ్చేదా?" అని అడిగా. "లేదు! అవసరంలేదు. అసలు రెండు మూడు రోజుల క్రితమే తనతో ఎవరూ రానక్కరలేదని చెప్పా. ఇప్పుడు మామూలుగా లేచి తిరగగలను కాబట్టి బాధ లేదు. ఎవరూ రానక్కరలేదు," అన్నాడు. "సరే రేపు వస్తానని" చెప్పి బయలుదేరా.

అదివరకే రెండుమూడుసార్లు అనసూయ క్వార్టర్సుకు రమ్మనడంచేత పోనీ ఒకసారి చూద్దామనుకుని క్వార్టర్సుకు వెళ్లా. ఆమె తన గది నంబరు, వగైరాలు తెలియజేసినా అదే మొదటిసారి కావడంనుంచి, ఇద్దరు ముగ్గురు నర్సులను అడిగందే ఆమెగది తెలిసిందికాదు. ఎలాగయితేనేం ఆమె గదికి చేరుకున్నా. నన్ను చూచి లోనికి రమ్మని ఆహ్వానించింది. "ఏమండీ! బరంపురంనుంచి, ఈ దినమే వచ్చారా?" అంది. "ఔనండి" అన్నా. కొంతసేపయిన తరువాత, "ఏమండీ, అలా బీచికిపోయి కాస్సేపు కూర్చుందామా?" అంది. ఆమెతో ఒంటరిగా కలిసి వెళ్లడానికి భయపడినా, మొహమాటంచేత, ఆ మాట అనలేక "పదండి వెళ్దాం" అన్నా.

బీచికి బయలుదేరాం, అన్నమాటేగాని, అంతవరకూ ఎన్నడూ పరాయి ఆడవాళ్లతోనూ అందులో వయస్సులో ఉన్న అమ్మాయిలతోనూ తిరగడం అలవాటు లేకపోవడంచేత, దీనికితోడు, ఏ తెలిసినవాళ్లయినా మమ్మల్ని చూసి, ఈ విషయం మా పినతండ్రిగారికి చెప్పేరంటే చీవాట్లు చెప్పుదెబ్బలు తప్పవనే భయంతోనూ పరధ్యానంగా ఆమెతో నడుస్తున్నా. అదృష్టవశాత్తూ త్రోవలో తెలిసినవాళ్ళెవరూ కనపడలేదు. బీచిలో దూరంగా, ఎవ్వరూలేని ప్రదేశంలో కూర్చున్నాం. బహుశా ఆరు గంటలై వుంటుంది. మౌనంగా కొద్ది నిముషాలు గడిచాయి.

"ఏమండీ, అదోలా ఉన్నారు?" అంది.

"అబ్బే, ఏమీ లేదండీ" అన్నా లేనినవ్వు తెచ్చుకుని.

కొద్దిసేపు, అకబుర్లూ, ఈ కబుర్లూ అయ్యాయి.

అంతకు రెండుమూడు దినముల క్రిందటే జీవరత్నం అన్న నర్సు ఆత్మహత్య చేసుకుని మరణించిందన్న విషయం జ్ఞాపకంరాగా ఆవిషయం ఆమెను అడిగా.

చెప్పుకుపోయింది. జీవరత్నానికి తనకూ ఏమీ పరిచయం లేకపోయినా, తన రూమ్ మేట్ కారణంవలన వివరాలు తనకు తెలిశాయట. జీవరత్నానికి, రాజారాంఅనే మేల్ నర్సుతో సుమారు ఒకసంవత్సరంగా మంచి స్నేహమట, అతనితో తరచు, సినీమాలకు, బీచికిపోయేదట. అతను, తాను మంచి స్థితిపరుడనని, ఆమెను తప్పక వివాహం చేసుకుంటానని చెప్పి ఆమెకు లేనిపోని ఆశలు కల్పించి, ఐదూపదీ ఆమె క్రింద ఖర్చు పెడుతూ వశపర్చుకున్నాడుట. తత్ఫలితంగా ఆమెకు గర్భం కలిగిందట. గర్భవిచ్ఛిత్తికి చేసిన ప్రయత్నాలు ఫలించక పోగా, ఈ విషయం, ఆస్పత్రి అధికారులకు తెలిసి ఆమెను పనినుండి తొలగించారుట. ఎన్ని విధాల ప్రాధేయపడ్డా రాజారాం చేరనీయక పోవడంతో, జీవితంమీద విరక్తితో ఆత్మహత్య చేసుకుందిట. రాజారాం విషయం




తరు[ణి]చ్ఛాయ !

—చిత్రకారుడు : వి. పూర్ణానందశర్మ]

మాత్రం ఆమె బయటపెట్టలేదుట. కేవలం జీవితంమీద విరక్తితో, ఆత్మహత్య చేసుకున్నానని, దీనికి తన తెలివితక్కువతనం తప్ప, మరెవ్వరూ బాధ్యులుకారనిమాత్రం జాబులు రాసి, పోలీసు సూపర్నెంటుకు, ఆస్పత్రి అధికారులకు పోస్ట్ చేసిందిట.

అంతా ఓపిగ్గా విని ఒక్క నిట్టూర్పు విడిచా.

'చూశారా, అందుకే వయస్సులోవున్న ఆడపిలలు, అందులో నలుగురు మొగాళ్లతో కలిసి పని చెయ్యవలసిన వాళ్ళు, చాలా జాగ్రత్తగానూ, తెలివితేటలతోనూ మెలగాలి. వ్యామోహంలోపడి ఏమాత్రం తప్పటడుగు వేసినా జీవితం సర్వనాశనమౌతుంది" అన్నా.

ఆమె అదోవిధంగా నన్ను చూసి మౌనంగా ఊరుకుంది.

అనసూయకు బహుశా పదిహేడుసంవత్సరాలకంటె హెచ్చు ఉండవేమో. ఛామనఛాయ శరీరంతో సహజంగాచక్కగాఉండే ఆమె,ఆదినం, తలకు స్నానంచేసి, వేసుకున్న వల్లజాకెట్టు, గులాబీరంగుచీరలోఎంతోఆకర్షణీయంగా కనపడుతూంది. విశాలమైనకళ్ళు, తీరైన పళ్ళవరుస, పొడవైన జడ, చిరునవ్వులుచిందే ఆమె ప్రశాంతమైనముఖాన్ని చూస్తూ ఏదో ఆలోచిస్తున్నా.

ఏమండీ, అంతదీక్షగా చూస్తున్నారు? అంది నవ్వుతూ.

"నేను ఒక్కమాట అంటా. మీకుకోపం రాదుకదా? అన్నా.

"లేదు. భయంలేదు చెప్పండి" అంది.

"నిజానికి మీచక్కదనం, ముఖంలోని సౌజన్యం చూస్తూఉంటే మీలో ఉత్తమ ఇల్లాలుఅయే లక్షణాలు కనపడుతున్నాయి. ఆభగవంతుడు మీకు ఎందుకు ఈకష్టాలు తెచ్చిపెట్టాడో? మీరు 'నర్సుగా' పనిచెయ్యడం మాత్రం నాకు బొత్తిగా ఇష్టంలేదు'అన్నా.

"అదృష్టానికి నోచుకోనపుడూ, యౌవనంలోఉండే సుఖానుభూతులకు దూరమైనప్పుడు రోగగ్రస్తులైన తోటిమానవులకు సేవచెయ్యడంకంటె ఏంకావాలండీ?" అంది.

"రోగగ్రస్తులకు సేవచెయ్యడంకంటె ఉత్తమమైనది లేదనేఅభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తా. కానీ కేవలం రోగులకు సేవచెయ్యడమే, మీ పరమావధిగా పెట్టుకొని వివాహసౌఖ్యాలకోసం, ప్రాకులాడక పోయినా, ఈ ఆస్పత్రి వాతావరణంలో వయస్సులోయున్న మీలాంటి సౌందర్యవతులను చూస్తే ఓర్వలేనివాళ్ళెందరో ఉన్నారు. మీకు తెలియకుండానే మిమ్మల్ని తప్పుత్రోవలు త్రొక్కించి వాళ్ల అవసరాలను తీర్చుకుంటారు" అన్నా.

ఆమె అంతా ఓపిగావిని, టైము చూచి "అబ్బ ఎనిమిదిగంటలయింది. ఇక వెళ్దాం" అంది. సరేనని ఆమెను నర్సుల క్వార్టరు దాకా దిగబెట్టి ఇంటికి వచ్చా.

* * *

ఆ దినం చిరంజీవి డిస్చార్జి అయ్యేరోజు. ఎండతగినతరువాత, నాలుగుగంటల వేళకు ఒక టాక్సీమాట్లాడుకుని, నేనూ సీనూ కలిసి ఆస్పత్రికివెళ్ళాం. ఆస్పత్రికి చెల్లించవలసిన పైకం చెల్లించి డాక్టరుగారివద్ద సెలవుతీసుకున్నాం. చిరంజీవి, పరిచయమున్న నర్సులకూ.వార్డ్ సర్వెన్ట్కు ధన్యవాదాలు అర్పించి, కారులో కూర్చున్నాడు. అనసూయ, ఆ సమయానికి లేదు. చిరంజీవి, తనకుబదులుగా నన్ను ఆమెకు ధన్యవాదాలు తెలియజెయ్యమన్నాడు. మీరు కారులో ఇంటికివెళ్లండి, నేను ఆతరువాత వస్తా"నని చెప్పి తిన్నగా నర్సుల క్వార్టర్సుకు బయలుదేరా.

మిగిలిన నర్సులకు డ్యూటీఉండడంచేత అనసూయ ఒక్కతేఉంది. నన్ను చూడగానే "రండి కూర్చోండి" అంది. నేను మంచం మీద కూర్చున్నా. ఎదురుగా ఆమె స్టూలు మీద కూర్చుంది.

"ఏమండీ మంచినీళ్ళు తాగుతారా" అంది.

"ఇవ్వండి," అన్నా. శుభ్రంగా కడగిన గాజుగ్లాసులో, కూజాలోని చల్లటినీళ్ళు పోసి ఇచ్చింది,

"ఏమండీ చిరంజీవిగారు ఇంటికి వెళ్లి పోయేరా" అంది.

"ఆ, ఇప్పుడే కారుఎక్కించి ఇలా వచ్చా. మీకు తన ధన్యవాదాలు తెలియజెయ్యమన్నాడు. అవకాశం చిక్కితే రాజమండ్రీ వెళ్ళేలోగా మిమ్మల్ని కలుస్తానని చెప్పమన్నాడు" అన్నా.

"అయితే మీకు ఆసుపత్రి డ్యూటీ ఈ దినంతో అయిపోయిందన్నమాట," అంది.

"ఆ, భగవంతుని దయవలన ఈ బాధవదిలింది, ఇక ఈ ఆసుపత్రిముఖం చూడక్కర లేదు" అన్నా.

కొదినిముషాలు మౌనంగాగడిచాయి.

ఆమె కళ్ళంట నీళ్లుకారుతున్నాయ్. ఆశ్చర్యపోయా, ఏం, మాట్లాడడానికి తోచక "ఏమండీ అలాఉన్నారు?" అన్నా.

"అబ్బే ఏమీ లేదండీ" అంది కళ్లుతుడుచుకుంటూ.

"ఏమండీ మిమ్మల్ని ఎవరైనా ఏమైనా అన్నారా?"

ఆమె మాట్లాడలేదు.

"అసలు సంగతేమిటండి" అని గట్టిగా అడిగా.

"మధ్యాహ్నంనుంచీ నా మనస్సుఏమీ బాగులేదండీ" అంది.

"కారణం చెప్పండీ" అని ప్రాధేయపూర్వకంగా అడిగా.

"చిరంజీవిగారు వెళ్లిపోయాక మీరు ఆసుపత్రికి రావలసిన అవసరంలేదుకదా?" రెండునిమిషాలు ఆలోచించి. "లేదండీ మిమ్మల్ని చూడడానికి అప్పుడప్పుడు వస్తానండీ" అన్నా.

"మిమ్మల్ని చూసిన వేళావిశేషమేమిటోగాని, మీతో పరిచయమై ఇరవైరోజులే అయినా, మీతో ఎంతో సన్నిహితత్వం ఏర్పడింది. చిరంజీవిగారు ఇంటికి వెళ్లి పోయినతరువాత మీరు రావలసిన అవసరం లేదు, ఇక మీరు రారేమోనన్న ఆలోచన వచ్చి నా మనస్సంతా పాడైంది. ఈ ఉదయం భోజనంకూడా సరిగ్గా చెయ్యలేక పోయా" అంది దీనంగా.

ఆమెపరిస్థితిచూస్తే ఎంతో జాలివేసింది. "నిజంగా చెపున్నా. ఎలాగూ సెలవులే కాబట్టి, తరచువచ్చి మిమ్మల్ని చూసి పోతుంటా. ధైర్యంగా ఉండండి". అన్నా.

అప్పటికి ఆమెకు కొంత నమ్మకం, ధైర్యంకలాయి. సుమారు ఆరుగంటలు కావడంనుంచి.

'ఇకవెళ్తానండీ' అన్నా.

"మీరేమీ అనుకోకపోతే చిన్నపనిచేసి పెట్టాలి," అంది.

"ఫరవాలేదు చెప్పండి" అన్నా.

"మా అమ్మకు రాసిన, ఈ జాబు పోస్ట్ చెయ్యాలి. తరువాత మీరు మళ్ళీ వచ్చేటప్పుడు రెండు కవరులు కొని తేవాలి" అని డబ్బులు ఇవ్వబోయింది.

అలాగే అని, డబ్బులు పుచ్చుకోకుండా, కవరుమాత్రం తీసుకుని ఇంటికివచ్చా.

రాత్రి భోజనంచేసిన తరువాత సీనుతో విషయమంతా చెప్పా.

వాడు నవ్వుతూ "ఇంకేం నీ రొట్టెవిరిగి నేతిలోపడింది," అన్నాడు.

* * *

మరోవారంరోజులకు చిరంజీవి రాజమండ్రీ వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయేముందు మాత్రం అవకాశం చూసి యేం ఇద్దరమే ఉంటున్నపుడు. "ఒరే అనసూయతో స్నేహం తప్పని అనను కాని, చాలా జాగ్ర

(54-వ పేజీ చూడండి)

# అహంభావం

## ఆకుండి నారాయణమూర్తి

నట్టింటిలో పదిమంది అమ్మలక్కలు అప్పడాలొత్తుతూ కూర్చునుంటే, సావిత్రమ్మ ఇవతలి వరండాలో ఈజీఛైర్ లో దర్జాగా కూర్చొంది. తమలపాకులు నములుతూ!...

నట్టింటి గుమ్మం దగ్గర కూర్చొని పిండి పిసుకుతూఉన్న నరసమ్మకు చాలా కష మనిపించింది; ఆ కొత్త గుమాస్తా పెళ్లాం రాధ, పెళ్లి పనులలో సహాయం చేసేటందుకు తహసీల్దారుగారింటికి రాకపోవడం!!!– ఆ కొత్త గుమాస్తా పెళ్లానికి కబురెట్ట లేదూ?" అనడిగింది నరసమ్మ.

"కబురెట్టకేం?!–పొద్దున్నే మాబంట్రోతుని పంపించేను. 'వంట్లో బాగులేద'ని తిరిగి కబురెట్టింది." అని సమాధాన మిచ్చింది తాహసీలుదారుగారి భార్య సావిత్రమ్మ.

"ఏఁవిటేవిటి?!...వంట్లో బాగులేదని కబురెట్టిందా?...బాగుంది బాగుంది!!... నేను మీ యింటికి వస్తూ, అలా ఓమారు 'ఎ.సి.టి.ఓ' గారింటికి వెళ్ళేను. అతని పెళ్లాం, ఈ రాధ కలసి అదేదో కొత్తరకం పిండివంట కనిపెట్టేరుట; అది చేస్తున్నారక్కడ!! నేవెళ్లేసరికి ముఖాలదోలా పెట్టేరు. ఉలుకూ లేదు; పలుకూ లేదు!!– అక్కడుండడం అసహ్యమనిపించి, ఒక్క క్షణమైనా కూర్చోకుండా వెంటనే లేచొచ్చేసేను!–వంట్లో బాగులేకపోతే మరి ఎ. సి. టి. ఓ గారింటికెలా వచ్చింది అని?!" విషయాన్నీ రగిల్చింది నరసమ్మ.

"అబ్బో!–ఆవిడకు చాలా గర్వం!– నేను మీయింటికి వస్తూ, వాళ్ళింటికెళ్ళి... 'మీరు కూడా వస్తారా తహసీలుదారుగారింటికప్పడాలొత్తడానికి?' అనడిగేను. –'ఏం కూలాళ్ళను పెట్టి చేయించేయకూడదూ?...లేదా బజారులో కొనేయకూడదూ? డబ్బేమీ లేనివాళ్లా ఏఁవిటి?– ఎవరింటిదగ్గర వారికే పనులుంటాయి!– ఎవరి పనులు మానుకొని ఎవరొస్తారు?! అని అన్నాదండీ. పెళ్ళిళ్ళూ ఇటువంటి శుభ కార్యాల సందర్భాలలో ఒకరి కొకరం సహాయం చేసుకోకపోతే ఎలా చెప్పండి?" విషయానికి పదును పెట్టిందో అమ్మలక్క.

"ఏమయినా సరే!"...ఆ వెళిపోయిన గుమస్తా పెళ్లాం లక్ష్మి ఎంతో మంచావిడ సుమండీ!" అంది మరో ఆవిడ.

"ఆఁ–ఆవిడతో ఈవిడకు పోలికేఁవిటి?–ఆవిడ కింత పిసరయినా గర్వం లేదు!" అంది ఇంకో ఆవిడ.

"ఆ లక్ష్మి నన్నెంతో గౌరవించేది!– నే నెంత అర్ధరాత్రప్పుడు కబురెట్టినా వచ్చేసేది. ఎంతో భయభక్తులతో వినయ విధేయతలతో ఉండేది!" ఆ లక్ష్మిలో గల మంచితనానికి అదొక్కటే తగిన ఉదాహరణనే భావంతో ఆమె నలా అందరి యెదుటా పొగిడింది తహసీల్దారుభార్య. తన కన్నా తక్కువ అంతస్తులోనున్నవారిని ఆమె సాధారణంగా పొగడదు!–ఆవిడ అలా పొగిడిందంటే, గొప్ప విశేషమే! – ఆ పాత గుమాస్తా పెళ్ళాన్ని అలా పొగడడంలో గల ఉద్దేశ్యం, ఈ కొత్త గుమాస్తా పెళ్ళాన్ని దూషించడానికీ నిందించడానికీ వలుగురికీ అవకాశమేర్పడుతుందికదా అని!

"ఓ గంటో, రెండుగంటలసేపో కూర్చుని ఇన్ని అప్పడాలొత్తడానికి ఏం తెగులొచ్చిందీవిడకు!– ఇటువంటి పెదింటివారింటి పెళ్ళి సందర్భంలో ఈమాత్రం సహాయం చెయ్యకపోతే ఎలా?!– రేప్పొద్దున వాళ్ళింట్లో ఏదయినా శుభకార్యం జరుగుతే ఎవరి సహాయం కోరకుండా తనే పనంతా చేసేసుకుంటుంది కాబోలు!" అని ముందుచూపుగల ఓ ఇల్లాలందుకుంది.

"గొడ్రాలింట్లో శుభకార్యాలేం జరుగుతాయిలెండి?!" అని పకపకమని నవ్వేసిందో పదిమంది పిల్లల తల్లి.

"ఇటువంటి బుద్ధులుంటే పిల్లలెలా పుడతారులెండి!" అంది నరసమ్మ. తాసీల్దురింటికి అప్పడాలొత్తడానికి రాకపోడంవంటి బుద్ధితక్కువ పనులు చెయ్యడంవల్లే ఆమెకింకా పిల్లలు పుట్టలేదని నరసమ్మ నమ్మకం.

"నలుగురూ సహాయం చేస్తేనేగానీ అమ్మాయి వివాహం ఘనంగా చెయ్యలేము నే భావంతో రమ్మని కబురెట్టేనే గానీ ఒట్టి కొట్టేనే చాకిరీ చెయ్యడానికి రమ్మని కబురెట్టలేదు!– ఈవిడగారొక్కరి సాయం చెయ్యనంత మాత్రంలో మా యింట్లో పెళ్లేం ఆగిపోదు!" అంది సావిత్రమ్మ కోపంతో గట్టిగా తమలపాకులు నమిలేస్తూ.

"ఆరాధ మొగుడు బాబుగారాఫీసులో నే గుమస్తా కదండమ్మగారూ?!" అని అడిగిందొకావిడ మహా తెలీనట్టు.

"ఔను!"

"అమ్మగారు ఈ విషయాన్ని బాబుగారితో చెప్పినట్లయితే..." నరసమ్మ సగంలోనే ఆపేసింది చెప్పదల్చుకున్న విషయాన్ని!–

"బాబుగారికి తెల్సుకుంటే ఎంతసేపు?!" అందొకావిడ. 'తన' ఊహను రాధ మొగుడి ఉద్యోగం మీదికి పోనిచ్చి.

"ఆ ఎ. సి. టి ఓ గారి పెళ్లానికి కూడా బుద్ధి లేదు సుమండీ!–తనో ఆఫీసరు పెళ్లామయుండీ కూడా, ఈ గుమస్తాగాడి పెళ్లాన్ని తనతో సమానంగా చూస్తూ గౌరవించడం, దానికి విలువనివ్వడం చాలా అసందర్భమైన విషయం!–అలా చనువియ్యడంచేత అంతకంతకూ ఆవిడ నెత్తెక్కి చిందులు త్రొక్కుటట్లుంది. వాళ్ళ సోఫాలలోనూ, మంచాలమీదా కూర్చొని కబుర్లు చెప్తూండడం, రేడియో తనే వేసేస్తూండడం, ఒకటేఁవిటి ఆయింట్లో అది సర్వ విధాలా స్వతంత్రం చేస్తున్నాది!– చూడగా చూడగా అసలావిడను పక్కకు నెట్టేసి, ఆ ఎ. సి. టి. ఓ. గారి ప్రక్కను ఈ రాధే స్థానాన్ని ఆక్రమించేటట్టుంది!" అప్పడాలముద్ద పెడుతూ అంది నరసమ్మ.

"ఆక్రమించేటట్టుం డేవిటి??? ...ఆక్రమించేసింది!—ఈవిడ గారంటే అతగాడికి గొప్ప అభిమానం!—సిగ్గూ లజ్జా లేకుండా ఆ ఎ. సి. టి. ఓ తో ఎంత చనువుగా మాట్లాడుతుం దనుకున్నారు! — చూడవలసిందే; ఆ పకపకలూ, వికవికలూను!... ఇంతకీ ఈ రాధ మొగుడొట్టి బ్ర భాజమానం భజగోవింద గాడిలాగున్నాడు! — చీమూ నెత్తురూ ఉన్నవాడయితే ఇలా పూరుకుంటాడూ?" అని అంది; తనవంటి పతివ్రత

మరొకత్తుండదనే భావంలోనున్న ఆ ఏకాక్షి కామాక్షమ్మ.

"ఎంత చదువుకున్నదయినా అంత విరగబాటుండకూడదు!" అని సెలవిచ్చిందో చదువురాని ముత్తైదువ!

"ఇంతకీ ఎంతవరకూ చదువుకున్నాదీ?" అని అడిగింది తహసీలుదారు భార్య.

"ఆఁ!—ఎంతో లేదు. స్కూలు ఫైనలు పాసయిందిట!" అని సమాధాన మిచ్చింది వరసమ్మ.

"ఈమాత్రం చదువుకేనా యింత విరగబాటు?!—కట్టిస్తాను తెగులు!" అంది సావిత్రమ్మ. తను సామాన్యమైన స్త్రీ కాదు. ఫస్టు క్లాసు తహసీలుదారు భార్య! అంటే తన అంతస్థు ఏమంత సామాన్య మయినది కాదన్న మాట! తనిలా బంట్రోతుగాడిచే కబురంపేసరికి మిగతా గుమాస్తాల పెళ్ళాలందరూ వచ్చేసేరు. ఆ వీధిలోనున్న కొంద రాడవాళ్లు కబురెట్టక పోయినా—విషయం తెలుసుకొని వాళ్లంతట వాళ్ళే ఎంతో భయ భక్తులతో వచ్చేరు. కబురెటినప్పటికీ కొత్త గుమాస్తా పెళ్ళాం రాకపోవడం క్షమించ డానికి వీలు లేనంతటి తప్పు! ఏమయినా సరే ఆ రాధ పరువు నలుగురిమధ్యా తీసేసి అంద రమ్మలక్కల చేతా ఛీ ఛీ అనిపించేసి ఆమె నవమాన పరచాలనే నిశ్చయాని కొచ్చేసింది సావిత్రమ్మ. మున్ముందే విధంగా ఆమె నవ మాన పరచాలో ఆ పద్ధతులకు సంబంధించిన పథకాన్ని వరసమ్మతో కలిసి ఆలోచించి మరీ అమలుపరచాలనుకుంది!!!

* * *

అప్పడాలొత్తడానికి వెళ్ళకపోయినందుకు, తాసీల్దారుగారి భార్య తనమీద కారాలూ మిరియాలూ నూరుతున్నట్లు రాధకు తెలిసింది. ఆవిడా, వరసమ్మా కలిసి తనమీద లేనిపోనివన్నీ కల్పించి తనను అవమాన పరచే ప్రయత్నంలో వున్నట్లు కూడా తెలిసింది.

ఇంతకీ తనుచేసిన తప్పేమిటి మహా!—ఈ విషయమై ఎ. సి. టి. ఓ. గారి భార్యతో ముచ్చటిస్తున్న సందర్భంలో వరసమ్మ అక్కడకు వచ్చింది. ఆమెను చూచేసరికి ఒళ్లు మండిపోయింది రాధకు. రక్తనాళాలు ఉప్పొంగేయి!—కళ్ళు చింతనిప్పులులా తయారయేయి!—"ఏఁవండీ వరసమ్మగారూ!—ఆనాళ అప్పడాలొత్తడానికి నేను రాలేదని ఆ తహసీలుదారు పెళ్ళాం, నా గురించి చాలా అసందర్భంగా మాట్లాడిందట!....ఆవిడ తో పాటు ఆమె వెనకాల తోకల్లాగ తిరిగే అమ్మలక్కలు కొందరు తెగ మొరిగేరుట!" చాలా తీక్షణంగా ఆ మాటలంది రాధ.

"అబ్బే!...ఎంత మా టెంతమాట!—ఆవిడ వనుకుంటే కళ్ళుపోతాయి. మీ గురించి ఏమీ అనలేదే!" అంది వరసమ్మ.

"ఎందుకు దాచుతారు చెప్పండీ?!—నాకంతా తెలిసింది!...ఆవిడ తహసీల్దార్ పెళ్ళామయితే ఎవరికెక్కువ?—అదృష్టం బాగుండి ఆవిడ మొగుడు తహసీల్దార్ అయేడు. అంతమాత్రంలో ఆ విరగబా టెందుకు?—ఆవిడ మొగుడు ఆఫీసులో గుమస్తాలమీద అధికారం చెలాయిస్తున్నట్లు, ఈవిడగారు గుమస్తాల పెళ్ళాలమీద అధికారం చెలాయించాలనుకుంటున్నా దేఁవిటి?—అలాంటభిప్రాయమున్నట్లయితే త్వరగా మార్చుకోమని చెప్పండి!"

"అబ్బెబ్బే!...ఆవిడ కలాంటభిప్రాయం లేదే!"

"మరి వెనకేసుకు రాకండి!—ఆవిడలో ఎంత అహంభావం జీర్ణించుకుపోయిందో నాకు తెలుసు!—ఆ మధ్యాని ఓ రెండు మూడు దఫాలు వాళ్ళింటికి వెళ్లితే కూర్చోమనేనా చెప్పలేదు. పైగా తను ఈజీచైర్‌లో పడుక్కొని నన్ను అలా నిలబెట్టే మాట్లాడింది!—అలాంటి మనిషింటికెవరెళ్తారండి. సిగ్గూ లజ్జా లేని తక్కువబుద్ధిగల వెధవలెవరో వెళ్ళాలి!—ఆవిడ సభ్యమయిన మనిషే అయితే సహాయం చెయ్యడానికి తప్పకుండా వచ్చి ఉండేదాన్నే! అవసరం వచ్చినప్పుడు ఇతరులకు సహాయం చెయ్యడానికి నేనెప్పుడూ వెనుదియ్యను. కానీ ఇలాంటి గర్వంగల వాళ్లని చూస్తేమాత్రం నాకొళ్లుమంట!—ఏఁవండీ నాకు తెలీకడుగుతాను; మీరింత మందీ ఆవిడకీ పెళ్లిసందర్భంలో పనిపాట్ల విషయంలో సహాయపడుతున్నారుకదా, రేపొద్దున్న మీ ఇళ్లలో ఎవరింటిదగ్గరయినా శుభకార్యం జరుగుతే ఈ తాహసీల్దారు పెళ్ళాం పనిపాట్లలో సహాయం చేసేటందుకొస్తుందా అని?!—అప్పడాలొత్తడం,



 # అహంభావం 

...క్కలాలు చెయ్యడం ఇటువంటిపనులు చేయకుండా అని!! – సొంతింట్లో సొంతపనే చేసుకోలేనంతటి సుకుమారి! — అమ్మా, వరసమ్మగారూ!— నేనిలా అన్నానని ఆమెగారితో చెప్పండి. మొగుడుతో ఈవిషయం చెప్పి మా ఆయనగారుద్యోగం పీకించేయమనండి!—చూద్దాం ఆ తమాషాకూడాను!"

"బాగుంది బాగుంది!... నేనిక్కడమాటలక్కడా, అక్కడమాటలిక్కడా చెప్పేటు తిరిగే మనిషిననుకున్నారేమిటి?— కొంచెం మర్యాదగా మాట్లాడడం నేర్చుకోండి!" కోపాన్ని దిగమింగుకుంటూ అంది వరసమ్మ.

"మీ సలహా ప్రకారం ముందు ముందు నేర్చుకుంటానులెండి!—అన్నట్లు ఉచ్చం, నీచంలేని ఓకుచ్ఛరాలు నామీదచాలానీచమయిన అపవాదును సృష్టించి ప్రచారం చేస్తున్నారని విన్నాను. "ఎ. సి. టి.ఓ"కు నాకూ ఏదో అసందర్భపు సంబంధమున్నాదని ప్రచారం చేస్తున్నారట!..."ఎ. సి. టి. ఓ.", మా దొడ్డమ్మ కొడుకు! – నాకు అన్నయ్య అవుతాడు. తెలుసా?! – ఎ. సి. టి. ఓ కి, మాకూ ఇంతదగ్గర సంబంధమున్నాదని చెప్పుకొని, లేనిపోని గొప్పతనాన్ని అంటగట్టుకోడం ఇష్టంలేక ఇంతవరకూ మాకూమాకూ గల సంబంధాన్ని మేం ఎవ్వరితోనూ చెప్పలేదు" తమ వాళ్ళవరయినా కాస్తా పెద్ద ఉద్యోగంలో ఉంటే, ఇంక అదేపనిగా తమకూ ఆ పెద్ద ఉద్యోగంలో నున్న వ్యక్తికీ గల బంధుత్వాన్నీ, ఒకవేళ దూరపు బంధుత్వమయితే ఏదో ఓలా వావికలిపి బలవంతాన సన్నిహితం చేసేసుకొని టామ్ టామ్ కొట్టుకుంటూ ఆ మూలకంగా ఓరకపు చవకబారు పలుకుబడిని సంపాదించుకొనే మనుషులుకూడా లేకపోలేదు! – కానీ మేం మలాంటి మనుషులము కాము!—అంచేత 'ఎ. సి. టి. ఓ' కి మాకూ గల సంబంధం మీకింతవరకూ చెప్పలేదు. తెలుసా!"

"అమ్మ!—వరసమ్మగారూ మా రాధకి కోపమొస్తే మనిషి కాదు!...మీరేమి అనుకోకండి!" అంది 'ఎ. సి. టి. ఓ' భార్య.

"అబ్బే! నేనేమీ అనుకోలేదు!...వస్తా వస్తా పనుంది!" అని చల్ల చల్లగా జారుకుంది వరసమ్మ.

* * *

"ఏమోయ్ వేణునాథం!... నీతో చెప్పిన పనెంతవరకూ అయింది?" అని అడిగేడు తహసీల్దారు.

"ఏ పని సార్?!" క్వశ్చన్ మార్కులా మొఖం పెట్టేడు వేణునాథం.

"హుం!—ఇంత మతిమరుపు మనిషి వేమిటోయ్ నువ్వు? రెండుడబ్బాల నెయ్యి 'సెక్యూర్' చెయ్యమన్నాను మరచిపోయేవా ఆ సంగతి?"

"మరచిపోలేదుసార్!—తమరు డబ్బిస్తే తెప్పిస్తాను."

"ఏడ్చినట్టుంది!—అసలు నీకు గ్రహింపుశక్తి శూన్యం!—ఇవి జమాబందీ రోజులు కదుటోయ్!... సమర్థులైన నలుగురైదుగురు గుమస్తాలతో చెప్పినట్లయితే తూనాలమీద కురిపిస్తారు నెయ్యి."

"ఓహో! – ఆ పద్ధతిలోనా?!...నాకు చాతకాదు సార్!"

"ఔను చాతకాదులే! ... పాపం, ఈ ఊరికి ఈ మధ్యనే కదూ నీకు బదిలీ అయింది. బహుశా నా సంగతి నీకింకా బోధపడడం లేదులే!–అసలు నీకు ఆఫీసు పనొకటి చాతనయి ఏడిస్తే కదా! – మోస్టు ఇన్ ఎఫిషెంట్'!"

"ఎంచేత సార్ 'ఇనెఫిషెంటు'? మీ యింట్లో పెళ్ళికి కావలసిన నెయ్యి ఉల్ఫాగా సంపాదించలేకపోడంచేతా?"

"అధిక ప్రసంగం!—దయచెయ్యి ఇక్కడనుంచి!...ఇప్పుడు నాకూతుర్ని ఎవరికిస్తున్నానో తెలుసా?...'ఆర్. డి. ఓ' గారి కుమారుడికి!—అంటే నాపై అధికారితో వియ్యమొందుతున్నానన్న మాట! ఈ విషయం గుర్తుంచుకో!"

"మీ అమ్మాయి పెళ్లి సందర్భంలో కావలసిన నెయ్యి నేను 'సెక్యూర్' చెయ్యకపోడం ఓ పెద్దనేరంగా తమరు భావించి, తమ వియ్యంకులుగారికి. అంటే 'ఆర్. డి. ఓ.' గారికి ఈవిషయమై ఫిర్యాదుచేసి నా ఉద్యోగం ఊడపీకించేస్తారన్నమాట! తమ ఉదార స్వభావానికి నా ధన్యవాదాలు. సెలవ్!" అని అంటూ విసుగ్గా వెళిపోయేడు వేణునాథం.

"అబ్బ! ... ఎంత తలబిరుసు! ... ఈ పెళ్లిదా అయిపోయేక వీడిపని పడతాను. నా తడాకా చూపిస్తా!... మూడు చెరువుల నీళ్లూ తాగిస్తాను!" అని లోలోన గొణుక్కున్నాడు తహసీల్దారు.

* * *

పెళ్లి పందిట్లోకి 'వేణునాథం' అతని భార్య 'రాధ' రావడంచూసి ఆశ్చర్యపోయేరు తహసీల్దారుగారి భార్యా, వరసమ్మాను!

"పిలవని పేరంటకం ఇదేంటి!" అంది వరసమ్మ సావిత్రమ్మతో రాధకు వినబడేటంత గట్టిగా.

"సిగ్గూ లజ్జా వుంటేగా!...అందరూ తినేసేక ఆ మిగిలే ఎంగిలి మెతుకులు పట్టేస్తే తినేసిపోదామని కొచ్చినట్లున్నారు!" అంది సావిత్రమ్మ అదోలా నవ్వుతూ.

"ఇంతకీ బాబుగారొకవేళ వాళ్ళని పిలచేరో ఏమిటో?!" సంశయాన్ని వెలిబుచ్చింది వరసమ్మ.

"ఏమో!—కనుక్కుంటాను." అని భర్త దగ్గరకెళ్ళి ఆ విషయమై కనుక్కుంది!

"లేదే!—సిగ్గూ లజ్జా లేకుండా ఎందుకొచ్చేరు?!—బంట్రోతు గాడిచేత గెంటించేస్తాను!" అని తహసీలుదారుగారు అని, వెంటనే బంట్రోతుగాడిని పిలిచి వాడికి చెయ్యవలసిన పనిని తెలియజేసేరు.

"ఏంవండోయ్ బాబుగారూ!–మీ ఇద్దర్నీ తహసీల్దారుగారు వెళ్లిపొమ్మన్నారు! ...అసలు తను పీకమీద చెయ్యేసి గెంటేయమన్నారు! తమకాడ కానీ పరకాతన్నోణ్ణవడంచేత నా చేతులు రాలేదు గెంటేయడానికి!" అన్నాడు బంట్రోతు వేణునాథంతో.

అంతలో అక్కడికి ఆర్.డి.వో., అతని భార్యా, పెళ్ళికొడుకూ, మిగతా అతని పిల్లలూ వచ్చారు. "ఏవిరా వేణూ!...ముందు బయలుదేరిన కారులో రాధా, నువ్వూ ఇక్కడికొచ్చేసేరన్నమాట. భేష్! —మీ కోసం మేం వెతుక్కున్నాం! అమ్మలు చెప్పింది నువ్వూ రాధా సత్యాలూ పిల్లలూ వెళ్లిపోయినట్లు!" అని అంటూ వేణునాథం భుజంమీద చెయ్యివేసి "వీడు మా చిన్నాన్న కొడుకు!" అని తనకూ వేణునాథానికీ గల సంబంధాన్ని తాహసీల్దారుకు, తెలియజేసేడు ఆర్. డి. ఓ.

తహసీలుదారుకు కాళ్ళుచేతులూ చల్లబడ్డంత పనయింది!

"నా తోటికోడలు!" అని రాధకూ తనకూగల సంబంధాన్ని సావిత్రమ్మకు తెలియజేసింది. ఆర్. డి. ఓ భార్య.

సావిత్రమ్మ ముఖం నల్లగా మాడిపోయింది!!

తెల్లబోయింది వరసమ్మ!! 




[ఆదిపర్వము — తృతీయాశ్వాసము]

క. నీపుణ్యతనువువలనన, యీపుత్త్రకుఁ డుద్భవిల్లె నెంతయు నొప్పన్
దీపంబువలన నొండొక, దీపము పుట్టించినట్లు తేజం బెసఁగన్.

మ. విపరీతప్రతిభాష లేమిటికి నుర్వీనాథ యీపుత్త్రగా
త్రపరిష్వంగసుఖంబు సేకొనుము ముక్తాహారకర్పూరసాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడుం శీతమే.

క. అనఘుఁడు వంశకరుండై, పెనుపున నీసుతుఁడు వాజపేయంబులు నూ
ఱొనరించు నని సరస్వతి, వినిచె మునులు వినఁగ నాకు వినువీథి నెసఁగన్.

క. భూరిగుణు లిట్టికులని, స్తారకు దారకు నుదారధర్మప్రియ ని
ష్కారణము దప్పఁ జూడఁగ, సారమతీ చనునె నాఁటిసత్యము గలుగన్.

చ. నుతజలపూరితంబు లగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొక బావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడఁగన్.

క. వెలయంగ నశ్వమేధం,బులు వేయును నొక్కసత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము,వలనన ములు సూపు గౌరవంబున పేర్మిన్.

తే. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద,సమధిగమము సత్యంబుతో సరియుఁ గావ
యెఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁ బెద్ద,యండ్రు సత్యంబు ధర్మజ్ఞు లైనమునులు.

క. కావున సత్యము మిక్కిలి, గా విమలప్రతిభఁ దలఁచి కణ్వాశ్రమసం
భావితసమయస్థితి దయఁ, గావింపుము కొడుకుఁ జూడు కరుణాదృష్టిన్.

క. క్షత్త్రివరుఁ డై సవిశ్వా,మిత్త్రునకుఁ బవిత్రయైన మేనకకును స
త్పుత్త్రి నయి బొంకు వలుకఁగ, ధాత్రీతలనాథ యింత ధర్మేతరసే.

వ. అనిన శకుంతలపలుకులు సేకొన నొల్లక దుష్యంతుం డిట్లనియె.

క. ఏనెట నీవెట సుతుఁ డెట, యే నెన్నఁడుఁ దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మానిను లసత్యవచనలు, నా నిట్టు లసత్యభాషణం బుచితంబే.

క. పొడవునఁ బ్రాయంబునఁ గడు, గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ
కొడుకని యీతని నెంతయు,నెడమడుగుగఁ జూపఁ దెత్తె యిందఱునగఁగాన్.

వ. ఇట్టి లోకవిరుద్ధంబుల కేమోదుదు మయుక్తంబులయినపలుకులు పలుకక నీయాశ్రమంబునకుం బొమ్మనిన శకుంతల యత్యంతసంతాపితాంతఃకరణ యై.

మధ్యాక్కర. తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁ బడియెద నొక్క
డుదువులు వేయు నిం కేల యిప్పాటి నోములు దొల్లి
కడఁగి నోఁచితిని గా కేమి యనుచును గండె డెందమున.

వ. ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశయై బోరనఁ దొరఁగుబాష్పజలంబు లందంద యొత్తికొనుచు నింక దైవంబకాని యొండు శరణంబులే దని యప్పరమపతివ్రత తనయుం దోడ్కొని క్రమ్మఱ పోవ నున్న యవసరంబున.

చ. గొనకొని నీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సే
కొని భరియింపు మీతని శకుంతల సత్యము వల్కె సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్,

వ. ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతల పతివ్రతాత్వంబును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రశంసించు వేలుపుల పలుకు లతివ్యక్తంబు లయి యాకాశంబువలన వీతెంచిన విని దుష్యంతుండు సభాసదులు విన నిట్లనియె,

తే. ఏను నీయింతియును గాని యెఱుఁగరన్య, లర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబు
నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము, నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము.

తే. అన్య లెఱుఁగమిఁ జేసి లోకాపవాద,భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని నిందఱ కిప్డు డెఱుఁగఁ జెప్పెనాకాశవాణి యచ్చెరువుగాఁగ.

వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్ష పులక లెసఁగ నాలింగనంబు సేసి శకుంతలామహాదేవి నతి ప్రణయగౌరవంబున సంభావించి యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుం జేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి తనరాజ్యభారం బంతయు భరతుం బూన్చి దుష్యంతుండు దపోవనంబున కరిగిన,

చ. భరతుఁ డశేషభూభువన భారధురంధరుఁ డై వసుంధరం
బరఁగి యనేక యాగములఁ జాయక భాస్కరజహ్ను కన్యకా
సురుచిరతీరదేశముల సువ్రతుఁ డై యొనరించి భూరిభూ
సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధసువర్ణ గవాశ్వహస్తులన్.

వ. మఱియు నతీతానాగతు లైన నిజవంశంబునరాజుల కెల్ల వంశకర్తయయ్యె నట్టి భరతునకుఁ గైకేయియైన సునందకు భుమన్యుండు పుట్టె వానికి దాశార్హపుత్త్రియైనవిజయకు సుహోత్రుండు పుట్టె వానికి నిక్ష్వాకుకన్య యైన సువర్ణకు హస్తి పుట్టె నతనిపేరం గౌరవ్యరాజధాని యైననగరంబు హస్తిపురంబు నాఁ బరఁగె నట్టిహస్తికిం ద్రిగర్తరాజపుత్త్రి యన యశోధరకు వికుంఠనుండు పుట్టె వానికి దాశార్హపుత్త్రియైనవసుదేవకు నజమీఢుండుపుట్టె నయ్యజమీఢునకుఁ గైకేయియు గాంధారియు ఋక్షయు నను మువ్వురు స్త్రీలకు,

క. బలయుతులు నూటయిరువది, నలువురు సుతు లుద్భవిల్లి నానాదేశం
బులకుఁ బతు లైరి మఱి వా,రలలో సంవరణుఁ డఖల రాజోన్నతుఁ డై.

క. అలఘుఁడు పౌరవకులవ,ర్ధనుఁ డద్దినసాథతనయఁ దపతి వివాహం
బొనరంగ నయ్యె నిరువుర,కును వంశకరుండు పుట్టెఁ గురుఁ డున్నతుఁ డై

వ. వానిపేరం గురుక్షేత్రంబునాఁ బరఁగె నట్టికురునకు (దాశార్హియైన శుభాంగికిని విదూరథుండు పుట్టె వానికి మాధవి యయిన సంప్రియకు నసశ్వుండు పుట్టె నయ్యనశ్వునకు) మాగధియైన యమృతకుం బరీక్షితుండుపుట్టె వానికిబహుదానసుతయయిన సుయశకు భీమసేనుండుపుట్టె వానికిం గైకేయి యైనకుమారికిఁ బ్రతిశ్రవసుండు పుట్టె వానికిఁ బ్రతీపుఁడు పుట్టెఁ బ్రతీపునకు శిబిపుత్త్రి యైనసునందకు దేవాపి శంతను బాహ్లికు లనఁగా మువ్వురు పుట్టి రందు దేవాపి బాల్యంబునంద తపోవనంబున కరిగిన శంతనుండు రా జయ్యె వానికి గంగాదేవికి దేవవ్రతుండైన భీష్ముండు పుట్టె మఱి యాశంతనునకు యోజనగంధియైన సత్యవతికిం జిత్రాంగద విచిత్రవీర్యు లనంగా నిద్దఱు గొడుకులు పుట్టి రందుఁ జిత్రాంగదుండు బాల్యంబున గంధర్వనిహతుం డయిన వానికిం గొండుక వాని విచిత్రవీర్యు రాజ్యాభిషిక్తుం జేసి భీష్ముండు కాశీరాజదుహితల నంబికాంబాలికలను వారి నిద్దఱ విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన.

చ. అతిశయరూపయౌవనగుణాధికసుందరమైనయాసతీ
ద్వితయమునందు సంతతరతిక్రియ వివశుం డయి రాజకృత్యముల్
మతి నొకనాఁడుఁ జేయ కహిమద్యుతితేజుఁడు రాజయక్ష్మబా
ధితుఁ డయి దేవలోకసుగతిప్రియుఁ డయ్యె విచిత్రవీర్యుఁడున్.

★

# నాలుగు రోడ్ల కూడలిలో

అక్కడ నాలుగు రోడ్లూ కలుస్తాయి.

ముఖ్యమైన సెంటరు-పట్టణానికి.

బస్సుకోసం పడిగాపులు పడివుండాలి.

పది నిముషాలకి ఒక బస్సు వస్తూనే వుంటుంది.

పోతూనే వుంటుంది.

జీవితాన్ని అమ్ముకుని ఆఫీసులో పని చేస్తూండేవాళ్ళు వొకర్నొకరు తోసుకుంటుంటారు. ఇందరు ముందుగాపోవాలని ఎంతసేపైనా నిలబడాలి.

నాకు ఇంటితొందర ఏమీలేదు. పోనీలే పాపం, ఐదారుమైళ్లనుంచీ పొద్దున్నెప్పుడో ఎనిమిదింటికి బయలుదేరి వచ్చివుంటారుకదా అని వాళ్ళంటే నాకు జాలి. ఇంటిదగ్గర వాళ్ళ పాపలు ఎదురుచూస్తుంటారు. వీళ్ళు వెళ్ళి హాయిగా విశ్రమించటానికి వీలులేదు కదా-మళ్ళీ మార్కెట్‌కు పోవాలి. లేక పోయినా, ఏదో పని వుంటుంది. నాలాగా కుర్చీలో కూర్చుని వొక్క సిగరెట్ కాల్చుకుని ఈ జంఝాటమంతా క్షణంసేపైనా మరచిపోవటానికి వీలుండదుకదా అని నేను వాళ్ళను చూసి జాలిపడుతుంటాను. యాభైయేళ్ళ ముసలాయనదగ్గరనుంచీ పాతికేళ్ళ కుర్రాడివరకు బస్సెక్కటానికంతగా ఎందుకు తహతహలాడుతారో నాకు అర్థంకాని విషయమైపోయింది. ఇది రోజూ వుండే కార్యక్రమే నాయె. ఇవాళ ఏమైనా క్రొత్త సంగతా ఇదికి? అయినా వాళ్లు అలాగే రోజూ తోసుకుని, తొక్కుకుని నానా ఇదవుతారు. నేనుమాత్రం నిర్లిప్తుడిలా నిల్చుని ఆకాశంలోకి చూస్తూ ఐదారు బస్సులు పోయేవరకూ కాలం గడిపేస్తాను. తరువాత ఎప్పుడో వీలు చూసుకుని రూమ్ చేరుకుంటాను.

ఇదీ నా అలవాటు;

దీనికి భంగం లేదు,

వాళ్లవలె తొందరపడవలసిన అవసరమూ నాకు లేదు.

వాళ్లకున్న అదృష్టాలలో ఒక్కటీ నాకు లేదు.

నాకోసం ఇంటివద్ద ఎదురుచూసేవాళ్ళు ఎవరూ లేరు.

నా అలనా పాలనా ఎవరూ పట్టించుకోరు.

నా రూమ్‌మేటు శంకరంమాత్రం పొద్దుపోయి రూమ్ చేరుకుంటే, సినిమాకు పోయినావా? అని యేడుపుముఖం పెట్టి అడుగుతాడు. నా ఏడుపు వాడిది!

అంతేగాని తిండికోసమైనా నాకోసం కాచుకుని వుండడు. ఆ పనిపిల తెచ్చిన క్యారియర్‌ను రెండు పెట్టి భాగించి ముందుగా తినేసాడు. ఎప్పుడో నేను పోయి, ఆ చల్లారిపోయిన పదార్థాలని రుచి చూడాల్సివుంటుంది. అప్పుడప్పుడు నాకు కోప మొస్తుంటుంది. దిగులు వేస్తుంది. ఎవరికోసమని ఇంతశ్రమ పడాలి! ఎవరికోసం బ్రతకాలి? ఎందుకిలా రోజులు గడిచిపోతున్నాయి అని ప్రశ్నించుకుంటాను.

"మంజుశ్రీ"

సరే మరి ఎవరికెలా రాసిపెట్టివుందో అలానే జరుగుతుందిమరి అని కుప్పవేదాంతాన్ని మననం చేసుకుని సరిపెట్టుకుంటుంటాను.

ఇలానే గడచిపోతున్నది జీవితం.

ఒక రోజు ఆ నాలుగురోడ్ల కూడలిలో బస్సుకోసం అక్కడ చేరిన పదిమందిలో నేనూ వొకణ్ణిగా నిల్చున్నాను. ఆశ్చర్యం, నాబాల్య స్నేహితుడు రామారావు కన్పించాడు. నాకు కొండంత సంబరమైంది.

వాణ్ణిబరబరా ఈడ్చుకొని కాఫీకిలాక్కుపోదామని ప్రయత్నించాను. వాడు ఏడుపుముఖం పెట్టి 'బస్సుపోతుంది' అని గునిశాడు. అయినా వాణ్ణి నేను వదిలిపెట దలచలేదు. బాల్యస్నేహితుడాయిరి. ఎన్నోనాళ్లతరవాత కనపడ్డాడు. నాకు ప్రాణం లేచివచ్చినట్లయింది.

కాఫీతాగుతూ వొక్కొక్కటే విషయం అడిగి కనుక్కుంటున్నాను. అప్పటికే నాలుగుబస్సులు పోయినయ్. కాఫీతాగే చోటునుంచి బస్ స్టాండు కనపడుతూనే వుంటుంది, టైమ్‌చూసి 'అరె!' అని గాభరాపడ్డాడు.

"ఏం అంత, ఏం ముంచుకుపోయిందోయ్! సినిమాకు వెళదాం ఇవాళ," అన్నాను.

వాడు విచారంగా ముఖంపెట్టి మళ్ళీ "నేనిక్కడే వుంటాను గదురా! ఇహ రోజూ కలుసుకోవచ్చును. మరెప్పుడైనా పోదాంలే" అన్నాడు.

"ఏమిటోయ్ విశేషం?" అన్నాను.

"మా ఆవిడ ఎదురుచూస్తుంటుంది. నేను ఆలస్యంగాపోతే బిక్కమొహం వేసుకుని వుంటుంది పాపం" అన్నాడు.

నాకు అమాంతం హుషారువచ్చి వాడి వీపుమీద గట్టిగా వొక్క చరుపు చరచి 'చెప్పావుకావు!' అని సంతోషం ప్రకటించబోయాను. ఇంకా సంతోషం యెక్కువై హాయ్! హాయ్! అందామనికూడా అనుకున్నాను. కాని వాడిముఖం గొప్పవేదాంతిముఖంలా మారిపోవటంతో కాస్త తగ్గి వివరించమన్నట్లుగా చూశాను.

"నిన్ను చూస్తే నాకు ఈర్ష్యగా వుందిరా" అన్నాడు మొట్టమొదటే.

"హోరిపిడుగా! తాడూ బొంగరమూ లేకుండా వెయ్యేళ్ళు ధనంతో వర్ధిల్లేనా

# ★ నాలుగురోడ్ల కూడలిలో ★

పోటీ వాణ్ణి చూసి నీ కెందుకురా యీర్ష్య?" అన్నాను.

"నీకు దిగులూ చింతా లేదు. సంపాదించుకుంటావు. సంపాదించుకుంది నీ భాగం వరకైనా (తల్లిదండ్రుల భాగం వదిలేసి) నీ ఇష్టం వచ్చినట్లు ఖర్చుపెట్టుకుంటావు. సినిమాకు పోదాం రమ్మని ఎంత నిర్విచారంగా నన్ను ఆహ్వానించావో చూడు! నా విషయం అలా కాదే! అర్ధాంగి అలుగుతుంది నేను నీతో సినిమాకు వస్తే—నాయనా! నీకు నేనో సలహా ఇస్తున్నాను విను. ఇప్పుడిప్పుడే ఈ రొంపిలో దిగకు పోయిగా, నిర్విచారంగా వుండు. ఎందుకొచ్చిన బెడద ఇది! అబ్బ ఎంత కష్టపడుతున్నానో చెప్పలేను" అన్నాడు.

బస్సువచ్చి ఆగింది ఒక్క ఖాళీమాత్రమే వుందట. వాణ్ణి కొస్తా ఎక్కించి నేను ఆలోచనలో పడ్డాను.

నాకు ఈ మధ్య ప్రతివాళ్ళూ ఇదే సలహా ఇస్తున్నారు. "ఆర్ యూ మేరీడ్?" అని అడిగి, నేను లేదని తలవూపితే, నన్ను తెగ మెచ్చుకుంటున్నారు. ఎందుకో నాకు అర్థం కావటం లేదు. అంతకష్ట పరంపరలతో కూడుకొని వుంటుంది కాబోలు వైవాహిక జీవితం! అఖరుకు మా అమ్మ కూడా "ఆలూ బిడ్డా లేనివాడివి, నీకెందుకు రామనోవ్యధ?" అని పాడటం వొకటి రెండుసార్లు విన్నాను. ఆలూ బిడ్డలూ వుంటే మనోవ్యథ వుంటుందా? ఛీఛీ ఇదేం పాట.

రామారావు కేం కష్టం వచ్చింది?

పెళ్ళయిం తర్వాత బ్రాత్రంలా బలిశాడు.

అయినా, ప్రతివాళ్ళకూ ఇది వొక ఫ్యాషనైపోయింది! ఫలాని పరీక్ష ప్యాసైనవాళ్ళు రొమ్ము విరుచుకుని అబ్బ ఆ పరీక్ష ఎంత కష్టం అని వర్ణిస్తారు. అంతేకాని "అదే సులభం, చాలా తేలిక నువుకూడా కూర్చో పరీక్షకు" అని సలహా ఇవ్వరుకదా! ఈ పెండ్లిళ్ళు అయినవాళ్ళు కూడా అంతే. అందరికీ అలాంటి సలహాలు ఇస్తేకాని వాళ్ళకు వో రకమైన తృప్తి వుండదు కాబోలు!

అయినా నా కిదంతా ఎందుకు?

ఊరికే రామారావు చెప్పిపోయిన దాని మీద ఇన్ని ఊహాతరంగాలు లేచినయ్.

అలస్యం ఎలాగూ అయిందికదా అని అలాగే సినిమాకు పోయాను. అక్కడ ఎంతమంది ఎంతక్కా చిరునవ్వులు చిందించుకుంటూ ఆలూమగలూ సినిమాకు వచ్చారనుకున్నారు? అందులో తృప్తిలేనట్టేనా? ఏమో?

నాకు వాళ్ళనుచూస్తే ఏమిటోలా అనిపించింది. రూమ్ చేరుకునేసరికి తొమ్మిదైంది.

చెమ ఉక్కగా వుంది. బాత్ రూంలోకి పోయి కుళాయికింద శరీరాన్ని చేర్చి నే చల్లటి నీళ్ళు ధారగా శరీరాన్ని తడుపుతుంటే చలికి వణికిపోయాను.

అప్పుడు నా కనిపించింది.

రామారావు గుర్తొచ్చాడు.

తలోగా కేడీర్ళు పాసుకుంటూ...



కంచి దేవాలయ దృశ్యం
—ఫోటో: పి. సుదర్శన శాస్త్రి]

వాడు. నా శ్యామలకు వీపుగుద్ది వుంటుంది. ఎదురుగ్గా కూచుని అన్నం పెట్టి వుంటుంది. ఫలాని నవల్లో నాయికవలె ఇంకొస్త తినమని బ్రతిమిలాడి వుంటుంది. నాకు నవ్వొచ్చింది. వాడు చెప్పిన వేదాంతానికి. నా క్యారియర్ భోజనంలాంటిది కాదు వాడి జీవితం.

నేను రోజూ బస్సుదగ్గర వాడికోసం చూస్తూనే వున్నాను. అయితే ఆఫీసు వదలగానే వురుకులు పరుగులమీద వచ్చి తోసుక్కుని యుద్ధంచేసి బస్సులో వెళ్లిపోతున్నాడులా వుంది.

తరువాత నాలుగురోజులకు కన్పించాడు కృతగ్రాత్రుడికి మల్లే. నే నేమీ అడక్కముందే "మూడుబస్సులు వెళ్ళిపోయాయి" అన్నాడు పెద్దవిచారంతో.

నాకు తమాషా చెయ్య బుద్ధేసింది.

"ఓరే నేను ఇవాళ ఓ పెళ్లి సంబంధం చూసివచ్చాను. పిల్ల బాగానే వుంది," అన్నాను.

వాడు సూటిగా ప్రశ్నించాడు:

"నీ జీత మెంత?"

"ఎనభైరూ," అన్నాను.

"నాయనా నే చెప్పేది వినరా. నువు కూడా ఈ రొంపిలో దిగకు. నా హృదయపూర్వకమైన సలహా ఇది. ఎందుకు ఇరుక్కుంటావు? ఇంకా నాలుగేళ్ళు పోనీ—విను—విను" అని మొరపెట్టుకున్నాడు.

వాణ్ణిచూసి నాకు జాలైంది.

"అంతా తమాషారా" అన్నాను

బస్సు వచ్చింది. వాణ్ణి లోపలికి నెట్టటానికి నేనూ శ్రమ పడాల్సి వచ్చింది. నాకేం తొందరలేదు. నేనెప్పుడు వెళ్ళినా ఫరవాలేదు. రామారావు వర్ణించినట్లుగా నాకు రొంపిలేదుగా మరి.

తరువాత నాలుగు రోజులకు రామారావు మళ్ళీ కన్పించాడు. తిరిగి అలానే విచారంగా ముఖం పెట్టి:

"మూడు బస్సులు వెళ్లిపోయాయి" అన్నాడు. ఈసారి వాడంటే నాకు సానుభూతిలేదు. కారణంకి చెబుతను! వాడి చేతిలో అరిటాకు దొప్పతో సంపెంగ పూలున్నాయి. మంచివాసన పక్కనున్న వాళ్ళకి మత్తు కలుగచేస్తున్నాయి. ఆ చేతిలో రెండే రెండు చక్రకేళీలున్నాయి. నన్ను చూశాడు కదా? ఒకటైనా నాకిస్తేనేం - పోనీ మాటవరసకు సంపెంగపూలూ - చక్రకేళీలూ నా కెందుకు? నేనేం చేసుకుంటాను? చంకలో అందమైన అమ్మాయి ముఖచిత్రంతో వారపత్రిక వుంది. వాళ్ళు దాన్ని చదువుకుంటారు గాబోలు.

నన్ను చూసి నవ్వి "భలేకథలు రాస్తున్నావుగాని, ఆ శృంగారమంతా కథల్లోనేరా నాయనా, సంసారమంటే రొంపి. మరేమనుకున్నావో. దీనిలోనూ నీ కథ వుందిరా, వుంది. మా ఆవిడకు చెప్పానులే. పెళ్ళికాలేదంటే ఆశ్చర్యపోయింది"

వాడు తెగనవ్వుతున్నాడు. నాకు చిన్నతనమైంది. అయినా నేనూ నవ్వాను. ఒక్క సంపెంగ పువ్వు అడుగుదామనుకున్నాను.

అయినా నా కెందుకు—?

నాకు వాడు సంసారం రొంపి రొంపి అనటం మహాకోపం తెప్పించింది. ఏమిటో వీడి వుద్దేశం. గట్టిగా అడిగి తేల్చుకుందామనుకున్నాను.

ఇంతలో బస్సు వచ్చింది.

మహా ఆత్రపడ్డాడు బస్సులో జొరబడటానికి.

ఆ రొంపిలోకి పోవటానికి ఎందుకో ఇంత ఆరాటం. ఒక్క క్షణం హాయిగా బయట వుండకూడదు?

వాడు బస్సులో వెళ్ళిపోయాడు. తరువాత నేనూ ఒక బస్సులో పోయాను.

బస్సులో వున్నంతసేపూ నేను ఆలోచించాను. ఇంకా సంపెంగపూల వాసన నన్ను వెన్నాడుతూనేవుంది. రామారావు నాకు నిజం చెప్పటంలేదా? ఇందులో ఏదో రహస్యముంది. వాడు నన్ను మోసగిస్తున్నాడు. వాడి జీతమూ ఎనభైరూపాయలే!



# సంజీవరావు గ

**రుద్రాభట్ల నరసింగ**

ట్రెజరీనుంచి వచ్చి పడక కుర్చీలో కూలబడగానే ఒక పక్కకి ఒరిగి పోయేడు సంజీవరావు.

నులకమంచం తలలోనుంచి సగం లేచి 'ఇంత మతిమరుపు మనుషులు ఆ ఆఫీసులో ఎలా పనిచేస్తున్నారు చెప్మా! కాని సట్టు పారేసేడని చెప్పి బుచ్చిగాడిని పొద్దున్నే గదా తంగున పెట్టేడు' అంది ఉమాబాయి.

ఆ మాటలలో తన మీద ప్రేమ కంటె కొడుకు మీద వాత్సల్యమే ఎక్కువగా ధ్వనించినందుకు సంజీవరావులో ఈర్ష్య రేగింది. వొళ్ళు మండింది. ఆఫీసులో తిన్న చీవాట్లన్నీ చక్రవడ్డీతో సహా ఇల్లాలు నెత్తి మీద వడగళ్ళ వానలాగ కురిపించి వేద్దామనుకున్నాడు. కాని వెంటనే ఆమె మొగం చూసి శాంతించేడు. పేరుకి ఉమాబాయి అయినా ఆమె పుత్తడి బొమ్మ. దీనికి తోడు ముగ్గురు పిల్లల తల్లి అయి పొందిన నిండు తనంతో, పసుపూ, నూనెజిడ్డూ మున్నగునవి అంటుకుని వింతరంగు లీనుతున్న మాసిన చీరతో, నడుంకట్టుతో, నీ టూత్ పేస్ట పేరూ వినకపోయినా చిరునవ్వుల పోటీలో గెలిచిన వారిని సైతం వెక్కిరించేటంతటి తెల్లని నవ్వుతో ఆమె తన యెదుట నిలబడేసరికి దారి పొడుగునా తను పక్క చూపులు విసరగా కనిపించిన వాయిల్, జార్జెట్, షిఫాను చీరల అమ్మాయిల నందరినీ మరచి పోయేడు సంజీవరావు. అంతేగాదు; సంధ్యాకాంత, పనీపాటూ లేని కవులూ, చిత్రకారు లంతా తనని చూపులతో మింగేస్తూంటే, సిగ్గుపడిపోయి తన చీకటి కొంపలో ఒదగడానికి రాలేదు గద—అనుకునేటంతటి భావుకత్వాన్ని పొందేడు.

పక్కింటి అనంతరావు పంతులు కబురు పంపించేడు. గబుక్కున లేచి గుండీలు లేని పేంటు ముందుతోకని సరిగా దోపుకుంటూ 'ఇదుగో, మడత మంచం ఊచలు ఊడలాగి వుంచు' అని చెప్పి వెళ్ళేడు సంజీవరావు.

అనంతరావు విశాలమైన పడక కుర్చీలో పెద్ద పరుపు చుట్టలాగ బిగువుగా పట్టి కూర్చున్నాడు.

'ఆఁ చిన్న పనుండి పిలిపించేను సంజీవరావుగారూ. మా బంట్రోతు వెధవలు రాలేదు. కాస్త బజారు సామాన్లు తెప్పించి పెట్టాలి' అన్నాడు. అనంతరావు తన హోదాకి తక్కువ తనం కలగనంతవరకూ బ్రతిమాలే ధోరణిలో.

అనంతరావు మ్యునిసిపల్ హైస్కూలులో ఉపాధ్యాయుడు. నీతి పాఠాలు వల్లించి పెళ్ళాం బిడ్డల ఉసురు పోసుకునే కొంతమంది తెలివి తక్కువ మేష్టర్లలాగ గాక, ఈయన మొదటినుంచీ వాకచక్యంతో మసులుకుని పిత్రార్జితాన్ని రెట్టింపుచేసి తన కడుపున బుట్టినవారు కడుపులో చల్ల కదలకుండా పేడు ప్రతిమలతో బతకడానికి వీలుగా నిరవాకం చేసేడు; చేస్తున్నాడు. ఇతను పై వారికి లోభిగా కనిపిస్తే ఇంట్లో వారికి ఖర్చుదారుగా కనిపిస్తాడు. రెండింటిలోనూ నిజం లేక పోలేదు.

అతను అలా కోరగానే సంతోషంతో సంజీవరావు మొగం ఇంతయింది. 'అయ్యో దానికేం భాగ్యం. చేతులో ఉన్న పని గదా. మూడు నిముషాల్లో తెచ్చిపడేనూ!' అన్నాడు.

'ఒరే చిన్నా, అమ్మనడిగి చీటీ రాయరా—అక్కే మీరు లేవడం కాదు. కూలివాడి



# సంజీవరావు సంసారం

'పోన్లెండి...అమూడు పావలాలూ మాటేయా?'

'లేదండీ. బజారంతా కాళ్లరిగేలాగ తిరిగేను. ఒక్కడూ మొగ్గండే' అంటూ ఆయనకి చిల్లర నివ్వసాగేడు.

'అన్నింటికీ బిల్లులు రాయించుకు వచ్చేరా?'

'అయ్యో! అది మరిచి పోతానా?' అని బిల్లులని అందించేడు.

'ఆఁ ఈ తమలపాకులకట్ట ఎలాగండి?'

'మూడణాలండి.'

'అరె! కిందటివారం బేడా ముక్కాణీకే తెచ్చేడే మా బంట్రోతు'

సంజీవరావు సిగ్గుపడిపోయేడు. ఛీ! ఏం మనుషులు! ఏంలోకం! కానీ కోసం సాటి పెద్దమనిషిని నిర్మొగమాటంగా అనుమానించడం ఎలా సాధ్యం అవుతుంది చెప్మా వీళ్ళకి! 'ఈ వారం కొంచెం ప్రియమై ఉంటా యండి.' అన్నాడు—మాటలకి ఎన్ని రంగులు పులమాలో ఇంకా తెలియని సంజీవరావు.

అనంతరావు పంతులు ఇలాగే ప్రతీదానికీ లెక్క అడిగి చివరకి సంజీవరావు చేసిన బేరం విషయంలో చిన్న అసంతృప్తిని వెలిబుచ్చాడు.

'ఆఁ చూడండి. మా సంసారంకంద రాబడికి రెట్టింపవుతోంది ఖర్చు. అంచేత నేను వస్తువు నాణ్యం చెయ్యడంలోనూ, బేరమాడ్డంలోనూ వర్తకుడికి టోపీ వేసేటంతటిగట్టివాడి నయేను'

'అంతవరకూ ఎందుకూ? రాత్రి సినిమాకి వెళ్ళాం. నాలుగు బాక్సు టిక్కెట్లకీ, కూల్ డ్రింకులకీ, ఏవో పిల్లలు తినడానికి అన్నిటికీ కలుపుకుని పదిరూపాయిలెందనుకోండి. ఇక సినిమా అయేక అంతా ఓ రిక్షాలో కే ఎక్కేసేం. మనం ఏవిఁటో అనుకుంటాం గానీండి ఈ బళ్ళవాళ్ళందరూ వట్టిబోళా వెధవలంటే నమ్మండి. మనం ఇచ్చేకనిచ్చేస్తాం లెండి. దానన్నపేటకి పోనీమంటే వచ్చే దారి అడిగేడు. ఆఁ వీడిది ఈ వూరు కాదురా అని గ్రహించేసేను. ఇంటికి రాగానే ఎంతిమ్మన్నా వన్నాను. మీదయ న్నాడు. కాదు చెప్ప మన్నాను. పావలా ఇప్పించండి. అన్నాడు. మూడణాలు ఇస్తాను తీసుకోమని చెప్పి పంపించేసేను. అసలు అక్కణ్ణుంచి ఇక్కడికి ఎంతని అడగరేం? అర్థరూపాయి చవట పెద్దమ్మరేటు! అదీ అలా వుండాలి బేరమంటే!

'ఆఁ అన్నట్టు మీరేదో పనితొందర్లో ఉన్నట్టున్నారు. కూర్చొబెట్టేసి నందుకు ఏమీఁ అనుకోకండి. ఆఁ వీటి మాటేం చెప్పేరు?' అన్నాడు అనంతరావు ఊచలని చూపిస్తూ.

ఇంతసేపూ సంజీవరావు ఆ రిక్షావాడి కథకి రూపకల్పన చేసుకుంటున్నాడు. పుష్యమాసపు ఎముకలు కొరికే చలిగాలిలో దోమల బాధలో ఆ కుటుంబాన్ని పెద్ద చెరువుగట్టు మీదుగా, అయ్యకోనేరు గట్టు మీదుగా కిక్కిరించన లేకుండా లాగి యజమాని యిచ్చే మూడణాల డబ్బులని కళ్ళకద్దుకు పోతున్న ఆ రిక్షావాడెవడో కాని సంజీవరావు గుండెని కదిలించేసేడు.

అనంతరావు చివరిమాట విని ఇప్పటికైనా సొంత గొడవ వదలి తన విషయం ఎత్తినందుకు సంతోషించేడు సంజీవరావు. 'రూపాయిన్నరకి ఇచ్చేద్దా మనుకుంటున్నానండి' అని చెప్పేడు అతను.

'రూపాయిన్నరే!?' ఆశ్చర్యపోతూ 'పాతవి గదండి' అన్నాడు అనంతరావు.

'అయ్యో కొత్తవేనండీ. రెండు నెలలే అయింది కొని.' నిజానికి నెల్లాళ్ళ కిందటే మూడు రూపాయలు పెట్టి కొన్నాడు.

అనంతరావు ఆలోచించి 'కొత్తవైతే మీరెందుకు అమ్మేస్తారు చెప్పండి' అన్నాడు ఏదో మూలనున్న లాపాయింటు లాగిన వకీలులాగ.

'అరె! నిజంగా ఇది కొత్తదే పంతులుగారూ. మా ఆవిడ పురిటికి నా నులకమంచం ఇచ్చేసేను. కింద పడుక్కో లేక అటకమీద వున్న మడతమంచం తీయించి దాని కీవూచలు వేయించేను. ఇప్పుడు మా కడసారి పిల్లవాడికి తల్లిదగ్గర పాలు లేక పాలడబ్బా కొనవలసొచ్చి యివి అమ్మేస్తున్నాను' అంటూ హరిదాసుల సంజీవరావు ఆ వూచల చరిత్ర చెప్పుకు వచ్చేడు.

'సరేలెండి. మా ఇంట్లో ఉన్న మంచా లనే ఆదరించేవాళ్ళు లేకపోయినా ఏదో మీ అవసరానికి ఆదుకున్నట్టుగా ఉంటుందని పుచ్చుకోడం గానీ—మీ రన్నదీ గాదు, నే నన్నదీ గాదు. రూపాయి తీసుకోండి' అంటూ చిల్లర తీసి నాలుగు పావలాలు లెక్కపెట్టి కొంచెం తటపటాయించి అతని కిచ్చేడు అనంతరావు.

సంజీవరావు చేతిలో పడిన దేదో చాలనుకునే రకం. కిక్కురుమనకుండా పుచ్చుకుని లెక్కయినా చూడకుండా జేబులో వేసుకుని లేచేడు 'మరి. వస్తానండీ' అంటూ.

'ఆఁ. కొంచెం ఆ మంచానికి గుడ్డ ఎక్కించండి' అని ఒక మూల వున్న మంచాన్నీ, కొత్తగుడ్డనీ చూపించేడు అనంతరావు పంతులు.

'అలాగే' అని నిముషం కిందటివరకూ తనవే అయిన వూచలతో ఆ పరాయి మంచానికి గుడ్డ ఎక్కించసాగేడు సంజీవరావు.

పగలల్లా ఆఫీసులో పనిచేసి అలసి హూనమైపోయిన ఒడలిని రెండు నెలలుగా ఏ మంచంమీద పడేసి స్వర్గసుఖంలాంటి నిద్ర ననుభవించేడో, ఆ మంచంలో ఒక భాగాన్ని యివేళ అమ్ముకుంటూంటే కాలు తెగ్గోట్టుకుంటున్నట్టుగా వుంది అతకి. ఎక్కేటప్పుడు వూచలుచేసే కిచుకిచు ధ్వని అతనికి 'సెలవోయి మా స్వామి సెలవోయి సెలవోయ్!' అనే వీడ్కోలు పాటలా వినిపించి బాధపడ్డాడు.

ఆ పని పూర్తయి ఇవతల బడేటప్పటికి దీపాలు పెట్టేరు. వల కోమటి కొట్టుకి వెళ్ళి 'గొల్లభామ మార్కు పాలడబ్బాలున్నాయోయి సెట్టీ?' అనడిగేడు.

"ఆ ఉన్నాయి రూపాయి పావలా—ఇంద కిర్సనాయిలు" అన్నాడు కోమటి ఇంకో బేరం చూస్తూ.

"డబ్బా చూపించవోయ్!"

"దమ్మిడీ తగ్గదు. ఒకే సీన్నీ గొల్లభామ పాలడబ్బా అందుకో — బేడా కానీ యియ్యి."

సంజీవరావు డబ్బా చూస్తూ బేరసారాల మీద అనంతరావు యిచ్చిన ఉపన్యాసాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు. ఆలోచించి ఆలోచించి "ద్వాపరయుగం వొస్తువుకి కలియుగం ధర చెపుతున్నావేమిటోయి శెట్టీ?" అన్నాడు తనేమో మహా తెలివిగా ప్రారంభించినట్టు మురిసిపోతూ.

"ఇప్పుడు బటాణీ లివ్వరు. ఇక్కడికొచ్చే గుంటలందరూ ఇది మరిగేరు—అలాటి తిరకాసేమీ ఉండదండీ. ఇప్పుడే పేకేజి పెట్టె విప్పి తీసినవి. ఇష్టమైతే పుచ్చుగోండి, లేకపోతే వొదిలీండి"

"అరి ముండకొడకా! వ్యాపారి శాస్త్రులో మర్యాదగా మాట్లాడ్డం కూడా వీడికి తెలీదు కాబోలు!" అనుకుంటూ ఇంకా మాట్లాడితే ఏమంటాడో అని భయంవేసి ఊచలమ్మిన డబ్బులూ, తన జేబులో అదివరకే ఉన్న ఒక పావలా కలిపి త్రాసులో వేసేడు.

కోమటి ఒక మాటు లెక్క మాత్రం

చూసుకుని గబుక్కున పడేసుకున్నాడు పెట్టెలో.

ఇంతలో పదిరూపాయల చిల్లర ఇమ్మంటూ పక్కనున్న కిల్లీ కొట్టువాడు వచ్చేడు. శెట్టి పెట్టె తెరచి లెక్క పెట్టి యిస్తూండగా సంజీవరావు ఇంటి మొగం పట్టేడు.

ఇంటికి వచ్చీరాగానే అతనిని భార్య అడిగిన ప్రశ్న "పాలడబ్బా తెచ్చేరా?" అని.

"లేకపోతే నువ్వు ఇంటి గడప తొక్కనిస్తావు?" అని విసుక్కున్నాడు సంజీవరావు.

ఉమాబాయి నవ్వింది. "మీ పుత్రరత్నం అచ్చం మీ పోలికే. పాల వేళ దాటిందని గుక్క విడవకుండు ఏడుస్తున్నాడు. అలాటి సుకుమారుడ్ని లేని కొంపలో పడడవెందుకో! అన్నది.

భర్త బయటినుంచి వస్తూనే ఇంటినిండా వ్యాపింపజేసే మబ్బులని తన మాటల గాలితో పారదోలి నవ్వు వెన్నెలని కాయించడం నేర్చిన కొద్దిమంది ఆడవాళ్లలో ఉమాబాయి తలమానికం లాటిది. ఇక ఈ వాతావరణంలో కరిగిపోని మొద్దు గుండెవాడికి శారద రాత్రిలో కూడా విశేషం కనిపించదు.

సంజీవరావు చటుక్కున ఆమె గడ్డాన్ని పుచ్చుకుని 'ఏం నీలాటి సుకుమారి ఏరి కోరి నా కొంపలో పడగా లేనిది వాడిక్కడ పుడితే తప్పా?' అనురాగం ఉట్టిపడేలాగ అడిగేడు.

'పోదురూ!' అని పాలడబ్బా తీసుకుని వంటింట్లోనికి వెళ్ళిపోయింది ఉమాబాయి — మగడికి కనబడకుండా ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

ఆరాత్రి సంజీవరావుకి ఎంతసేపటికి కునుకు పటలేదు.

ఉమాబాయి మంచినీళ్లకని లేచి 'ఏవండీ, అటూ ఇటూ దొర్లుతున్నారు? నిద్దరావడం లేదూ?' అనడిగింది.

'ఎలా వస్తుంది? పక్క ఒత్తి మంచంగుడ్డ. నేల హిమాలయవేగదా? కొంతసేపటికి ఏ తేలో వచ్చి పాములు లేని లోటుని తీరుస్తే ఎలాగా ఉమాపతినే కాబట్టి మదన దహనుడిని కూడా అవుతాను. మంచి సంయమనం అలవడుతుంది.

ఇలా కొన్నాళ్లు పడుకుంటే ముందు దేశానికీ మనకీకూడా ఉపకారం చేసిన వాడినవుతాను.' అన్నాడు సంజీవరావు.

'ఏవిటో మీ శ్రీమాటలా తెలా కొక్కటి అరవై ఏడవదు.' అంది ఉమాబాయి అమాయికంగా.

'ఎలా అర్థమవుతుందో? మీ ఆడవాళ్లకి ఓపలేని మనిషని చెప్పి కొన్నాళ్లూ, బాలెంతరాలని చెప్పి మరి కొన్నాళ్లూ ఎప్పుడూ ఏదో భోగం జరుగుతూనే వుంటుందిగదా!' అని నవ్వేడు సంజీవరావు.

'పోనీ ఆ ఓపలేనితనం; బాలెంతతనం మీరే తీసుకుని ఆ భోగాలేవో మీరే అనుభవించకూడదో?'

'చంపేసేవు! ముందా మంచినీళ్లందుకో;'

* * * *

మరునాటి పొద్దున్న మామూలుగా అనంతరావుగారి రెండో కొడుక్కి ప్రయివేటు చెప్పడానికి వెళ్లేడు సంజీవరావు.

ఇంట్లో ఏదో గోల జరుగుతూంది. పిల్లల కార్యక్రమం కాబోలు ననుకుని చాపమీద కూర్చున్నాడు. కాని మొదట ఆ గోల అడవి పక్షుల కలకలారావం లాగ ఉండి క్రమంగా బోరుగాలి రొదలాగనూ, సముద్రపు హోరులాగనూ, బ్రిడ్జిమీద మెయిలుబండి చప్పుడులాగనూ, జలపాతపు ధ్వనిలాగనూ, చివరికి రేకులషెడ్డుమీద వడగళ్ల వానలాగనూ వినిపించింది సంజీవరావుకి. వెంటనే తన భావుకత్వానికి ఒక్క క్షణం పాటు అబ్బురపడకుండా ఉండలేకపోయేడు. పలుకులవెలది అలక సేవిస్తున్నప్పుడు తనని బ్రహ్మ సృజించియుండబోలు. తనసుగుట ఆ చిరాకులో 'ఆంధ్రటాగూర'ని వ్రాయబోయి, 'ఆఫీసుగుమాస్తా' అని వ్రాసియుండబోలు... ఇలా దొర్లుతున్న అతని ఊహాచక్రం అనంతరావు అడుగుతగలడంతో

(57-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[24-9-58 మొదలు 30-9-58 వరకు]

| | | | |
|---|---|---|---|
| | శ | కు | |
| | తే 24 దీ కన్యలో రాహువు మీనములో కేతువు ప్రవేశింతురు. తే 25 దీ కన్యలో బుధుడు ప్రవేశించును. తే 28 దీని కన్యలో శుక్రుడు ప్రవేశించును మకర, కుంభ, మీన, మేషములలో చంద్రుడు | ʼ |
| | | | బు కు |
| | కే | గురా | ర |

*** అశ్విని [చూ, చే, చో, లా] ***

ఈ వారం ఆశించినదానికంటె ఆదాయం పెరుగుతుంది. యత్న కార్యములు ఫలిస్తాయి. దూరప్రయాణం చేయవలసివస్తుంది. శుభకార్యాలోచన చేస్తారు. సాంఘిక కార్యాలలో కీర్తి, బంధుమిత్రులతో విందు కలుగును. విద్యార్థులకు అనుకూలము. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభం. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలం. 27 న ప్రయాణము. 28, 29 ధనలాభం, కార్యసిద్ధి. 30 అధిక ఖర్చులు.

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఈ వారం కార్యభారం ఎక్కువ. ధనలాభం, ప్రయాణం వుంటాయి. అకాల భోజనంవల్ల వేడిచేసి అనారోగ్యసూచన కాగానే ఔషధసేవనం మంచిది. ఉద్యోగస్తులకు అధికారుల వత్తిడిగాని, బదిలీ అవుటగాని ఉండవచ్చును. విద్యార్థులకు బద్ధకము. 27 కార్యభారం, 28, 29 ధనలాభం. 30 రాజకీయంగా అలజడి.

*** కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] ***

ఈ వారం అనవసరంగా కార్యవిలంబనం అవుతుంది. ఏ పని చేసేందుకు మనస్సమాధానం కుదరదు. చికాకు, ఆశాభంగం కలుగుతవి. ఉద్యోగస్తులకు వనపర్వత ప్రాంతాలకు బదిలీ కావచ్చును. వర్తకులకు లాభం తక్కువ. 27 ఆటంకములు. త్రిప్పట, 28, 29 మనశ్చాంచల్యం 30 విదేశీయులతో పరిచయం, విచిత్రవస్తుసంపాదన, కార్యసిద్ధి.

*** రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

ఈ వారం ధనాభావం ఎక్కువ. ఎవరి సహాయంతో కార్యసాధనకు యత్నిస్తారో వారివలనే ఆటంకములు కలుగుతవి. అయినా ఆధ్యాత్మిక చింతనల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఇంట్లోవారి ఆరోగ్యము చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వ్యాపారస్తులకు మొదట్లో నిరాశ, వారాంతంలో లాభం. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. 27 వ్యర్థప్రయత్నం, త్రిప్పట. 28, 29 ఆటంకములు. 30 నష్టద్రవ్యలాభం.

*** మృగశిర [వే, వో, కా, కీ] ***

ఈ వారం కోర్టువ్యవహారాలు కొంత అనుకూలిస్తాయి ఆశించిన డబ్బు చేతికి అందక అశాంతి కలుగుతుంది. బంధువుల రాకమూలంగా ఖర్చులు కూడా అధికమౌతాయి. పరోపకారం చేయబోయి

బి. నరసింగరావు

నిందలపాలవుతారు. ఉద్యోగస్తులకు క్రొత్త సమస్యలతో కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారంపట పేచీలు. 27 కార్యభారం, త్రిప్పట, 30 స్వల్ప అనుకూలం.

*** ఆరుద్ర [కూ, ఘ, జ, ఛ] ***

ఈ వారం ఎన్ని ఆటంకాలు కలిగినా పట్టుదలతో ప్రయత్నించడంవల్ల కార్యసిద్ధి పొందుతారు. ఖర్చులకు అవసరపడిన సొమ్ము సమయానికి కాక వారాంతంలో అందుతుంది. దెబ్బలు తగిలే ప్రమాదం జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనికశాస్త్రజ్ఞులకు, రంగులు, లోహపుసామానుల వ్యాపారస్తులకు కమముతో కూడిన లాభం. యంత్రములు నడుపువారికి, ఇంజనీరింగుశాఖలో ఉద్యోగులకు మేలుకాలం. 27, ఆటంకములు, 28, 29, సోదరసహాయం, కార్యలాభం.

*** పునర్వసు [కే, కో, హా, హీ] ***

అధికారుల సహాయంచేతను, మీ యుక్తిచేతను గత రెండు వారములనుండి కలుగుతున్న ఇబ్బందులు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ధనాదాయం వృద్ధి అవుతుంది. ఈశాన్యదిక్కునుండి శుభవార్త వింటారు. కవులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలం. డాక్టర్లకు, గణితశాస్త్రజ్ఞులకు,విద్యార్థులకు మేలుగా వుంటుంది. కవులు నూతనరచన సాగిస్తారు. 27 త్రిప్పటు, ఆపైన బంధుదర్శనము, అధికారుల ఆదరణ, ధనలాభం.

*** పుష్యమి [హూ, హే, హో, డా] ***

ఈ వారం మీకు యోగదాయకంగా వుంటుంది. అనుకున్న సొమ్ము చేతికివచ్చి ఇబ్బందులు తీరుతవి. కోర్టువ్యవహారాలలో జయం కలుగుతుంది. నూతనకార్యారంభం చేస్తారు. పండితులతో గోష్ఠివల్ల నూతనాంశాలు తెల్సుకుంటారు. బిడ్డలసుఖసంతోషాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తవి. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయస్థాన వుద్యోగులకు వారమంతా మేలుకాలము.

*** ఆశ్రేష [డి, డూ, డే, డో] ***

ఈ వారం ధనయోగం కలుగుతుంది. అయినా కొంత మానసికాందోళన కూడా వుంటుంది. బంధుమిత్రులతో కలిసి వినోదాలలో పాల్గొంటారు. దూరస్థులైన ఆప్తుల క్షేమవార్త తెలుస్తుంది. జలప్రయాణం చేయవలసివస్తుంది. ప్రత్తి, దూది, నూలు, బటలు, బియ్యం వెండివగల వ్యాపారస్థులకు లాభయోగము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలం. 27 మానసికాందోళన, 28, 29 ధనలాభం, కార్యసిద్ధి 30 విందు వినోదములు.

*** మఖ [మా, మీ, మూ, మే] ***

ఈ వారం మీకు యోగప్రదంగా వుంటుంది. ఆదాయం అనుకున్నదానికంటె ఎక్కువవుతుంది. శుభకార్యాలోచన చేస్తారు. నూతన కార్యములు ప్రారంభిస్తారు. విద్యార్థులు ఉత్సాహంగా చదువుకుంటారు. ఉద్యోగస్తులకు గౌరవహోదాలు పెరుగుతవి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు అధికలాభం చేకూరుతుంది. 28, 29 ధనలాభం. కార్యసిద్ధి, 30 అధికఖర్చులు.

*** పూర్వఫల్గుణి (పుబ్బ) ***

**మో, టా, టీ, టూ**

ఈ వారం కార్యభారం ఎక్కువ. అందువల్ల తీరికవుండదు. యత్నకార్యములకు ఆటంకములు కలుగును. ఆర్థికస్థితి సరిగా వుండనందున గృహావసరములు తీరవు. వేళ తప్పిన నిద్రాహారాలవల్ల ఆరోగ్యం బాగుండకపోవచ్చును; జాగ్రత్తగా వుండడం మంచిది. వర్తకులకు ఎక్కువశ్రమ; ఉద్యోగస్తులకు వత్తిడివున్నా అధికారుల మన్ననపొందుతారు. రాజకీయవాదులకు మేలు. 27 కార్యభారం, 28, 29 ఇబ్బంది, 30 పితృవర్గసహాయం.

### ధరలు:

నూలు, వస్త్రములు: మందముగా వుండును.

బెల్లము, పంచదార, చింతపండు: చురుకగును.

ఆహారధాన్యములు: మందముగా వుండును.

నూనె దినుసులు: మార్పు లేదు.

పప్పు దినుసులు: సులభముగా వుండును.

వెండి. బంగారము: మందమగును.

దేశమంతటా సుభిక్షముగా వర్షించును.

* * *

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) * [టే, టో, పా, పీ]

ఈ వారం మీకు మిశ్రమయోగం. మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయంవల్ల క్రమంగా లాభంపొందుతారు. ఉద్యోగస్తులకు మంచిరోజులు కావు. వర్తకులకు మాంద్యం. విద్యార్థులకు అశ్రద్ధ హెచ్చు. వారంలో అవయోగములున్నా, మిత్రసహాయం, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయం, విచిత్ర వస్తుసంపాదనవంటి శుభయోగములు కూడా కలుగుతవి.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారం మీకు ఏమంతబాగుండదు. తలపెట్టినపనులకు ఆటంకములు కలుగుతవి. ధనాభావం, బంధువులరాక, అధిక ఖర్చులు మూలంగా మనోవ్యథ కలుగుతుంది. అయినా సాధుసాంగత్యం, ఆధ్యాత్మికచింత వల్ల కొంతవూరట కలుగుతుంది. ఉద్యోగస్తులు శ్రమపడినమీదట మేలుపొందుతారు. వర్తకులకు ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. 27అధిక ఖర్చులు, 28, 29, సాధుసాంగత్యం, ఆత్మవికాసం.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారం మీకు ఆర్థిక ఇబ్బంది ఎక్కువ. కార్యభారంకూడా వుంటుంది. పరోపకారమునకు పూనుకొని మాటపడవలసి వస్తుంది. భార్యఆరోగ్యము సరిగావుండదు. కోర్టు వ్యవహారాలు అనుకూలమవుతవి. ఉప్పు, మినుములు, నువ్వులు, నూనె, అపరదినుసులు వ్యాపారస్థులకు మేలుగా వుంటుంది. విద్యార్థులకు చదువుసాగదు. వారంలో అవయోగములున్నా ధనలాభము, కార్యానుకూలతవంటి శుభయోగములు కూడా కలుగుతవి.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈవారం యత్నకార్యములకు ఆటంకములు కలిగినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. రాబడికి మించిన ఖర్చులు పెరుగుతవి. ప్రమాదములు జరిగే సూచనవుంది కాబట్టి జాగ్రత్తపడడం మంచిది. సోదరసహాయం కలుగుతుంది. వుద్యోగస్తులకు అధికారులవల్ల మనోవ్యథ. భూస్వాములకు, గనుల యజమానులకు శ్రమతో కూడిన లాభము. పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 27ధనలోపము. 28,29 ఆటంకములు, మనోవ్యథ. 30 సోదర సహాయం, కార్యానుకూలత.

### * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారం మీ ఆర్థికస్థితి బాగుంటుంది. పలుకుబడివల్ల కార్యసిద్ధి పొందుతారు. నూతన మిత్రలాభం వుంటుంది. ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణ వుంటుంది. గణితశాస్త్రజ్ఞులకు, డాక్టర్లకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలం. వస్త్రములు, ఇత్తడి, కంచువర్తకులకు లాభిస్తుంది. 27 28, 29 ధనయోగం. కార్యానుకూలత 30 అమిత ఖర్చులు.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారం యోగదాయకమైంది. పుణ్యక్షేత్ర సంచారం, పుణ్యకార్యాచరణ, ధనలాభం పుత్రప్రాప్తివంటి శుభయోగములు కలుగును. వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగములు జరుపుతారు. శుభకార్యాలోచనలు చేస్తారు. విద్యార్థులు ఉత్సాహంగావుండి కొత్తసంగతులు తెలుసుకుంటారు. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థానములో వుద్యోగులకూ యోగకాలం.

### జ్యేష్ఠ [నో, యా, యీ, యూ] *

ఈ వారం మీరు తలపెట్టిన కార్యములలో జయం కలుగుతుంది. వినోదములలో పాల్గొంటారు. దధి, క్షీర, మధురపదార్థయుక్తభోజనం వెండిపాత్రలలో చేయుట, జలప్రయాణము, తెల్లనివస్తువులు కొనుటవంటి శుభయోగములు కలుగును. విద్యార్థులకు మేలుగా వుంటుంది. ప్రత్తి, దూది, నూలు, తెల్లనివస్త్రములు, వెండి, బియ్యం, ద్రవపదార్థంవంటి క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. వారమంతా శుభయోగములున్నా 27, 30 తేదీలలో ఆందోళన వుంటుంది.

### * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారంను ఇష్టవస్తులాభం, కృషీవలుల కాలంగా లాభం కలుగును. వివాహాది శుభకార్యాలోచన చేస్తారు. పశుసంపద, ధనధాన్యవృద్ధి, పరోపకారకీర్తివంటి యోగములు కలుగుతవి. విలువైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభయోగము. విద్యార్థులకు మేలుగావుంటుంది. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలం. వారమంతా యోగదాయకమైనా వారాంతంలో కొంచెం చికాకు కలుగుతుంది.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]*

ఈ వారం రాబడి తక్కువ, కార్యభారంతోబాటు ఖర్చులు ఎక్కువ, గృహావసరములు తీరక కలతలు వస్తాయి. అనారోగ్య సూచనలు కనబడగానే రవికి శాంతి చేయించుట, ఔషధ చికిత్స పొందుట మేలు. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు వస్తాయి. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు మంచికాలంకాదు. 27 ఆటంకములు, కార్యభారం 28, 29 పితృవర్గంనుండి సహాయం. 30 కార్యలాభం.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారం నిలకడలేని ఆలోచనలతో ఏపనీ చేయలేకపోతారు. ఆర్థికంగా ఇబ్బంది ఎక్కువ. శ్రమపడినప్పటికీ మాట దక్కదు. ఆకస్మికంగా కలిసిన మిత్రుని సహాయంవల్ల చిక్కులు తొలగుతవి. వర్తకులకు ప్రయాణంవల లాభం. ఉద్యోగసులకు బదిలీఅయ్యే సూచనలున్నవి. 27 అనిశ్చితస్థితి. 28 29, 30 మిత్రసహాయం, కార్యలాభం,

### *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారం మీకు మిశ్రమయోగం. ఆశించిన సహాయం లభించదు. అనుకున్నట్టుగా పనులు జరగవు. ఆర్థిక ఇబ్బంది మూలంగా అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవచింతతో ప్రయత్నించి కార్యసిద్ధి పొందుతారు. వర్తకులకు నిలచిపోయిన బాకీలు వసూలవుతవి. ఉద్యోగస్థులకు బదిలీసూచన లున్నవి. 27 ధనలోపము, ఆటంకములు. 28, 29 పుణ్యపురుష సాంగత్యం 30 కార్యసిద్ధి.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారం కొత్తచిక్కులు తలెత్తుతాయి. కార్యభారమువల్ల శ్రమ ఎక్కువ. పరోపకారప్రయత్నంలో ఫలించక మాటపడవలసి వస్తుంది. కోర్టు వ్యవహారాలు మీ పరంగా తీర్పు అవుతాయి. భార్య ఆరోగ్యం ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోగులకు బదిలీ సూచనలున్నవి. దెబ్బలు తగిలే ప్రమాదం జాగ్రత్తవల్ల తప్పవచ్చును. 27 కార్యభంగం. 29, 30 సోదర సహాయం, కార్యానుకూలత. అపర దినుసులు, నువ్వులు, నూనె, మినుములు వ్యాపారస్థులకు లాభ

# నక్షత్ర ఫలితాలు

యోగం.

### * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారం ఎంత ప్రయత్నించినా కార్య సాధనలో ఆటంకాలు కలుగుతవి. అయినా నిరాశ చెందకుండా పట్టుదలతో ప్రయత్నించడంవల్ల చిక్కులు విప్పుకుని మేలు పొందుతారు. సోదర సహాయంవల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదం ఉంది. జాగ్రత్తగా వుండడం మంచిది. 27 కార్యభంగం 28, 29, 30 సోదర సహాయం, కార్యసాధన.

### *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారం మీకు యోగప్రదంగా వుంటుంది. యత్న కార్యములు యుక్తిగా సాగిస్తారు. జ్ఞాతులవల్ల ధనసహాయం పొందుతారు. అధికారులవల్ల కార్యసహాయం అవుతుంది. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. ఈశాన్యదిక్కునుంచి క్షేమవార్త తెలుస్తుంది. విద్యార్థులకు అనుకూలంగా వుంటుంది. గణిత, జ్యోతిష శాస్త్రజ్ఞులకు డాక్టర్లకు, కవులకు శిల్పులకు, నటీనటులకు యోగకాలం. 27 తొట్రుపాటు. 28,29,30 అధికారుల సహాయం, ధనలాభం.

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

గతవారం అసంపూర్తిగా నిలిచిపోయిన కార్యములు ఈ వారం జయప్రదంగా ముగుస్తవి. హోదాతోపాటు ధనాదాయం కూడా పెరుగుతుంది. బిరుదులుపొందుట, సన్మానము కలుగుట, పండితగోష్ఠి, గ్రంథ పఠనంవంటి రాజయోగములు కలుగుతవి. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు వారమంతా యోగకాలము. 28, 29 ధనలాభం, కార్యానుకూలత. 30 నిలకడలేనిస్థితి.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారం అన్ని రంగములలో మీరు చేసే ప్రయత్నములు అనుకూలంగా కొనసాగుతవి. ఆదాయాభివృద్ధి అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యం బాగుంటుంది దక్షిణ దిక్కునుంచి క్షేమవార్త తెలుస్తుంది. కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదములలో పాల్గొంటారు. జలప్రయాణం చేయాల్సి వుంటుంది. విద్యార్థులకు మేలుగావుంటుంది. దధిక్షీరమధురపదార్థయుక్త భోజనం చేస్తారు. బియ్యం, వెండి, నూలువర్తకులకు లాభము. 28, 29 ధనలాభం, కార్యసిద్ధి. 30 విందు వినోదములు. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము.



# బాలసాహితి

## పరధనాని మర్మం

క్రోనేటి పురములో
కామయ్య అనియొడి
కర్షకుం డొకడుండె
కడు బీదవాడు.

కష్టించి పనిచేసి
కాలంబు గడుపుచూ
నిష్ఠతో దేవుని
నిత్యంబు పూజించు.

వాని భక్తికి మెచ్చి
వాసుదేవుం డంత
"మెచ్చితిని ఒకవరము
ఇచ్చితిని కొ"మ్మనెను.

"ఏది కోరిన గాని
కాదనక నే నిత్తు
వరలోక్క టున్నాది
చక్కగా విను మనెను:

"నీవుకోరిన వరము
నీకె గాకుండ
సకలజనులకు కూడ
సమముగా వర్తించు".

భార్యతో యోజించె
బాగుగా కామయ్య.
అక్షయంబగు ధనము
అమరునట్లుగ కోరె.

కామయ్య కోర్కను
కరుణతో మన్నించి
అంతర్ధానం బయ్యె
ఆదిదేవుండు.

ఇంటినిండా ధనము,
ఒంటినిండా నగలు;
కామయ్య భార్యతో
కలసి సంతోషించె.

మరునాడు కామయ్య
ముందుగా మేల్కాంచి
పుట్టముల్ కొనగోరి
పట్టణంబుకు పోయె.

ఎచ్చోటి కేగినా
ఎవ్వరిని అడిగినా
ద్రవ్యంబులకు నేమి
లభ్యంబు కావయ్యె.

"ధన మెవ్వరికి వలయు
దండిగా నున్నాది.
పరివిత్తులను తెచ్చి
వలయునని కొ"మ్మనిరి.

కారణం బేమని
కామయ్య యోచించె.
ఎట్టి కేలకు తెలిసె
ఇట్టి కారణము:

ధనమెంతో మెండాయె,
ధాన్యంబు కరవాయె,
తాను పొందిన వరమె
తనకు పామైగరచె.

అని యిట్లు చింతించి
అత్మలో కామయ్య
దేవదేవుని గూర్చి
ధ్యానంబు సలిపె.

"నీవరము నాకొద్దు
ఈ ధనము నాకొద్దు
నీవు ఇచ్చినదెల్ల
నీవె గైకొనుము".

అని మదిలో ప్రార్థించి
ఆనాటినుండియు
కష్టించి కామయ్య
కాలంబు గడిపె.

(రాజాజీ నీతికథకు అనుసరణ)



ద్వివేదుల విశాలాక్షి





# అమరయ్యతాత

"కోప మన్నమాటలేదు తాతా నీ దగ్గర" అన్నాడు ఒకతను ఏదో మాటల సందర్భంలో అమరయ్య తాతతో.

"ఔన్రా అబ్బాయి - చాలా రోజులయ్యింది ఐపోయి; తెప్పించుకొందామంటే కుదరడం లేదు; బాబ్బాబు! ఈతడవ నువ్వు బస్తీ కెళ్లేటప్పుడు, కొంచెం చెప్పేళ్ళరా ఇచ్చేస్తాను ఒక పావలాడి తెద్దువు గాని" అన్నాడు తాత తన సహజ హాస్యధోరణితో. అక్కడున్న వాళ్లంతా తాత మాటలకి నవ్వలేక నోళ్ళల్లో గుడ్డ పెట్టుకొన్నారంటే ఆశ్చర్యం ఏముంది?

ఎంతటి విచారంలో మునిగి వున్నా సరే తాత సమీపాన వున్న వాడి మొహం మీద హాసరేఖ పొడచూపకుండా వుండదు. హాస్యభావన లేకాక, తాత కింకో చెప్పుకో దగిన శక్తికూడా వుంది: అవసరమైనప్పుడు తాత కుంటిగా, గుడ్డిగా, చెవిటిగాకూడ ఎంతో సహజంగా నటించి తన పనుల్ని నెరవేర్చుకొంటూ వుంటాడు.

ఒకసారి అమరయ్య తాత అర్జంటుగా పూరికి వెళ్లాలిసొచ్చింది. బస్సులు నడిచేరోడ్డు మా వూరికి సమీపంలోవున్న కైకలూరుగుండా పోతుంది. ఆ రోజున ఎందుచేతనో

**రాచాబత్తుల వీరరాఘవయ్య**

గాని బస్సుల్లో నియమిత ప్రయాణీకులకంటె ఎక్కువ ఎక్కించుకోవడంలేదు. తాత బస్ స్టాండ్ దగ్గరకు చేరేటప్పటికి, బస్సొకటి బయలుదేరడానికి సిద్ధంగా వుంది.

బయటవున్న వాళ్లందరూ బస్సెక్కుతున్నారు. అమరయ్య తాతకూడా ఎక్కాడు గబగబా. అందరూ ఎక్కిన మీదట కండక్టరు వచ్చాడు ఎక్కడినుంచో బస్సు దగ్గరకు 'చాలామంది ఎక్కినట్టున్నారే' అనుకొంటూ.

"టిక్కెట్టులేనివాళ్లందరూ దిగండి" అని ఒక కేకపెట్టాడు కండక్టరు.

"ఒక్కక్షణమండి - గుడివాడవరకు" అన్నాడు టిక్కెట్టు లేకుండా బస్సెక్కిన ఒక ప్రయాణీకుడు.

"ఖాళీలేదు - ముందు దిగండి" అన్నాడు కండక్టరు టిక్కెట్లు లేనివాళ్లందరూ దిగారు. కాని అమరయ్య తాతమాత్రం టిక్కెట్టు లేకపోయినా దిగకుండా ఒక సీట్లో ఒదిగికూచున్నాడు.

కండక్టరు 'రైట్' చెప్పడంతో బస్సు బయలుదేరింది. బస్సుబయలుదేరిన కొంతసేపటికి కండక్టరు టిక్కెట్ల పుస్తకంలోని టిక్కెట్లను లెక్కచూసుకొని ప్రయాణీకుల్ని లెక్కపెట్టాడు. పుస్తకం మళ్ళీ ఒకసారి చూశాడు.

ఎన్ని పర్యాయాలు లెక్కపెట్టినా బస్సులోని ప్రయాణీకులకు, పుస్తకంలో రాసిన లెక్కకు ఒకటి తేడా వస్తోంది.

"టిక్కెట్టు రాయించనివాళ్లెవరన్నా ఉన్నారా బస్సులో?" ప్రయాణీకులనుద్దేశించి అడిగాడు కండక్టరు. ఎవరూ ప్రత్యుత్తరమీయలేదు. మొహాలవంక చూస్తూ 'మీ రెక్కడకు?' 'మీరెక్కడెక్కారు?' అని అడగడం సాగించాడు కండక్టరు. తగు సమాధానం చెబుతున్నారు ప్రయాణీకులు.

"మీరు టిక్కెట్టు తీసికొన్నారా?" అమరయ్య తాతవంక అనుమానంగా చూస్తూ అడిగాడు కండక్టరు.

"కైకలూరులో ఎక్కాను" చెవుడు నటిస్తూ అమరయ్య తాత అన్నాడు.

"కైకలూరులో ఎక్కారు సరే - టిక్కెట్టు తీసికొన్నారా అని అడుగుతున్నాను." అన్నాడు కండక్టరు తిరిగి.

(47వ పేజీ చూడండి)



"ఫరేవాదివి భాయీ! పోయిన లైట్లు తెప్పించావ్!"

# న్యాయ నిర్ణయం

సి. డి. యస్. రామయ్య

బ్రునవన్నపాలెం అనే గ్రామంలో రామశర్మగారు అనే పేరుగల పండితుడుండేవాడు. ఆయనకు అన్ని భాషల్లోనూ పాండిత్యం వున్నా, తను గొప్ప పండితుడనే గర్వం మాత్రం వుండేదిగాదు. పెద్దలుంచి పోయిన నాలుగెకరాల భూమివల్లా వచ్చే ధాన్యపు గింజల్ని తింటూ ఓ పదిమంది విద్యార్థులకు విద్య చెప్పుకుంటూ - ఆలుబిడ్డలతో సుఖంగా సంసారం సాగిస్తూ వచ్చాడు.

రామశర్మగారు- అతీతమైన తెలివితేటలు గలవాడనీ, సూక్ష్మబుద్ధిగలవాడనీ ప్రతీతి. అంతేగాకుండా - న్యాయ నిర్ణయంలో గూడా మంచి నేర్పరి అని ఆ వూరు వారందరికీ తెలుసు. ఆ గ్రామంలో పంచాయతీ వున్నా, న్యాయ నిర్ణయ స్థానమున్నా, వ్యవహార పరిష్కారం కోసం అందరూ రామశర్మగారి దగ్గరకు వచ్చేవారు. అందుకు ముఖ్యమైన కారణం : వ్యవహారం చిన్నదైనా, పెద్దదైనా - ఆయన పరిష్కరించే తీర్పులో న్యాయం ఏ విధంగానూ కుంటుపడకుండా వుంటుంది. ఆ విషయం ఆ గ్రామంలోనే కాకుండా ఆ చుట్టు ప్రక్కల వున్న కొందరు పెద్ద మనుషులకి కూడా తెలుసు. కాబట్టే, వాళ్లు తమ దగ్గరికొచ్చిన వ్యవహారాలను కూడా రామశర్మగారి వద్దకే న్యాయపరిష్కారం కోసం పంపించడం రివాజు.

ఒక రోజు సాయంకాలం మునసబుగారు పిలుస్తున్నట్టు కబురువస్తే రామశర్మగారు పంచాయతీకి వెళ్ళాడు. అక్కడ మునసబుగారు, కరణంగారు, ఇంకా కొంతమంది గ్రామపెద్దలు వున్నారు. వారితో బాటు రంగయ్య, సోమయ్య అనే మరో ఇద్దరు వ్యక్తులు కూడా వున్నారు.

గ్రామ పెద్ద లందరికీ నమస్కరించి ఒక చోట కూర్చున్నాడు రామశర్మగారు.

గ్రామ మునసబు అన్నాడు : "రామశర్మగారూ! ఈ రోజు మా వద్దకు చిక్కు వ్యవహారం ఒకటి న్యాయ నిర్ణయం కోసం వచ్చింది. ఆ వ్యవహారపు వాదిప్రతివాదులు అదిగో ఆ నిల్చున్న రంగయ్య, సోమయ్యలు ... ఆ వ్యవహారాన్ని తగువిధంగా విచారించి తీర్పు చేయడానికి మాకు సాధ్యం కాకుండా వుంది. మీరే వ్యవహారాన్ని పరిష్కరించి, న్యాయ నిర్ణయం చేయాలని కోరుతున్నాం..."

తనవల్ల సాధ్యమైనంత మట్టుకు విచారిస్తానని చెప్పి రామశర్మ విచారణ ప్రారంభించాడు !

మొదట రంగయ్యను విచారించాడు.

రంగయ్య ఇలా చెప్పాడు: "నేనూ సోమయ్యా చిన్ననాటి స్నేహితులం. అన్ని వ్యవహారాలలోనూ కొంతకాలం పాటు ఒకరి నొకరం అనుసరించే తిరిగాము. నాలుగు సంవత్సరాలకు పూర్వం నాకు వివాహమయింది. అత్తగారిచ్చిన రెండెకరాల భూమిని సాగుచేసుకొని నేను జీవిస్తున్నాను. కాని, నేను చీకూ చింతా లేకుండా జీవించడం సోమయ్యకు గిట్టలేదు. అదీకాకుండా, మునుపటిలాగా అతనితో నేను కలిసిమెలసి వుండలేక పోతున్నానని అతని బాధ. అందుకు కారణం నేను గృహస్థునయ్యానని అతడు తెలుసుకోలేకపోయాడు. ఇలా వుండగా, ఆర్నెల్ల క్రితం ఒకరోజు సోమయ్య మా ఇంటికి వచ్చి, తనేదో వ్యాపారం చేయదలచాననీ, దాని పెట్టుబడికి నూరు రూపాయలు అప్పుగా ఇవ్వవలసిందనీ, ఆ అప్పును త్వరలోనే తీర్చివేస్తాననీ చెప్పాడు. స్నేహితుడన్న అభిమానం కొద్దీ, మా ఇంట్లో వున్న నగలూ, అవీ అమ్మి అతడికి వంద రూపాయలూ ఇచ్చాను. దేనికైనా మంచిదని అతడు నా దగ్గర వందరూపాయలు అప్పుతీసుకున్నట్లు ఓ పత్రం వ్రాయించి తీసుకున్నాను కూడా.

# ★ న్యాయ నిర్ణయం ★

కాని కొన్నాళ్ళ తర్వాత సోమయ్య వ్యాపారంలో నష్టపోయి, డబ్బు పోగొట్టుకున్నాడని విన్నాను. కాని నా డబ్బును (అప్పుగా ఇచ్చిన ఆ వందరూపాయలను) నేనెలా రాబట్టుకో గలను? అందుకని అప్పు డప్పుడూ అతడిని నా కివ్వవలసిన డబ్బు కోసం హెచ్చరిస్తూండేవాడిని. అతడూ త్వరలో ఇచ్చేస్తానని చెప్తూ వచ్చాడు......ఓ వారం రోజుల క్రితం సోమయ్య మా ఇంటికి వచ్చాడు. అతడిని కూర్చో పెట్టి కబుర్లు చెప్పుతుంటుండగా, దాహమై మంచి నీళ్లు అడిగాడు. నేను లోపలికి వెళ్లి నీళ్లు తీసుకొచ్చే లోపల, అతను మా ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. అతనలా నాతో చెప్పకుండా వెళ్ళిపోవడానికి కారణ మేమై వుంటుందా అని ఆలోచించాను. నాకు సందేహం కలిగింది. వాకిట్లోని పెట్టె తెరిచి చూశాను. అందులో నేను దాచి వుంచిన— అతను అప్పు తీసుకొని వ్రాసి ఇచ్చిన-పత్రం కనిపించలేదు. దాన్ని అతనే తీసుకువెళ్ళాడని నిశ్చయించుకున్నాను. అప్పుడే అతని దగ్గరికి వెళ్ళి అడిగి చూశాను......

"ఎవరు నువ్వు? నీ దగ్గర ఎప్పుడు డబ్బు అప్పు తీసుకున్నాను?-అసలు నిన్ను ఇంతకు ముందు ఎప్పుడూ చూడనేలేదు ... అలాంటప్పుడు నీ దగ్గర అప్పు ఎలా తీసుకుంటాను?..పో, బయటికి! వీలయితే ఎక్కడికయినా వెళ్ళి — ఫిర్యాదు చేసుకో" అని నన్నింతకు ముందు ఎరగనివాడిలా ఆవేశపడ్డాడు. నా ఇంటినుంచి పత్రం దొంగిలించిన తర్వాతే—సోమయ్య అలా నాకు ఎదురు తిరిగాడని అనుకుని— న్యాయ నిర్ణయం కోసం-గ్రామపెద్దలకు విన్నవించుకున్నాను..." అని ముగించాడు రంగయ్య.

రామశర్మ సోమయ్యను కూడా విచారించాడు. రంగయ్య ఎవరో తనేమీ ఎరగననీ, అతను చెప్పే దున్నదల్లా పచ్చి బూటకమనీ, అతడు తన్ను కన్నుగప్పి డబ్బు కాజేయాలని చూస్తున్నాడనీ సోమయ్య చెప్పాడు.

రామశర్మకు సోమయ్య మాటల్లో అపనమ్మక మేర్పడింది. అతడే అపరాధి అని ఊహించాడు. కాని అతనే అపరాధి అని అతని చేత ఒప్పించాలి కదా! అందుకు ఓ వుపాయం ఆలోచించాడు.

ఆఖరికి రంగయ్యను పిలిచి "నువ్వు సోమయ్యకు డబ్బు ఇస్తుండగా ఎవరైనా చూశారా?" అని అడిగాడు.

"ఎవరూ చూడలేదు" అన్నాడు రంగయ్య.

"నువ్వు పత్రం రాసి తీసుకుంటున్నప్పుడైనా ఎవరైనా చూశారా?"

"లేదు; ఆ విషయం-నాకూ, అతనికీ తప్ప మరెవరికీ తెలియదు."

"నువ్వు డబ్బు ఇస్తున్నప్పుడు గానీ, పత్రం తీసుకుంటున్నప్పుడు గానీ మీ దృష్టిలో, అంటే—మీ ఇంట్లో ఏఏ వస్తువులు దగ్గర వున్నాయి?"

రంగయ్య ఆలోచించి చెప్పాడు: "ఆ వాకిట్లో ఒక పెట్టె, సేద్యపుపని ముట్లూ, ఒక బెంచీ, కలం వగైరాలున్నాయి."

"అయితే, నువ్వు మీ ఇంటికి వెళ్లి, నే చెప్పినట్లు—ఒక పని చెయ్యి!" అని, రంగయ్యను తన దగ్గరికి పిలిచి అతని చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు రామశర్మ. "సరే"నని తలవూపి రంగయ్య వెళ్లిపోయాడు.

పది హేను నిముషాలు గడిచింది...



"పడుకో, పడుకో! ఏం భయంలేదు-ఆ అరిచేది పెద్ద పులికే!"

ఇంటికి వెళ్ళిన రంగయ్య తిరిగి రాలేదు. పంచాయతీ పెద్దలూ, రామశర్మా, మిగతావారూ అతని రాకకోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు. అర్థగంట గడిచింది..

మునసబుగారికి విసుగెత్తి— "అబ్బ! ఈ రంగయ్యగాడు ఇంకా తిరిగి రాలేదేమిటి?" అని రామశర్మని ప్రశ్నించాడు.

రామశర్మ పెదవి విరిచి-"అబ్బే! నాకేం తెలుసు?! — ఒకవేళ-అతని ఇల్లు చాలా దూరం కాబోలు; తిరిగి రావడానికి ఆలస్యం కాదూ మరి!" అన్నాడు—విచిత్రంగా సోమయ్య కేసి చూస్తూ.

సోమయ్య చురచూరలాడుతూ-"అయినా, ఇదిగో ఉన్న రెండో వీధికి వెళ్ళిరావడానికి ఇంతసేపు ఎందు కవుతుందండీ?-నే చెప్పలా! రంగయ్య వచ్చి మోసగాడు! ఎవరైన్నా నానరే, మోసం చెయ్యాలని చూస్తాడు..." అన్నాడు.

రామశర్మ చిరునవ్వు నవ్వుతూ "నువ్వు చెప్పటం గూడా వాస్తవంగానే కనిపిస్తోంది సోమయ్యా! దేనికీ కొంతసేపు వేచిచూద్దాం!" అన్నాడు.

సోమయ్య ముఖంలో ఆనంద రేఖలు అల్లుకోసాగాయి...తనకు అనుకూలంగానే వ్యవహార పరిష్కారం కాబోతున్నదని అతడి ఉత్సాహం!

ఓ అయిదు నిమిషాలు గడిచే సరికి ఒక రైతు అక్కడికి వచ్చాడు: "రంగయ్య నన్ను పంపించాడండీ!" అన్నాడు.

"ఏం? రంగయ్య రాలేదేం?" అని ప్రశ్నించాడు రామశర్మ.

"అతని ఒక్కగానొక్క కొడుకు ఇప్పుడే చచ్చిపోయాడండీ!- ఆ విషయం తమతో చెప్పి రావడానికే నన్ను పంపించాడండీ!" అన్నాడా రైతు.

సోమయ్య కూర్చున్న చోటు నుంచి చుర్రుమని లేచాడు..."రామశర్మగారూ! — రంగయ్యకొడుకు చచ్చిపోయాడన్నది వచ్చి అబద్ధపు కూత! అతనికి కొడుకు అంటూ ఎవరూ లేరు! పెండ్లయి నాలుగు సంవత్సరాలైనా, అతని కింకా బిడ్డంటూ పుట్టనేలేదు! - రంగయ్య మాటల్ని నమ్మబోకండి!" అని అరిచాడు.

రామశర్మ మందహాసం చేశాడు: "సోమయ్యా! నీ మాటల్లో దాపరికం లేదని నా కిప్పటికి నమ్మకం కుదిరింది...ఈ వ్యవహారంలో నువ్వు ఇంతగా నిజం పలికినందుకు చాలా సంతోషిస్తున్నాను." అన్నాడు.

సోమయ్య ముఖం సంతోషంతో విప్పారింది.

రామశర్మ అన్నాడు : "కాబట్టి-సోమయ్యా! ఈ వ్యవహార పరిష్కారంలోని నిజాన్ని నువ్వే ఒప్పుకున్నావు! అందువల్ల-నువ్వే అపరాధివి. కాబట్టి, అప్పుగా తీసుకున్న పైకాన్ని మళ్ళీ రంగయ్యకు ఇచ్చివేయాలి. ఇదే నా తీర్పు!"

సోమయ్యముఖం ఆ క్షణంలోనే వెలవెలపోయి, వెంటనే ఆవేశంకమ్మివేసింది: "ఏమిటీ! నేను నిజాన్ని ఒప్పుకున్నానా? ఎప్పుడు ఒప్పుకున్నాను? - వీల్లేదు - మీ తీర్పును నేను అంగీకరించను. రంగయ్యకు డబ్బు ఇవ్వలేను - ఇవ్వను కూడా!" అన్నాడు.

రామశర్మ శాంతంగా - వివరంగా చెప్పాడు : "సోమయ్యా! ఆవేశపడకు! నీ తప్పును నువ్వెలా ఒప్పుకున్నావో చెపుతున్నా - విను! మొదట నువ్వు అసలు రంగయ్యనే ఎరగననీ, అతని ఇల్లెక్కడో తెలియదనీ చెప్పావు. కాని ఉపాయంతో రంగయ్యచేత నే నాడించిన నాటకంలో రంగయ్య ఇల్లు రెండో వీధిలో వున్నట్లు నువ్వే - నీ నోటితోనే చెప్పావు. ఆ తర్వాత బిడ్డ చనిపోయాడని వార్త తెచ్చినప్పుడు, రంగయ్యకు పెళ్ళయి నాలుగు సంవ

(47 వ పేజీ చూడండి)

# ★ కొందరు సభ్యుల పేర్లు ★

[ఆంధ్ర పవిత్రవారపత్రికపాఠకసంఘంలో సభ్యులుగా చేరినవారిలో మరికొందరి పేర్లను ఇక్కడ ప్రచురిస్తున్నాము.]

1. ముటుకూరు భువనేశ్వరీదేవి (వలపర్ల గుంటూరు జిల్లా) 2. శ్రీ వత్సవాయ వెంకట సీతారామ చంద్రవర్మ (పెద్దాపురం, తూ. గో. జిల్లా) 3. బి. రాధాకిషన్ రావు (కరీం నగర్) 4. శ్రీ గిరి రాజు నగరాజ లక్ష్మీ కుమారి (నర్సారావుపేట, గుంటూరు జిల్లా) 5. బెజవాడ నిర్మల (కావలి నెల్లూరు జిల్లా) 6. రేడా వెంకట నాగర ఆంజనేయ వరప్రసాదరావు (విజయవాడ) 7. చంద్ర గురునాథ ప్రసాద్ (రామానగరం కృష్ణా జిల్లా) 8. కలవ చర్ల రఘురాం (చింతలపాడు కృష్ణాజిల్లా) 9. మాగంటి శ్రీహరి (కవకుంట ప. గో. జిల్లా) 10. ప్రభల అనూరాధ (న్యూఢిల్లీ) 11. సూర్యదేవర కృష్ణ ప్రసాద్ (పెనుగంచి ప్రోలు కృష్ణాజిలా) 12. దేవర కొండ చంద్రశేఖాదేవి (తణుకు ప. గో. జిల్లా) 13. దేవరకొండ సుబ్రహ్మణ్యం (తణుకు ప. గో. జిల్లా) 14. గుంటూరు శేషారావు (విశాఖపట్నం) 15. పాటిబండ్ల జనార్ధనరావు (బండారుపల్లి వారి పాలెం (గుంటూరు జిల్లా) 16. మట్టపల్లి పురుషోత్తం (పాలకొల్లు ప. గో. జిల్లా) 17. దావులూరు విష్ణు వర్ధనరావు (దావులూరు కృష్ణాజిల్లా) 18. జానకి గణపతి రావు (కొవ్వూరు ప. గో. జిల్లా) 19. కుప్పిలి గణపతిరావు పట్నాయక్ (యానాం పేట శ్రీకాకుళంజిల్లా) 20. పోలూరి హర హనుమంతరావు (గుంటూరు).

21. తలశిల లక్ష్మీరాజ్యం (నాగాయలంక, కృష్ణాజిల్లా) 22. ఏడునూతల బాబు నరసింహప్రసాద్ (మధిర, ఖమ్మం జిల్లా) 23. చినపాటి నాగరాజ్యలక్ష్మి (టంగుటూరు, గుంటూరుజిల్లా) 24. గూడవల్లి అజిత్ రాయ్ (గుంటూరు) 25. పర్వతం అప్పారావు (కోనాల, ప. గో. జిల్లా) 26. ఎస్. వేణుగోపాలాచార్యులు (పెంగరగుంట, చిత్తూరుజిల్లా) 27. జి. వెంకయ్య (నల్లగొండ) 28. గాదిరాజు వెంకటవిశ్వనాథ శర్మ (నిడుబ్రోలు, గుంటూరుజిల్లా) 29. ఎ. కోటీశ్వరరావు (పార్వతీపురం, శ్రీకాకుళం జిల్లా) 30. పాలేటి జయలక్ష్మి (శక్కర్ నగర్, నిజామాబాద్ జిల్లా) 31. గండికోట కామేశ్వరరావు (రామచంద్రపురం, తూ. గో. జిల్లా) 32. ముళ్ళపూడి సాయి సుదర్శనరావు (కొమరోలు, కర్నూలుజిల్లా) 33. శ్రీరామగిరి విద్యాసాగర్ (వరంగలు) 34. దుద్దుకూరి జ్యోతి స్వరూపిణి (న్యూఢిల్లీ) 35. రాజావాసిరెడ్డి ప్రభావతి (గుంటూరు) 36. జోస్యుల గోపాలకృష్ణ (ఖర్గపూర్) 37. మేలనాత్తూరు వెంకట సుబ్రహ్మణ్యం (మద్రాసు) 38. వల్లభజోస్యుల దుర్గ (విజయవాడ) 39. వల్లభజోస్యుల లీలాదేవి (విజయవాడ) 40. కె. విజయకుమారి (హైద్రాబాదు).

41. అయ్యగారి సుబ్బలక్ష్మి (హుబ్లీ, మైసూరు) 42. చల్లా సుబ్బారావు (కాకినాడ) 43. వై. చెల్లాయి (కాకినాడ, 44. అల్లంరాజు సత్యవతి (ఉప్పాడ) తూ. గో. జిల్లా) 45. ప్రసాద, వెంకట పార్థసారధి (టెక్కలి, శ్రీకాకుళంజిల్లా) 46. కింగరాజు రాజగోపాలరావు (నెలూరు) 47. జోస్యుల సాయిప్రసాద్ (ఖర్గపూర్) 48. పాలిశెట్టి రంగనాధరావు (గూడాల, తూ. గో. జిల్లా) 49. హరి ప్రభాకర మురళీధరశాస్త్రి (విశాఖపట్నం) 50. అణింగి సరస్వతి (మారువ, శ్రీకాకుళం జిల్లా) 51. భమిడిపాటి వెంకటేశ్వరశర్మ (కోరుమిల్లి, తూ. గో. జిల్లా) 52. రాయప్రోలు అన్నపూర్ణ (కాకినాడ) 53. టి. తారాదేవి (హాస్పేట, బళ్లారిజిల్లా) 54. వెలమల సత్యవతీదేవి (తిమడాం, శ్రీకాకుళంజిల్లా) 55. జి. చంద్రకాంత్ ప్రకాష్ (హైద్రాబాదు) 56. యర్రమిలి సుబ్బారావు (పూనా, 2) 57. ఈశ్వర్ ప్రసాద్ (హైద్రాబాదు) 58. ధనరాశి కుంతలాదేవి (కాకినాడ) 59. బొజ్జా హరి ప్రసాద్ (అనాతవరం, తూ. గో. జిల్లా) 60. జి. పర్వతవర్ధన్ (విశాఖపట్నం)

61. మాడభూషి స్వర్ణలతాదేవి (గుంటూరు) 62. బందరు వెంకటరమణ (గ్రోలు పాడు, తూ. గో. జిల్లా) 63. కోడ పురుషోత్తం (బెపల్లి గ్రామం, శ్రీకాకుళంజిలా) 64. ముడిపల్లి విజయప్రకాశ్ (రాజమండ్రి 65. తడవర్తి బదరీనారాయణ (రాజమండ్రి 66. ధూళిపూడి పురం పద్మనాభరావు (పొద్దుటూరు) 67. పేపకాయల రామసీతావిజయలక్ష్మి (ధవళేశ్వరం, తూ. గో. జిల్లా) 68. పురాణపండ కామేశ్వరరావు (ఆలమూరు, తూ. గో. జిల్లా) 69. సుబ్బాల బాలయోగి (అజ్జరం, ప. గో. జిల్లా) 70. జి. కేశవ రావు పట్నాయక్ (రాజమండ్రి) 71. గుంటా అయ్యపుశెట్టి (అనకాపల్లి) 72. తల్లాప్రగడ సుబ్బలక్ష్మీరాజ్యం (సోంపేట, శ్రీకాకుళం జిల్లా) 73. నాగిశెట్టి ప్రకాశ రావు (ఖూర్దా పురం, కర్నూలు జిల్లా) 74. వసంతరావు లక్ష్మీబాయి (విశాఖపట్టం) 75. ఆర్. బాలక్రిష్ణమనాయుడు (క్రిష్ణాపురం, చిత్తూరు జిల్లా) 76. తుమ్మలపల్లి సీతారామారావు (గుడివాడ) 77. పి. జయరామిరెడ్డి (బుద్ధయపల్లి, కడప జిల్లా) 78. గోపరాజు దుర్గాదేవి (నిడుబ్రోలు, గుంటూరు జిల్లా) 79. చల్లా సత్యవెంకట సీతామహాలక్ష్మి (ఇరగవరం, ప. గో. జిల్లా) 80. వరకాళి పద్మిని (గుంటూరు)

81. చోడవరపు వెంకటేశ్వరరావు (కోలవెన్ను కృష్ణాజిలా) 82. ఫీల్కాన కృష్ణరాము (జామి, విశాఖపట్నం జిల్లా) 83. పసుమర్తి సీత (మచిలీపట్నం) 84. దేములపల్లి సూర్య సుబ్రహ్మణ్యరామ శాస్త్రి (కొదులూరు, తూర్పు గో. జిల్లా) 85. పత్తి సూరారెడ్డి (మరుకులూరు. తూ. గోదావరిజిల్లా) 86. ఓగిరాల మణి ప్రభ (పిసపాడు, గుంటూరు జిల్లా) 87. సిద్ధం హనుమంతరావు (నందిగామ, కృష్ణా జిల్లా) 88. తాడినాడ లక్ష్మీరాజ్యం (గుడివాడ) 89. మోదర్ల చినబాపిరాజు (ఏలూరు) 90. కొప్పర్తి భారతి (నిడదవోలు, ప. గో. జిల్లా) 91. మదరవలి సుబ్రహ్మణ్యేశ్వరరావు (వేమండ, కృష్ణాజిల్లా) 92. రాయప్రోలు దమయంతి (విజయవాడ) 93 కామ్మజోస్యుల విశ్వేశ్వరరావు (మచిలీపట్నం) 94 వాకచర్ల రామమూర్తి కొల్లరావు (ఏలూరు) 95. మేడసాని సురేష్ (గుంటూరు) 96. తాడి నాగేశ్వరమ్మ (పెరికివీడు వంతెన కృష్ణాజిల్లా) 97. ఉప్పలూరి జానకీ చంద్రభాను (విజయవాడ) 98. ఎమ్. శ్రీరామమూర్తి (రాకాతిప్ప, తూ. గో. జిల్లా) 99. దశిక రామమోహనరావు (విజయనగరం) 100. తటవర్తి సత్యసూర్యనారాయణమూర్తి పల్లిపాలెం, (తూ. గో. జిల్లా) ★

# పని లేని మంగలి

పూర్వం వీరాస్వామి అనే మంగలికి ఒక రోజున ఏమీ పని దొరికింది కాదు. తెల్లవారు జామునే లేచి కాలకృత్యాలు తీర్చుకుని, స్నానం చేసి మంచి బట్టలు వేసుకుని శుభ్రంగా పొది చంక నెట్టుకుని బయలు దేరిన మనిషి, జాము పొద్దెక్కేదాకా నాలుగు బజాల్లూ తెగ తిరిగాడు. తిరిగి తిరిగి కాళ్లు నొప్పులు పుట్టాయే గాని, ఒక్క క్రాపుగాని గెడ్డం గాని అతనికి దొరికిన పాపాన పోలేదు.

"ఛీ! వెధవ బ్రతుకు! ఇవ్వాళ ఎవరి ముఖం చూసి బయల్దేరేనో గాని బోణీ తగల్లేదు" అని తిట్టుకున్నాడు. కడుపులో కాల్తుంటే, తిన్నగా ఇంటికి పోయాడు. ఇల్లు సమీపిస్తుంటే, అతడికి ఒక తెల్ల పిల్లి ఎదురైంది. అతనికి గుర్తొచ్చింది: ప్రొద్దున తాను పొదిచంక నెట్టుకుని రెండడుగులు వేశాడో లేదో, ఈ పాడు పిల్లే ప్రత్యక్షమయింది. పాడు పిల్లి! కాస్సేపు ఎక్కడన్నా చావకూడదూ? తనకే ఎదురుపడాలా? నాలుగు గెడ్డాలు గీకి తేనే గాని తనకి ఇంట్లో గడవదే? ఈ రోజు తన ఇంట్లో అంతా ఉపోష్యం ఉండాల్సిందేగా?

ఇలా అనుకుంటూ, ఉసూరుమంటూ కొంపలో జొరబడ్డాడు వీరాస్వామి, పొది క్రింద పడేసి గోడకి జేరబడి కూచున్నాడు.

అతని కొక వింత ఊహ తట్టింది. ఆ శకున పిల్లి తలే గొరుగుతే?...

వెంటనే వీరాస్వామి లేచాడు. శకునపిల్లి కోసం నాల్గు వైపులా చూచాడు. అది ఎక్కడా కనబడ లేదు. కాని చివరికి తన వంటయింట్లో పొయ్యిలో ముడుచుకు పడుకుని కనిపించింది. దాన్ని కుతిక పట్టుకుని పైకి లేవదీసి పట్టుకొచ్చారు.

పెరట్లో దాన్ని కూలేసి, ఉదయమే తాను మెత్తగా నూరిన కత్తి తీశాడు, ఆ పిల్లి బుర్ర గొరుగుదామనే వీరాస్వామి ఉద్దేశ్యము.

తెలివిగల ఆ శకున పిల్లి వీరాస్వామి ఉద్దేశ్యము గ్రహించింది. కాని అతడ్ని వారించి లాభం లేదు. వీరాస్వామి కోపంగా ఉన్నాడు. తన పాపిష్టిముఖం చూడ్డంవల్ల,

చావలి సాంబశివరావు

ఇవ్వాళ అతడికి ఏమీ 'బోణీ' తగిలింది కాదు. అందుకని తన బుర్ర గొరిగి తీరాలని అతడు పట్టుదలగా ఉన్నాడు. ఇలా ఆలోచించి ఆశకున పిల్లి అంది: "మంగలీ, నా మీద కోపం చేత నా బుర్ర గొరుగుతానంటున్నావు. బాగానే ఉంది. కాని నాకు బోడిగుండువద్దు. ఆ డాబా ఇంట్లో వారి అబ్బాయికి ఉన్నట్లు చిన్న క్రాపు చేయ్ నీకు పుణ్యముంటుంది" అని ప్రతిమాలుకుంది.

మంగలికి కాస్త జాలి కలిగింది పిల్లి మీద. సరే అన్నాడు. నెమ్మదిగా పిల్లికి క్రాపు చేశాడు. పిల్లి అద్దంలో క్రాపు చూసుకుంది. "ఛీ! ఇదేమిటి? బాగా లేదు. ఆ డాబా వాళ్ళబ్బాయి క్రాపు నల్లగా ఉంటుంది. మరి నా క్రాపు తెల్లగా ఉందేం?" అని ప్రశ్న వేసింది.

"అయితే ఇంతకీ నీ క్రాపు కూడా నల్లగా ఉండాలంటావ్?" అన్నాడు మంగలి.

"అవునవును. కాని ఎట్లా?" అంది పిల్లి.

"ఎట్లాగో నే చేస్తాగా!" అంటూ మంగలి లోపలి కెళ్లి తన చదువుకునే కుర్రాడు ఉపయోగించే రంగుల పెట్టె తీసుకొచ్చి, కుంచెతో నలుపురంగు తీసి పిల్లి క్రాపుకు అందంగా వేశాడు.

శకున పిల్లి అద్దంలో తన నల్ల క్రాపు చూసుకుని మురిసిపోయింది.

వెంటనే డాబా యింట్లోకి పరుగెత్తింది. దొంగచాటుగా వంటింట్లో దూరి, ఒగ గిన్నె మూత పడగొట్టి ఒక రొట్టె ముక్క దొంగిలించి, అది పట్టుకొచ్చి మంగలికి సమర్పించుకుంది.

మంగలి వీరాస్వామి ఆకలికొద్దీ ఆ రొట్టెముక్క ఆప్యాయంగా తింటున్నాడు. ఇంతలోకి ఎవరో పాలేరు కుర్రాడు పరుగెత్తుకుంటూ వచ్చి, "ఏమయ్యోయ్! వీరాస్వామి, షావుకారు రంగయ్యగారు అర్జంటుగా ఊరి కెళ్ళాలంట, అందుకని నిన్ను అర్జంటుగా పిల్చుకురమ్మన్నారు. వారికి గెడ్డంగియ్యాలి!" అన్నాడు. "ఆఁ! అట్లాగే బాబూ. వస్తుండా పద." అంటూ హుషారుగా బయల్దేరాడు వీరాస్వామి పొది చంకను బెట్టుకుని. ★

# మేనేజర్‌కు తెలుసును...

ఎక్కువసేపు తాను షర్టులో కనబడుతుండటం ఆయనకు తెలుసును. తన షర్టు చాలా అందంగా కనపడటమే కాకుండ, పగలంతా శుభ్రంగా ఉండటం కూడ, ఆయనకు ప్రధానం. అందువల్లనే, దుస్తులు చాల ముఖ్యమైన విషయమని అనుకునే అనేక ఇతరమంది మాదిరిగా, ఆయన బిన్నీవారి షర్టింగే కొంటాడు. బిన్నీవారి షర్టింగ్ సుద్ద చెక్కుచెదరక, శుభ్రంగా కనబడుతూంటుంది.

మాస్కట్ • ఓపల్ • సెల్లా • గోల్డ్ స్టాండర్డ్

ది బెంగళూర్ వులెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెని లిమిటెడ్.
*మేనేజింగ్ ఏజంట్లు :* బిన్నీ & కో (మద్రాసు) లిమిటెడ్, మద్రాసు.



BY 258

# న్యాయ నిర్ణయం

(43-వ పేజీ తరువాయి)

త్సరాలయినా, ఒక బిడ్డకూడా కలగ లేదని నువ్వే చెప్పావు. అతడిని ఎరగండే - అతడి నివాసము, అతని జీవిత రహస్యాలు ఎలా తెలుస్తాయి?-ఆ నిజాన్ని నువ్వే ఒప్పుకున్నావు. ఎప్పుడైనా సరే, న్యాయపరిష్కారం ముక్కుకు సూటిగా సాగదు. ఉపాయాలతో, తంత్రాలతో చర్చిస్తే గాని వ్యవహారంలోని సత్యం బయటపడదు. అలా చేయడంవల్లే నీనేరాన్ని నువ్వే స్వయంగా బయట పెట్టుకున్నావు. కాబట్టి న్యాయపరిష్కారం ప్రకారం, చట్టప్రకారం-రంగయ్యవద్ద నువ్వు తీసుకున్న పైకాన్ని రెండు వారాలలోగా అతని కిచ్చేయ్!" అని చెప్పి రామశర్మ లేచాడు.

సోమయ్యా కేం చెప్పడానికీ తోచక తన నేరాన్ని ఒప్పుకున్నాడు.

రామశర్మచెప్పిన తీర్పును పాటించమని సోమయ్యను హెచ్చరించాడు మునసబు.

ఆ వ్యవహారంలో తెలివిగా న్యాయపరిష్కారంచేసి తీర్పు ఇచ్చినందుకు పంచాయతీ పెద్దలూ, గ్రామ ప్రజలూ రామశర్మను మెచ్చుకున్నారు. ★

# అమరయ్యా తాత

[40 వ పేజీ తరువాయి]

"గుడివాడ వరకండీ" అన్నాడు తాత సమాధానంగా.

తాతకు చెవుడుగామాలు అనుకొని కండక్టరు మీ టిక్కెట్టేదండీ" అన్నాడు బిగ్గరగా.

"మీరు సాకు టిక్కెట్టివ్వండే" అన్నాడు తాత చిన్నగా నవ్వి డబ్బివ్వబోతూ.

"బలే పనిచేశారు - టిక్కెట్టులేని వాళ్ళని దిగిపొమ్మనలా?" కసురుకున్నాడు కండక్టరు డబ్బందుకోకుండానే.

"డబ్బు తీసికోవడం లేదేమి టిప్పుడు ప్రయాణీకుల దగ్గర" అదో విధమైన హాస్యధోరణిలో అన్నాడు తాత డబ్బివ్వడానికి చాచిన హస్తం అట్టే వుంచుతూ.

"దిగండి బాబూ ముందు - మా ప్రాణాల మీదికి తెస్తారు" విసుక్కున్నాడు కండక్టరు. 'హోల్డాన్' అని బస్సు నాపబోతున్నాడు.

"ఇంకా యిప్పుడేం దింపుతారు లెండి ఆ ముసలాయన్ని - ఆయన పొరపాటుకూడా లేదుగదా-చెవుడు గామాలు పాపం! మీరు టిక్కెట్టు తీసికోని వాళ్లని దిగమనడం ఆయనకు వినిపించివుండదు.

మండపల్లి సమీపిస్తున్నాంగా - అక్కడ నేను దిగుతాను. అక్కడ నుంచి ఆయనకు టిక్కెట్టు రాయిచ్చులే" అన్నాడు ఒక ప్రయాణీకుడు తాతపట్ల సానుభూతిచూపిస్తూ బస్సులోని ప్రయాణీకులింకా కొంతమందికూడా ఆయన్ని బలపరచారు.

"అట్లాగేలెండి" అనక తప్పింది కాదు చివరకు కండక్టరుకు.

ఈ విధంగా అమరయ్యా తాత తనకి చెవుడులేకపోయినా, అచ్చం చెవిటివాడిగా నటిస్తూ బస్సువాళ్లకి బురిడీ యిచ్చి తన ప్రయాణం కొనసాగించాడు. ★



"వహ్వా! ఇది కొత్త సంవత్సరపు కారు!"






సమాజంలో ప్రతి ఒక్కరూ బాధ్యతలను గుర్తించి వాటిని సక్రమంగా నెరవేర్చటం చాలా అవసరం. ముఖ్యంగా సంసారంలో ఎవరి బాధ్యతలు వారు సక్రమంగా నెరవేర్చకపోతే ఒడుదుడుకులు తప్పవు. ఈ విషయంలో సంసారం అనే రథానికి భార్యాభర్తలిరువురినీ రెండు చక్రాలుగా మనం పోల్చవచ్చు. ఈ రెండు చక్రాలలో ఏవొక చక్రం తన విధిని నిర్వర్తించకపోయినా రథం సాగనట్లే. బాధ్యతారహితంగా ప్రవర్తించే కుటుంబాన్ని నరకంతో పోల్చవచ్చు. ఉదాహరణకి:- నే నెరిగిన ఒక కుటుంబం భార్యాభర్తలిరువురూ అన్యోన్యంగా ఉండరు. ఎప్పుడూ ఒకర్నొకరూ సాధించుకుంటూనో, దెప్పుకుంటూనో వుండేవారు. ఇంటి సామాన్లు తీసుకురావటానికి డబ్బడిగితే, ఇప్పుడు నా దగ్గరెక్కడుంది అని తప్పుకునేందుకు చూస్తాడు భర్త. ఇక తప్పదురా భగవంతుడా! అనుకుంటే మహాబాధపడ్తూ చాలీచాలకుండా ఇచ్చేవాడు. ఇక ఆ ఇల్లాలు ఆయనకి తగ్గ భార్య. ఏదో, ఆ ఇచ్చినదాంట్లోనే కాస్త మిగిల్చి, ప్రతివారం కనీసం రెండు సార్లయినా సినిమాలకి వెళ్తూండేది. అటు ఆయనమటుకు ఆయనా రోజుకి కనీసం ఆరు సార్లయినా హోటల్‌కి వెళ్తూండేవాడు. టైముప్రకారం వానొచ్చినా, వరదొచ్చినా హోటల్ దర్శనం చేసుకోనిదే తోచేది కాదు.

ఈ విధంగా ఎవరి అవసరాలు వారు తీర్చుకునేవారుగానీ ఇంటి అవసరాలు ఇద్దరూ పట్టించుకునేవారు కారు.

పిల్లల పెంపకంలో వారిద్దరూ వంతులు వోయి చివరకు వాళ్ళను ఎందుకూ పనికి రాకుండా చేశారు. వాళ్ళ అవసరాలకి వచ్చే డబ్బు ఇంటి విషయం, పిల్లల విషయంలో మాత్రం ఇద్దరిదగ్గరా పైసా లేనట్లు మాట్లాడేవారు. ఈ విధంగా ఇద్దరూ వంతులు పోవడంతో ఆస్తినీ, పిల్లల్నీ కూడా పాడుచేసుకున్నవాళ్ళయినారు. వారిద్దరూ అన్యోన్యంగా ఎవరి బాధ్యతలు వారు నెరవేరిస్తే, ఆ కుటుంబం ఎంత అభివృద్ధిలోకి వచ్చేదో, అన్న విషయం గుర్తొచ్చినప్పుడల్లా చాలా బాధగా ఉంటుంది.

* * *

అనగనగా పున్నయ్యగారని ఒక హైస్కూలు టీచరు ఉండేవారు. వారబ్బాయి కనీసం 6 సార్లైనా మెట్రిక్‌లో దండయాత్రలు చేశాడు. స్కూల్లో పున్నయ్యగారు బాగా చెప్తారనిపేరు. కానీ ఆయన తన కొడుకు చదువునుగురించి ఏవిధమైన శ్రద్ధ తీసుకునేవాడు కాదు, పరీక్షకి ఫీజు మాత్రం కడ్తూండేవాడు. అంతవరకే తన బాధ్యత అన్నట్టు. కొడుకు చదువును గురించి ఏ విధమైన ఆతురత చూపించని పున్నయ్యగారు అతని పెళ్ళిగురించీ మహా తొందరపడేవారు. ఆ యీడు ముళ్ళు వేయించేస్తే తర్వాత వాళ్ళ బాధ వాళ్ళుపడ్తారు అంటూ వుండేవారు. మెట్రిక్ అయినా ప్యాసవనతనికి ఏ వుద్యోగం వస్తుంది, సంసారం ఎట్లా నిర్వహిస్తాడు? అని ఒక్కసారికూడా ఆయన ఆలోచించేవారు కాదు. కొడుకుని ఒక యింటివాడిని చెయ్యటంవరకే తన బాధ్యత అని ఆయన తలంపు. పెళ్ళయిన తర్వాత ఆయన కొడుకు అనుభవించిన బాధలు భగవంతుడికి తెలియాలి.

ఈ విధంగా బాధ్యతలు నిర్వర్తించటం అనేపేరుతో మనుష్యుల్ని యమయాతన పెట్టూంటారు కొందరు. మా బంధువుల్లోనే వెంకమ్మగారని ఒకావిడవుంది. బాగా ఆస్తిపాస్తులున్నాయి. పిల్లలు లేకపోవడంతో ఒకపిల్లవాడిని పెంచుకుంది. అతనికి కాస్త వయస్సు రాగానే, తాను పూర్వం తమ్ముడికి వాగ్దానం చేసినట్లుగా. తనమేనకోడల్ని పెళ్ళి చేసుకోమని అతనికి చెప్పింది. కానీ అతను యింకా చదవాలన్న ఉద్దేశ్యంతో పెళ్ళి కిష్టపడలేదు. ఆవిడ తమ్ముడు పిల్లకి త్వరలో పెళ్ళిచెయ్యాలని పట్టుపట్టాడు. కొడుకు పెళ్ళికి ఇష్టపడలేదన్న కోపంతో ఇక అతన్ని సాధించటం మొదలుపెట్టింది. తనమాట నిలబెట్టుకోవటం తన బాధ్యత. అది నిర్వర్తించటంలో అతను కలిసి రాలేదని. ఇక తనకీ, అతనికీ ఏ విధమైన సంబంధం లేనట్లు మాట్లాడేది ప్రతివాళ్ళతో "నేను వాడికి తల్లినీగాను, వాడు నాకు కొడుకూ కాడు. వాడికీ నాకూ ఏ నాడో ఋణం తీరిపోయింది. ఎరువుసొమ్ము సొంత సొమ్ములా అవుతుందీ" అని అంటూ ఉండేది. తన మాట నిలబెట్టుకోవటం తన బాధ్యత అనేది ఆలోచించిందిగానీ, ఇష్టం లేని పెళ్ళిచేసి వాళ్ళు అన్యోన్యంగా లేకపోతే బాధపడేది తనేగదా అని ఆలోచించేది కాదు. చివరికి అతను విసుగెత్తి తన తల్లితో "నన్ను పెంపుడు ఎందుకు ఇచ్చావమ్మా! ఏదో వున్నదాంట్లో కలోగంజో పోసి నన్ను పెంచలేకపోయి నావా?" అని భోరున ఏడ్చాడు. అతని హృదయం ఎంత బాధపడ్డదో పైమాటలోనే అర్థమవుతోంది. ఈ విధంగా బాధ్యత అన్న పేరుతో ఒకళ్ళని బాధించటం కన్నా వేరే నరకం ఏముంటుంది? తనమాట నెగ్గించుకోవటం వరకే తన బాధ్యత అయినప్పుడు, అందులో మంచీ, చెడూ ఆలోచించే బాధ్యత మాత్రం వాళ్ళకి వుండనక్కరలేదా?

ఈ పైచెప్పిన ప్రకారంగా అందరూ చేస్తున్నారని నా ఉద్దేశ్యం కాదు. కానీ ఉన్న కొందరూ సక్రమ మార్గంలో తమ బాధ్యతలు నెరవేరిస్తే చాలా బాగుంటుంది. ఒక పనిని బాధ్యతతో నిర్వర్తించినపుడు దాని పర్యవసానం మనం చేసినదాన్నిబట్టే ఉంటుంది గనుక దాన్ని భరించాల్సింది మన బాధ్యతే, అనే విషయం అందరూ తెలుసుకున్నప్పుడు "గృహమే కదా స్వర్గసీమ" అన్న పదం సార్థకమౌతుంది. ★

వారణాసి హైమవతి



# మా హంపి సందర్శనం



హంపి పేరువినని ఆంధ్రుడు ఉండడంటే అతిశయోక్తి కాదనుకొంటాను. హంపి, హోసపేట లేక హాస్ పెట అనే ఊరుకు ఏడుమైళ్ళ దూరంలో ఉంది. అనంతపురం నుండి పది పదిహేను కుటుంబాల వాళ్ళం ప్రత్యేకమైన బస్సు ఏర్పాటు చేసుకొని బయలుదేరేము. శనివారం ప్రొద్దున్నే బయలుదేరి బళ్ళారిమీదుగా ఒంటిగంటకు హాస్ పెట్ చేరుకొన్నాము. ఆనాడు అక్కడేవుండి తుంగభద్రా డామ్ అవీ చూసి, మర్నాడు పొద్దున్నే టిఫిన్ తీసుకొని ఏడుగంట ల య్యేసరికి హంపి చేరేము.

నాలుగువందల యేండ్లక్రితం అష్ట ఐశ్వర్యాలతో తులతూగుతూ పలువురు విదేశీయులచే కీర్తింపబడిన ప్రాచీనాంధ్ర రాజధాని ఈనాడు కూలిన శిలామంటపాలతోను, దేవాలయాలతోనూ ముక్కూ మూతీ విరిగి వికృతంగా వున్న పెద పెదవిగ్రహాలతోనూ ధూళి దూసరాలతో బోసులు బోసులు మంటూ ప్రత్యక్షమైంది. బస్సులోనుండి దిగుతూవుండగానే కోట గోడలు కనిపించాయి మాకు. మేము మొట్టమొదట రాణుల స్నానాలమందిరము చూసేము. మధ్యనొక రాతి చెరువు, దానికి మెట్లూ, తుంగభద్ర నీటిని యీ చెరువులోనికి తీసుకొనివచ్చే రాతికాలువా, మురికినీటిని అడుగునుండి తొలగించే తూమూ, ఈ చెరువు చుటూ వెడల్పయిన వరండా వంటి కట్టడమూ ఉన్నాయి. ఈ కట్టడములో ఆర్చీలవంటి నిర్మాణము మహమ్మదీయుల వాస్తుశిల్ప సంప్రదాయానికి చెందినవట. కనుక దీనిని 'ఇండో శార్సనిక్' అంటారు.

ఆకాలంలో సిమ్మెంటువంటివి లేకపోవడంవల్ల నేమో నీటిసౌకర్యానికి రాతి నే దొలిచి ఉపయోగించారు హంపీనగరవాసులు. చాలాచోట్ల నిలబెటిన రాతి స్తంభాలూ, వానిపైన నీటిని సరఫరాచేసే రాతితూములూ కనిపిస్తాయి. తుదకు గుఱ్ఱాలకు నీళ్ళుపట్టే తొట్టెవంటిది కూడా రాతిదే.

తర్వాత మహర్నవమి దిబ్బ. దీన్నే దసరా దిబ్బ అని కూడా అంటారు. రాయలు మహర్నవమి ఉత్సవాలు బ్రహ్మాండంగా జరిపించేవాడనీ, అటువంటి సమయాల్లో ఇక్కడ కొలువుదీరి, దీనికెదురుగా ఉన్న పెద్ద మైదానంలో సైనికుల చాతురీ ప్రదర్శనాన్ని పరీక్షించే వాడని అంటారు. పియాస్ అనే విదేశీ యాత్రికుడు ఇదే 'విజయ భవనము'ని పేర్కొన్నాడు. 1513 లో కళింగ ప్రభువు ప్రతాపరుద్ర గజపతిని ఓడించి ఆ విజయానికి చిహ్నంగా యీ విజయ భవనాన్ని నిర్మించాడట రాయలు. ఇది 80 చదరపు



అడుగుల వైశాల్యం. గుట్ట ఎత్తు 22 అడుగులు' పైకి ఎక్కడానికి మెట్లున్నాయి. దీనిపై నిర్మించిన భవనాల శిల్పం మెచ్చదగినది. ఈనాటికీ అద్దంలాగ నిగనిగలాడేటట్లు నునుపుచేసిన పార్శ్వపు గోడలపైని జీవం



ఉగ్రనరసింహస్వామి

ఉట్టిపడేటట్లు చిన్న చిన్న పరిమాణాల్లో కుక్కలూ. పక్షులూ, వేటదృశ్యాలూ, నాట్య సుందరీమణులూ, గుఱ్ఱాలూ, ఏనుగులూ చెక్కారు' ఇవి చూస్తే హోయిసాల రాజుల బేలూరు, హళేబీడ్ శిల్పం జ్ఞాపకమొస్తుంది. విజయనగర శిల్పంలో ఏనుగులు ప్రత్యేకం చెప్పతగినవి. అవి పరిగెడుతున్నటూ, ఒక కాలు ఎత్తుకొని పరిగెట్టండుకు సిద్ధంగా ఉన్నట్లూ, గొలుసులతో బంధింపబడినట్లూ, ఠీవిగా నిలుచున్నట్లూ రక రకాలుగా చిన్నవిగా ఈ ఏనుగులు చెక్కబడ్డాయి. విదేశీయులను నూదిగా ఉండే పష్టియన్ టోపీలతోనూ, గడ్డాలతోనూ చిత్రించారు.

దీని తర్వాత మంత్రులు రహస్యాలోచన జరిపే భూగర్భ మందిరం చూసేము. తిమ్మరసు వంటి మహానుభావులు మంత్రాలోచన జరగినది ఎలాగ వున్నదో చూడాలనిపించి దిగేము కాని ఎవరూ శ్రద్ధతీసుకోనందువల్ల గబ్బిలాల కంపు తప్ప ఇంకేమీ లేదక్కడ.

తర్వాత ఉటి ప్లాట్ఫారమ్ లాగ మిగిలిన రాజ సభామందిరాన్ని చూసేము.

దీని కెదురుగా 41½ అ॥ పొడవు, 8 అ॥ వెడల్పూ, 2¾ అ॥ దళసరిగల రాతి నీళ్ళతొట్టె ఒకటి ఉంది. ఇందులోనే గుఱ్ఱాలకు నీళ్లు పెట్టేవారట.

తర్వాత జనానామందిరము. పెద్ద సింహద్వారంవంటి కట్టడంలోనుండి లోపలికి ప్రవేశించాము. చుటూ చాలా ఎత్తుగా ప్రహరీగోడ. ఆ ఆవరణలోని కట్టడాలన్నీ అంతఃపురానికి సంబంధించినవే. అందులో చుటూరా గోడనానుకొని నలుప్రక్కలా నాలుగుగోపురాలు ఉన్నాయి. వానిలో రెండే ప్రస్తుతం విరిగిపోకుండా ఉన్నవి. రాణులు ఉత్సవాలూ అవీ ఇక్కడనుండి చూసేవారట. మేము ప్రవేశించిన సింహద్వారానికి కొద్దిదూరంలో అదే గోడనానుకొని స్త్రీ రక్షకభటులకొఅకొక ప్రత్యేక కట్టడం ఉంది. ఆ ఆవరణలో రాణుల ప్రాసాదపు శిథిలశేషంగా ఒక అరుగువంటి కట్టడమూ, ఒక చెరువు ఉన్నాయి. ఈ అంతఃపుర కళాఖండాలన్నింటిలోకీ అందమైనది పద్మమహల్. ఇందులో ఆర్చీలవఱకు మహమ్మదీయపద్ధతిలోను, దానిపైని గోపురాలవంటి నిర్మాణం భారతీయపద్ధతిలోనూ ఉంటుంది. ఇక్కడ గచ్చు, సున్నమూ, ఇసుక కలిపిన గారవంటి దానితో చేయబడినప్పటికీ ఈనాటికికూడా నున్నగా నిగనిగలాడుతూ ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా జారి క్రిందపడేటట్లున్నది. ఆ నున్నటి చల్లని గోడమీద చెయ్యిపెట్టగానే ఆ గోడలు జీవంతో నాతో ఏదో అన్నట్లయింది... "అలనాడు రాయల ముద్దుల రాణులు చిన్నమాంబ, తిరుమలాంబ వసించే ఈ మందిరంలో, నన్ను చూసేపాటి భాగ్యం కూడా తిమ్మరసువంటి మహాత్ములకు తప్ప మరెవ్వరికీ లభించేది కాదు. అటువంటి సుకుమారులపాదాలు సోకిననన్ను మీబూటు కాళ్లతో నిర్దాక్షిణ్యంగా త్రొక్కేస్తున్నారు—" అన్నట్లయింది. ఇంకా జాగ్రత్తగా విన్నాను ... "ఇంకా నయం. ఈనాడు క్షణం తీరిక లేనిమానవుడు హంపీ అంతా ఒక్క పూటలో చూసేయాలనివచ్చి

# మా హంపీసందర్శనం

నన్ను పైనుంచే చూసిపోతాడు. మీరు లోపలికైనా వచ్చారు" అన్నట్లయింది... అంతలో, 'రండి. రండి ఇంకా చూడవలసినవి చాలా ఉన్నాయి' అంటున్న మావాళ్ళ కేకలువిని, 'నోరు లేకపోయినా నీవు చెప్పే కథలు వినేపాటి వ్యవధి నాకు లేదు' అనుకొని, మళ్లీ ఒక్కసారి ఆ గోడను నిమిరి బయటకు వచ్చేశాను.

తర్వాత ఏనుగులశాల వరుసగా పదకొండు గదులవరకే వున్న రాతి కట్టడమిది, తక్కిన గదులకు భిన్నంగా ఉన్న శిఖరం కల మధ్య గదిలో పట్టపేనుగను ఉంచేవారట, దీని దగ్గరే మావటివాళ్లకోసం నిర్మింపబడిన కట్టడం ఉంది. ప్రస్తుతం దీనిలో పురాతనవస్తు పరిశోధక శాఖవారు హంపిలో అక్కడక్కడ దొరికిన విగ్రహాలన్నింటిని ఒక మ్యూజియమ్‌లాగ అమర్చిపెట్టేరు వీనిలో రాతిలో మలచబడిన అరటాకు దానిచుట్టూ దొన్నెలూ, ఇద్దరు ముగురు విసిరే పెద్ద తిరగలి, కృష్ణరాయుల రాతివిగ్రహమూ, సతీ శిలలూ, వీరగల్లులూ, రెండు జైన విగ్రహాలూ చూడదగినవి. వీరగల్లు Hero stones లంటే యుద్ధంలో మరణించిన వీరుని గౌరవార్థం వేసిన చిహ్నాలన్నమాట ఈ రాతి మీద ఆవీరుని కైలాసప్రాప్తి చెక్కబడి వుంటుంది సతీశిలలు పతీ మరణానంతరం సహగమనం చేసిన వనితల గౌరవార్థం వేయబడినవి.

ఈ ఏనుగులశాల దగ్గరలోనే 10 అ॥ ఎత్తు, 8 అ॥ వెడల్పు కి అంగుళాల దళసరి కల పెద్దరాతి తలుపు ఉందట కాని మేము చూడలేదు దాన్ని.

ఇక్కడనుండి హజారా రామాలయానికి వెళ్ళేము. చరిత్ర పుస్తకాలలో సాధారణంగా దీనిబొమ్మ, పద్మమహల్, విరూపాక్షాలయాలు చూస్తూనే ఉంటాము కనుక అపరిచయం మీద ఈ శిఖరం చూడగానే మేము ఎన్నాళ్ళబట్టో ఎరిగి ఉన్నట్లుగా కనబడింది. ఇది 1513 లో నిర్మింపబడింది. ప్రాకారం బయటిగోడమీద ఏనుగులూ, గుఱ్ఱాలూ, కొల్పులమూ, నాట్యంచేస్తున్న స్త్రీలూ వరుసలు వరుసలుగా చెక్కబడాయి. దివ్వమూనే ఆరోజుల్లో ఊరేగింపులు ఇలాగ ఉండేవేమో అనిపిస్తుంది ఇక్కడ కూడా ఏనుగల భంగిమలు మహర్నవమీదిబ్బ మీది ఏనుగులను గుర్తుకు తెస్తాయి. కాని ఆ మున్నదనం లేదిక్కడ ప్రాకారం లోపల గుడిగోడలమీద రామాయణ ఘట్టాలెన్నో చెక్కబడ్డాయి. అక్కడక్కడ కృష్ణలీలలూ ఉన్నాయి విజయనగర శిల్పులు ఒక చతురపుటడుగు పరిమాణంలో చిన్న విగ్రహాలను చక్కని కనుముక్కుతీరూ, అంగసౌష్ఠవాలతో మలచడంలో ఎంతో నేర్పరితనం చూపేరు. అంతేకాక నాలుగు కాళ్ళ మంటపంమీద బల్లపరుపునంటి కప్పు-లేక-శిఖరంలాగ తీర్చడమూకూడ విజయనగరశిల్ప ప్రత్యేకత అని అంటారు హిందూ పౌరాణిక ఘట్టాలేకాక హజారా రామాలయ గోడలమీద అలంకారంగా జైనతీర్థంకరుల విగ్రహాలు కనబడడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

దీని తర్వాత భూగర్భాలయం చూసేము. గర్భగుడి వగైరాలన్నీ నీటిలో మునిగి ఉన్నాయి. శివలింగంకూడా నీటిలో మునిగి ఉండేటట్లు అమర్చబడినదట. కాని కాలు జారితే నీళ్ళలో పడేటట్లున్నా కూడా లోపలికి వెళ్ళి తొంగిచూసేము. చీకటి, గబ్బిలాలకంపు తప్ప మరేమీ కనబడలేదు. కాని గర్భగుడి వెలుపల నీటిలో సగంవరకూ మునిగి వున్న నంది ఉంది. ప్రసన్న విరూపాక్షాలయమనే గుడి ఇదేనట!

తర్వాత బస్సెక్కి కమలాపురం దారిలో వున్న 'బడివిలింగము' వద్ద ఆపి, దిగేము. ఇది పది అడుగుల యెత్తు 8 అ॥ వెడల్పుగల పెద్ద శివలింగము. సగంవరకూ నీటిలో మునిగి వున్నది. దీని దగ్గరే ఉగ్రనారసింహమూర్తి విగ్రహమున్నది. ఇది ఒకే రాతిలో 22 అ॥ యెత్తున చెక్కబడినది ఈ బ్రహ్మాండమైన విగ్రహం నిజంగానే ఉగ్రంగా మనవైపు చూస్తూ భ్రమన్పడజేస్తుంది కాని యీ విగ్రహాన్ని చూస్తూ ఆశ్చర్యంతో నోరు తెరచుకోవడంతో పాటు వెంటనే 'అయ్యో అయ్యయ్యో' అనే వాక్యాలు అప్రయత్నంగా మన నోటినుండి వెలువడుతాయి. ఏమంటే ఈ విగ్రహం చేతులూ కాళ్ళూ మీదైన అంతవరకూ తురకల చేతుల్లో నిర్దాక్షిణ్యంగా ముక్కలుగా కొట్టబడి వికృతంగా ఉన్నాయి ఇది ఇంత ఘోరంగా వికృతం చేసినా దీని ప్రక్కనే ఉన్న బడివిలింగము చక్కని స్థితిలో ఉండడము శైవులకు వైష్ణవులకు గల స్పర్థలను సూచిస్తోందని చరిత్రకారుల వూహ రాయలు గజపతి కూతురును పెండ్లాడిన తర్వాత వైష్ణవుల కెక్కువ రాజాదరణ లభించడము శైవులకు కన్నెర్రగా ఉండేదట ఆ కసిని మనస్సులో ఉంచుకొని రాజాధికారం మంటగలసినప్పుడు విగ్రహాలను నాశనం చేసే తురకలకు వీరు సహాయం చేసి ఉంటారని వీరి ఊహ ఎక్కడో తుంగభద్ర ఒడ్డునఉన్న కోదండరామస్వామి ఆలయంలో తప్ప తక్కిన దేవాలయాలన్నింటిలో విగ్రహాలు నాశనం కావడమూ, విరూపాక్ష వీరభద్రాలయాలు చక్కని స్థితిలో ఉండడమూ వీరి కాధారమట.

మళ్లీ బస్సుఎక్కేము కోట ద్వారం వంటి పెద్ద కట్టడంలోనుండి బస్సు యథేచ్ఛగా పోయింది. మధ్యలో బాలకృష్ణాలయం, ఉద్దాన వీరభద్రాలయమూ చూశేం. బస్సు పోతూ ఉండగానే బ్రహ్మాండమైన గణేశ విగ్రహం ఒక మంటపంనుండి కనబడింది. ఆగి దిగి చూసేము దాని ప్రక్కనే



విఠల్ దేవాలయము



రాతి రథము

మరొకగుడి. అందులోనూ అంతే పెద్ద గణపతి విగ్రహం పూజా పునస్కారాలు లేక పడి ఉంది. ఈ రెండు విగ్రహాలూ 10 అడుగులకు మించిన ఎతులో ఉంటాయి. కాని వీనిని వ్యంగ్యంగా 'కడలెకల్ గణేశ' అంటారట. అంటే సెనగగింజంత గణేశులని. ఇవి చూసి కొదిదూరం నడచి హేమకూట పర్వతం చేరేం. దీని నిండా పిరమిడ్‌ల ఆకారంలో మెట్టు మెట్టుగా అమర్చబడిన గోపురాలు గల జైనాలయాలున్నాయి. వీని ప్రక్కనే శివాలయం కూడా వుంది.

వీనికి దగ్గరగానే విరూపాక్షాలయము కనబడుతుంది.

విరూపాక్షాలయము హంపిలోని ముఖ్యమైన ఆలయాల్లో ఒకటి. దీనికి పౌరాణికమైన ప్రాముఖ్యం కూడా ఉంది. రామలక్ష్మణులే దేవుని కొలిచేరట. ఒకనాడు రాముడు తన ఉంగరం స్వామి పానవటం మీద మరచిపోయి వచ్చాడట. అది తీసికొని రావడానికి వెళ్లిన లక్ష్మణునికి అలాంటి ఉంగరాలు ఆ పానవట్టంమీద లక్షలు లక్షలుగా కనబడ్డాయట. వానిలో తన అన్న ఉంగరమేదో పోల్చుకోలేక వచ్చి వేసిన అతనికి రాముడు ఆ ఉంగరాలు ఆ దేవుని కొలిచిన తరతరాల ప్రజలను సూచిస్తున్నాయని సమాధానం చెప్పేడట. ఈ కథ ఎలా ఉన్నప్పటికీ ఈ గుడి 7 శతాబ్దానికే ఉన్నట్టు చారిత్రిక సాక్ష్యమున్నది. వ్యాసుని స్కాందపురాణములో సప్తఋషులు కాశీ విశ్వేశ్వరుని కొలిచి, తర్వాత దక్షిణ కాశీలోని ఈ పంపావతి లేక విరూపాక్షస్వామిని సేవించినట్లు చెప్పబడినది. ప్రస్తుత హంపీయే పంపాసరోవర తీరాన్న ఉండిన పూర్వపు కిష్కింధ అంటారు. హంపీలో ఇప్పటికీ లెక్కలేనన్ని కోతులు కనబడతాయి! హంపిలో పంపాసరోవరమూ, సీతమ్మ స్నానాలుచేసిన సరోవరమూ, రామలక్ష్మణుల పాదాలూ, సుగ్రీవ గుహా, సుగ్రీవుడు వాలి బారినుండి కాపాడుకొనిన మాతంగ పర్వతమూ ఉన్నాయి. ఈ మాతంగ పర్వతము పైకి వెళ్ళడానికి మెట్లున్నాయి. తుంగభద్ర ఈ పర్వతం చుటూ మలుపుతిరిగి ప్రవహిస్తోంది. ఈ ప్రదేశము నుండి హంపీ దృశ్యం చాలా బాగుంటుంది. ఇక్కడికి దగరలోనే సీతా వియోగానంతరం రామలక్ష్మణులు గడిపిన మాల్యవంత పర్వతము ఉంది.

మీకు తెలుసుననుకొంటాను. ఈ మాతంగ పర్వత మహిమవల్ల ఇచ్చటి దుర్బలప్రాణుల నైనా శత్రువులు జయించలేరట. అందుకనే సుగ్రీవుడు దీన్ని ఆశ్రయించాడంటారు. విజయనగర స్థాపనాచార్యులైన విద్యారణ్యస్వామి యీ ప్రదేశంలో కుందేలు కుక్కలను తరుముట కన్నారాచూసి, అక్కడ



కమల మందిరం

ప్రజలవల్ల దానిమహిమ తెలిసికొని అక్కడే హిందూసామ్రాజ్య పునరుద్ధరణార్థం యీ పట్టణాన్ని స్థాపించాడట. ముహూర్తం నిర్ణయించి తానొక ఎత్తుప్రదేశం నుండి గ్రహస్థితిచూస్తూ సరిగా ఆ సమయానికి శంఖం పూరిస్తాననీ వెంటనే పట్టణానికి పునాది వెయ్యమని విద్యారణ్యస్వామి తన శిష్యులకు చెప్పేరట. ఆసమయంలో ఎవరో జంగం శంఖముపూరిస్తే అదే తమ గురువుగారు చెప్పినదనుకొని శిష్యులు పునాది వేసేశేరట. ఈ పొరపాటువల 3600 ఏండ్లు ఉండవలసిన నగరం 360 ఏండ్లు మాత్రమే నిలువగలదని విద్యారణ్యస్వామి అన్నారట. ఈవిషయం రాయల వాచకమనే గ్రంథంలో వున్నది. ఇదిమన ప్రాచీనాంధ్ర సారస్వతంలోని ఒక్కగానొక్క చారిత్రక వచన గ్రంథము. రాయలవలన మధురకునియమింపబడిన విశ్వనాధ నాయకుని స్థానాపతి, విశ్వనాధునిచే నియోగింపబడి విజయనగరంలో ఉంటూ అక్కడ రాయలకొలువులో జరిగే విశేషాలనూ, విజయనగర సామ్రాజ్యానికి సంబంధించిన ఉదంతాలనూ (పెద్దలవలన తెలిసికొని.) లేఖలరూపంలో వ్రాసి తన అధిపతికి పంపినాడు. ఈ లేఖల సంపుటమే రాయవాచకము. లేఖలు కనుకనే యిది వ్యవహారిక వచనశైలిలో నున్నది. కాని తమాష ఏమిటంటే వీర నరసింహరాయలు కొలువుదీరి యున్నప్పుడు పుంభావసరస్వతి విజయనగర స్థాపనకు సంబంధించిన యీ కథను చెప్పి "ఈవరకు ఇరవైతొమ్మిదిమంది నృపతులకు మున్నూరు యేండ్లాయెను. ఇంక అరవైయేండ్లు పటణమున్ను, సింహాసనమున్ను నిలిచియుండును" అని విన్నపంజేసి ఈ రాజ్యపటణం కృష్ణరాయలవారికి కట్టవలెనని దళనాయకుతో పలుకరించెనని కలదు. ఈ వాక్యంచూసే రాయలకాలానికే విజయనగర సామ్రాజ్యం త్వరలో నశింపనున్నదని ఆ రాజులకు ముందే తెలుసునా అనిపిస్తుంది. ఏమైనప్పటికీ రాయలసమకాలికుడైన విశ్వనాధుని స్థానాపతియైన రచయిత కాలమునకే యీ జనశ్రుతి ఉండివుండాలి. శంకుస్థాపన శా. శ. 1127 లేక క్రీ॥ శ॥ 1205 లో జరిగిందని రాయవాచకంవల్ల తెలుస్తున్నది.

(మిగతా పైవారం)

## సవరణ

ఖలికోటె కాలేజి లాటరీ, 10-9-58 తారీకు ఆంధ్ర వారపత్రికలో ప్రకటించిన ముగింపు తేది 20-10-58 అనుటకు బదులు 20 9 58 అని పొరబాటున తప్పబడినది. పాఠకులు ముగింపు తేదీ 20-10-58 అని గ్రహింతురు గాక.

# స్త్రీలవిద్యకు ప్రయోజనం ఏమిటి?

"అన్నంరాజు రమణమ్మగారు వ్రాసిన "స్త్రీలు - ఉన్నత విద్య" వ్యాసంలో ఉన్నత విద్యయొక్క లక్ష్యాలు, ఉపయోగాలు చాల నేర్పుతో, చక్కగా విశదీకరించారు. అయితే. వారు వ్రాసిన కొన్ని అభిప్రాయాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయని నాకు అనిపించింది. నాకున్న ఉన్నత విద్యా జ్ఞానంతో (అంటే డిగ్రీవలన కలిగిన జ్ఞానం) నేను కొన్ని విషయాలు విపులీకరిస్తాను.

ఆమె తన అభిప్రాయాలు వ్రాస్తూ, స్త్రీలకు ఉన్నతవిద్య యిప్పటి పరిస్థితుల్లో అనవసరమని పరోక్షంగా చెప్పారు. ఆమె చెప్పినట్లు "స్త్రీవిద్య అవసరమా! కాదా!" అనే చర్చ మన సమాజంలో యిప్పుడు లేదు. ఆమె, స్త్రీలకు 'ఉన్నత విద్య అవసరమా? కాదా' అనే చర్చనీయాంశాన్ని యీ వ్యాసంలో లేవదీశారు. కనుక స్త్రీలందరూ పాల్గొనటానికి అభ్యంతరం లేదనుకుంటాను.

మనదేశంలో జీవితపరిమాణము చాల తక్కువ. నిత్యజీవితావసరములు కూడ పొందలేని, మధ్య తరగతివారే, గాక అంతకన్న తక్కువ తరగతివారు కూడ ఉన్నారు. అట్టి సంసారాల్లో ఆడపిల్లలకు ఉన్నత విద్య గగనకుసుమముగా యుండుట నిర్వివాదాంశము. మన కవకాశం లేకపోవటంచేత మన కవసరం లేదనుకోవటం సమంజసమా? ఉన్నత విద్య నభ్యసించితే ఆ వ్యక్తి తప్పక దాని ప్రయోజనాల ననుభవిస్తాడు. అందనిపండ్లు పులుపని నక్క అందని, మనమూ అంటామా?

ఉద్యోగం చేస్తేనే ఉన్నత విద్యకి సార్థకత ఉందనుకోవటం సబబుకాదేమో. ఆమె, డిగ్రీలు పొందిన అనేకమంది స్త్రీలు ఉద్యోగం చేయటం లేదన్నారు. పురుషులకు సంపాదన భారం వదలి తమపైగల గృహనిర్వహణ భారం నిర్వర్తించుట స్త్రీల ప్రథమ కర్తవ్యమని ఆమె చెప్పారు. అటువంటప్పుడు స్త్రీలు తమ ఉన్నత విద్యా జ్ఞానాన్ని సంసారాన్ని సక్రమంగా నిర్వర్తించుటలో వినియోగిస్తూ, ఆదర్శమైన సతిగా, మాతగా రూపొందితే, దేశానికి గర్వకారణం కాదా? బాగా చదువుకున్న స్త్రీ గృహనిర్వహణకు పనికిరాదని ఆమె అభిప్రాయం కాదనుకుంటాను.

స్త్రీలు ఉద్యోగం చేయటంవలన కుటుంబ పరిస్థితులు తారుమారవుతాయన్నారు. అట్లా తారుమారయే పరిసితుల్లో స్త్రీ ఉద్యోగం చేయటానికి ఒప్పుకోదు; ఆమె భర్తా ఒప్పుకోడు. స్త్రీలు ఉద్యోగం చేయటం, మానటం అనేది వారి, వారి వ్యక్తిగత సమస్యలని బట్టి యుంటుంది. ఆర్థికలోపం వలన కుటుంబపరిస్థితులు తారుమారయే పరిస్థితులు యేర్పడిన అనేక సంసారాల్లో స్త్రీలు విదారు

**జయ శ్రీ సారథి బి. ఏ.**
[బాగ్గులకుంట, హైదరాబాదు]

గురు పిల్లలతో కూడ ఉద్యోగాలు చేస్తూ, యెంతో గుటుగా సర్దుకుపోయేవారున్నారు. ఒక్కొకప్పుడు ఆర్థిక పరిసితులు కుటుంబాన్ని తారుమారే కాదు నాశనం కూడ చేస్తాయి. అది కాకుండ పిల్లల విషయం చూసుకుంటే, ఉద్యోగం చేసే దంపతులకు యెక్కువమంది పిల్లలుండకపోవచ్చు. ఒకవేళ ఉన్నా వారి దగ్గర వారి నెవర్నయినా పెట్టకొని చేయించటంకూడా కొన్ని కుటుంబాల్లో చూశాను.

మనసంఘం విద్యావంతమైనది, సంస్కారము గలది అయినప్పుడు ఉద్యోగం చేసే స్త్రీలు, విద్యకోసం కాలేజీలకు పోయే స్త్రీలు యెటి అవహేళనకూ గురికానక్కఱలేదు. సంఘం అంటే స్త్రీ పురుషుల సమూహమేగదా! స్త్రీలే స్త్రీలని అపహాస్యం చేస్తారనే విషయం ముఖ్యంగా నేను అనుభవంమీద తెలుసుకున్నాను. ఉద్యోగం చేసే రోజుల్లో విద్య అంటే ఒక "పవిత్రమైన కళ" అని, అది అందరి మనోవికాసానికి ఆవశ్యకమనే విషయం స్త్రీ పురుషులు ఆనాటి స్త్రీలు గురువుల వద్దనో, పండితులైన తండ్రులవద్దనో విద్య నభ్యసించిన వారే. ఉన్నతవిద్య గల స్త్రీలు మనపూర్వపు సంప్రదాయాలు, ప్రాచీన ఔన్నత్యాన్ని యెప్పటికి విస్మరించరు. ఉన్నతవిద్య నభ్యసించటంవల్ల మన సంప్రదాయాలు, మన ఔన్నత్యమేగాదు, యితర దేశాల ఔన్నత్యాలు, సంప్రదాయాలు కూడ తెలిసి, మనలోని సంకుచితదృష్టి నశించి విశ్వమానవ సౌభ్రాతృత్వం, విశాలదృష్టి మనలో నాటుకుపోతాయి. ఉన్నతి విద్యవలన స్త్రీకి ప్రత్యేకమైన వ్యక్తిగా ప్రాధాన్యం లభిస్తుంది. అనేక రంగాల్లో కృషిచేసి, విద్యావతులైన స్త్రీలు విజయం సంపాదించి, ప్రత్యేకమైన వ్యక్తిగా తమ ప్రాధాన్యం నిరూపించుకున్నారు. పురుషులుకూడ స్త్రీ వొక ప్రత్యేకమైన వ్యక్తిగ గుర్తించాలి. విద్యావంతమైన సమాజంలో విద్యావతులైన స్త్రీల స్వతంత్రం, వ్యక్తిత్వం గుర్తింప బడుతుంది. ప్రాచీనకాలపు భారత స్త్రీలు కూడవిద్యావంతురాండ్రే. గుర్తించి, ఆమెకు గౌరవం స్వాతంత్ర్యం యిస్తున్నారు.

ఇక స్త్రీలేకాదు పురుషులుకూడ తమొక్కరు రక్షించాలని, ఆదరించాలని, పోషించాలని కోరుతారు. శాస్త్రాల్లో స్త్రీ మూర్తులు అనేకులు తమ భర్తలను రక్షించలేదా? తప్పులుచేసిన భర్తలను ఆదరించి, కనికరించలేదా? ఇప్పుడుకూడా పురుషుడు తను ఇంటలేని సమయంలో తన కుటుంబబాధ్యతనంతా ఆమె భుజస్కంధాలపైగదా ఉంచి ఆఫీసుకు పోతాడు. తనపిల్లలను పోషించటంలో వాళ్ళకుమంచి అలవాట్లు నేర్పి క్రమశిక్షణతో పెంచడంలో, యెక్కువశ్రద్ధ యెవరు తీసుకుంటారు? ఉదయమంతా ఆఫీసులోఉండే, పురుషుడా? ఇల్లు కనిపెట్టుకునిఉన్న స్త్రీయా? పగలంతా, అలసి, సొలసి వచ్చిన పురుషునికి, మందహాసంతో స్వాగతమిచ్చి, తీయని పలుకులతో ఆదరించే స్త్రీ లేని పురుషుని జీవితం యెట్లా ఉంటుందో, ఊహిస్తే, ఆమెవిలువ తెలిసివస్తుంది.

ఇక, బాహ్యమైనఆడంబరాలు ఆదరించి, అనుభవించే స్త్రీలు అన్ని తెగలలోనూ ఉన్నారు. ఆడంబరం - ఉన్నతవిద్య యీ రెంటిని జతకలపడం సముచితంకాదు. ఉన్నతి విద్యావతులైన స్త్రీల సార్థకత తమ చుట్టుగల ప్రపంచాన్ని విద్యావివేకవంతముగాను, సంస్కార యుతముగాను చేయటంలో ఉందిగాని, అహంకారంలోను, ఆడంబరంలోను, ఉద్యోగం చేశాననే తృప్తిలోను లేదని నాయొక్క దృఢనమ్మకం దీనితో యెందఱు యేకీభవిస్తారో?



# వనితా వాణి



## "నా సందేహం"

ఆగస్టు 27వ తేది పత్రికలో "వనితా వాణి" క్రింద వి. ప్రమిలాదేవి (విజయవాడ) గారు కట్నాలను గురించి వ్రాస్తూ "నాకు కట్నము ఏమాత్రము అక్కర్లేదు. నేను ఆ అమ్మాయినే చేసుకుంటాను అని ఏ ఒక్క పెళ్ళికుమారుడూ ముందడుగు వేయలేడు" అని వ్రాశారు...ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు పెళ్లి చేసుకున్న వాళ్లందరికీ ఏదో వుద్యోగము యిస్తామని హామీ ఇచ్చియుండి నట్లయితే "మీ కట్న పిశాచమున్నారు చూశారు" అది పోయేదేమో - కాని గవర్నమెంటువారు అలాటి మంచి పని చేయక పైపెచ్చు వరకట్న నిషేధము పెట్టియున్నారు. దాని ఫలితము: ఆ పెళ్ళిళ్ళని యింకా అయిదు సంవత్సరాలు యింటిలోనే వుండమని సలహానివ్వడం తగిన చదువున్నా, ఉద్యోగము దొరకని ఈ రోజుల్లో పెళ్ళిచేసుకొని, వట్టి చేతులతో వచ్చిన భార్యనికూడ తనతో ఏడిపించటం ఎందుకు! భార్య ఏ కొద్దో, గొప్పో తీసుకువస్తే, అది జీవిత నౌకకు చుక్కాని అని చెప్పవచ్చు. అంతేగాని పిల్లనిస్తామంటూ పోతే పిల్లడి తల్లిదండ్రులు కట్నము ఎంత యిస్తారన్నది ఎవరికోసము చెప్పండి?

ఇంతకీ "నాకు కట్నము ఏమాత్రము అక్కర్లేదు. నేను ఆ అమ్మాయినే చేసుకుంటాను అని ఒక్క పెళ్లికుమారుడు ధైర్యంగా ముందడుగు వేయటము లేదు అన్నారు, కాని బాగా ఆస్తివున్న వారు, బీదవాడైనా బుద్ధిమంతుడైన పిలవాడికి ఎందుకు పిల్లనివ్వరు? అలాటివాడినే చేసుకుంటాను అని ఆడపిల్లలు ఎందుకు అనరు?

హెచ్. జగదీష్‌కుమార్ (చల్లపల్లి),

* * *

ముఖ్యంగా చదువుకున్న యువకులు తమ విజ్ఞానమును సార్థకం చేసుకొని, యితరుల కష్టసుఖములను గ్రహించి, వరకట్నానికి విలువలేదు గనుక, కానుక రూపంలో కట్నము నిర్ణయించిన మొత్తాన్ని మామగారిద్వారా స్వీకరించాలనుకోకుండా, చదువుని సార్థకం చేసుకుంటారని ఆశిస్తున్నాను.

ధైర్యము, శక్తి, జ్ఞానము వుంటే తమ జీవితమును, ఒకరిమీద ఆధారపడకుండా సుఖవంతముగా గడుపుకోగలడు.

పి. సీతాదేవి. (గుంటూరు)

* * *

'కట్నపిశాచి ఫాన్సీడ్రెస్' అనే వ్యాసాన్ని చదివాను. నాకట్టే నచ్చలేదు.

"దీనికంతకూ మూలకారణం పెళ్ళిచేసుకొనే యువకులనే వాక్యంలోని పలుకులు ములుకుల్లా తగిలాయి. కొడుకు తండ్రిని ఎదిరిస్తే అతని చదువు, భవిష్యత్తు కూడా దెబ్బతింటాయి.

అర్థాంతరంగా చదువు మానేస్తే అతనికి ఉద్యోగం ఎవరిస్తారు. ఉద్యోగం లేకపోతే, డబ్బెక్కడిది? డబ్బు లేకపోతే పిల్లనెవరిస్తారు?... అంచేత అందుకు మూలం యువకులు అనేదానికి బదులు, పెండ్లిచేయు పెద్దలవటం చాలా సమంజసంగా వుంటుందంటాను. ఎవరు కారకులో, ఎవరు కర్తలో తెలుసుకోకుండా...వ్యాసాలు వ్రాసినా ప్రయోజనం లేదని తెలిసికూడా...యిలా వ్యాసాలు వ్రాయటాన్నెంటారో...?

కె. రామలింగేశ్వరరావు. (పరుచూరు)

* * *

'లలితస్కంధము కృష్ణమూలము'...... గూర్చి వ్రాసింది చాలా బాగుంది. చివరికి వారింటిసంగతి కొంత చేర్చారు. అట్లుకాక ఇటి మంచిఘట్టాలను వివరంగా ప్రతివారం వ్రాస్తే ఎంతో బాగుంటుం దనుకుంటాను. వారికి సదా కృతజ్ఞులం...

'ఎవరు బాధ్యులు' అనే శీర్షిక క్రింద కట్నాల సమస్యను చిత్రించారు. ఈ విషయంలో శ్రీ కె. యం. కస్తూరిగారితో ఏకీభవిస్తాను.

తటపర్తి రాజేశ్వరి. (సికిందరాబాదు)

* * *

## నేతి బీరకాయలు

ఈమధ్య భర్తృవిహీనల గుస్థితి మీద అనేక వృథాశ్రమతో ఓపిగ్గా వ్రాస్తున్న వ్యాసాలు చూడ్డంపడింది. అందులోను 16-7-58 ఆంధ్రపత్రికలో కె. కృష్ణవేణి గారు వ్రాసిన "సంస్కారమంటే..." అనే వ్యాసం చదివాను. వనితాలోకంలో వ్యాసాలు, వ్రాశామంటే వ్రాశాము, మన పేరుకూడా పత్రికలో పడిందంటే పడింది అనే ఈ ధ్యేయముతో కాకుండా, కృష్ణవేణి గారి వ్యాసంమాదిరిగా పదిమందికి పనికొచ్చేదిగాను, చదివి పెడదారులు త్రొక్కకుండా ఉండేటట్లుగాను, వీలైతే అనుభవాలను ఆదర్శాలను స్త్రీవర్తనకు దిద్దుకునేవిగాను ఉండాలి. 23-7-58 పత్రికలోని వనితావాణిలోని సూరి సీత, నూజివీడు వ్రాసిన విమర్శచూసి ఆశ్చర్యానందాలు పొందాను. మహిళ అయికూడా ఉత్తమాశయాలతో ఉన్నది ఉన్నట్టుగా విమర్శించినందుకు నా ధన్యవాదాలు. ఇకమీదనైనా అక్కయ్యలు, చెల్లెళ్ళు పద్ధతిని మార్చుకొని పత్రికా ముఖానికెక్కవి గనుక, అభ్యుదయమనే పేరుతో నేతి బీరకాయలాంటి వ్యాసాలు వ్రాయక, పదిమందికి పనికివచ్చేవిగాను, ఆదర్శప్రాయముగాను ఉండేవి వ్రాస్తారని ఆశిస్తున్నాను.

తోలేటి కామేశ్వరరావు,
(గుంతకల్లు)

* * *

శ్యామలాదేవిగారు రాసిన పస్తుకింకా ఎన్నిరోజులు అన్న వ్యాసముపై శ్యామలాదేవిగారికి ఆమెను విమర్శిస్తూ వ్రాసిన యర్రమిల్లి గాయత్రిగారితో ఏకీభవిస్తాను.

సుసర్ల సుబ్బలక్ష్మి. (వారణాసి)

* * *

"నేను అసలే చదువుకోలేదు" అన్న వ్యాసంలో సంగతులు లాంటివి మనఇళ్లలో చాలామంది పెద్దవాళ్ళు (మామ్మలు) ఆడపిల్లల చదువునుగూర్చి సందలిస్తూ వుంటారు. ఇది చాలామందికి అనుభవముంటుంది. అదే మనము అచ్చులో చూస్తాము. మన సోదరీమణులంతా వ్యక్తిగతానుభవములపై తీవ్రవిమర్శలు చేయుటకన్న అందరికీ వుపయోగపడే క్రొత్తవిషయాలు తెల్పుటకు ప్రయత్నిస్తూ ఇంకా వనితావాణిని అభివృద్ధికి తేవాలని ప్రార్థిస్తున్నాను.

పి. ఎ. వల్లీదేవి, (విశాఖపట్నం)★



# అనసూయ



(23 వ పేజీ తరువాయి)

త్తగా మసలుకో. పతివిషయం బాగా ఆలోచించు మీ ఇద్దరకూ ఏవిధమైన చెడుసంబంధం లేక పోయినా, మీ ఇద్దరూ కలిసి తిరగడం ఎవరైనా చూచి. శంకరం మామతో గాని, మీ నాన్నతో గాని చెప్తే పెద్ద రాద్ధాంతమౌతుంది జాగ్రత్త" అన్నాడు. నాకంటే వయస్సులో చిరంజీవి ఐగు, ఆరు సంవత్సరాలు పెద్దైనా, మా యిద్దరికీ బాగా చనువు ఉండడంనుంచి అతనిమాటలకు "నేను ఏమీ బాధపడలేను. నేననువద్ద వద్దంటున్నా వినకుండా "నాలుగు సినీమాలు చూడరా" అని ఓ పదిరూపాయిలనోటు నాజేబులో పెట్టేశా. సీనుకూడా చిరంజీవితో నే రాజమండ్రీ వెళ్ళిపోయాడు. పరీక్షా ఫలితాలు తెలియడానికి కనీసం మరొక నెలదినాలైనా పడుతుంది. మా నాన్నగారు ఇంటికిరమ్మని జాబురాసినా, ఆ పల్లెటూరిలో ఏం తోస్తుంది? అంచేత ఎక్కడకూ వెళ్ల నిశ్చయించుకోలేదు. రోజులు మామూలుగా నే గడచిపోతున్నయ్. నాలుగేసి రోజులకు మాత్రం ఒకసారి వెళ్ళి అనసూయను చూసి ఆమె యోగక్షేమాలు కనుక్కుంటున్నాం.

ఆనాడు శనివారం మధ్యాహ్నం ఇంగ్లీషు మేటినీ వదిలేసరికి మూడు గంటలయింది. ఇంటికి వెళ్ళిమాత్రం చేసేదేముందని, అజంతాలో ఒక కప్పు కాఫీతాగి అనసూయవద్దకు వెళ్ళా. ఆ దినం, మిగిలిన రూమ్ మేట్లకూడా నిన్నారు. మామూలు యోగక్షేమాలు అయినతరువాత, "ఏమండీ మీతో చాలా మాట్లాడాలి అలా సముద్రపు ఒడ్డుకు పోదామా?" అంది మెల్లగా 'సరే' అన్నా.

చాలాదూరం నడచి, ఎవ్వరూలేని ప్రదేశంలో ఇసుకలో కూర్చున్నాం. కొదిసేపయినతరువాత, "ఏమండీ. మీతో పది, పదిహేనురోజులనుండి కొన్ని విషయాలు చెప్దామనుకుంటున్నా, కానీ చెప్పలేక పోతున్నానండీ" అంది.

"ఫరవాలేదు, చెప్పండి" అన్నా.

"మొదట్లో అంతగా బాధించకపోయినా, ఇప్పుడిప్పుడు ఈ నౌకరీచెయ్యడం, చాలా కష్టంగా ఉందండీ. ఇలా కుళ్ళుతూ బ్రతికేకంటే చస్తేనయమేమో" అంది బాధగా.

"అంటే"

"వెంకటేశం, ఆ నేనర్సు మీకు తెలుసా?"

"ఆ, పరిచయం లేకపోయినా, అతన్ని ఒకసారి చూచా"

"అతను నన్ను నిత్యం వేధించుకు తింటున్నాడండీ ఇక రాత్రిడ్యూటీఅయితే అసలు చెప్పే అక్కర్లేదు."

"మీరు జాగ్రత్తగా మసలుకుంటే సరిపోతుంది గా" అన్నా మామూలు ధోరణిలో.

"ఏం జాగ్రత్తండీ. ఏదో మిషమీద రావడం, మాట్లాడ్డం, హాస్యాలు, నవ్వులు మరి దగరగా రావడం, సినీమాకు రాకూడదా? బీచికి రాకూడదా? అని నిత్యం ఏడిపిస్తున్నాడండీ."

మీరు సతీ అనసూయకు తీసిపోరు; మరేం భయపడకండి," అన్నా నవ్వుతూ.

"అంతే కాదండీ, ఆమధ్య ఓనాడు నైట్ డ్యూటీలోఉండగా ఎవరూ లేకుండా చూసి హసాన్ సరన్ ఏవేవో మాట్లాడుతూ, నాచెయ్యిపట్టుకో బోయారండి" అని ఏడ్వ ప్రారంభించింది.

ఇక లాభంలేదనుకుని, "చూడండి జీవితంలో అందులో వయస్సులో ఉన్న మీలాంటి అమ్మాయిలు ఉద్యోగాలు చేసూ మగవాళ్లతో మసలవలసినపుడు ఇలాంటి సమస్యలను ఎన్నో ఎదుర్కోవాలి. తమ స్వార్థంకోసం, మీలాంటివాళ్ళను, ఆటవస్తువులుగా ఉపయోగింప చూసుకునే పెద్ద మనుష్యులనుండి ఓర్పుగా, నేర్పుగా తప్పించుకుని రోజులు గడపాలి" అన్నా.

"ఎంత దూరంగా ఉందామనుకుంటే అంత దగ్గరగా రావడానికి ప్రయత్నిస్తారు. వీళ్లనుండి తప్పించుకోవడమెలా?" అంది.

"నిజమే. ఈ వాతావరణంలో, ఉద్యోగం చేస్తూ, శీలాన్ని చెడగొట్టుకోకుండా బయటపడడమంటే ఉట్టితో స్వర్గానికి వెళ్ళడమే," అన్నా.

"ఏమోనండీ, ఇవన్నీ చూస్తూఉంటే పని మానేసి ఇంటికి వెళ్లిపోదామనుకుంటున్నా" అంది.

"అన్నట్టు ఒక విషయం, మీతో చెప్దామనుకున్నా. నిన్న పత్రికలో, టీచరు ట్రైనింగుకోసం దరఖాస్తులు పంపవలసిందిగా ఒక ప్రకటన చూచా, మీరు దానికి ప్రయత్నిస్తే అన్నివిధాలామంచిది ఎలాగో ఒకలాగు కష్టపడి ఒక సంవత్సరం, ట్రైనింగు పూర్తిచేశారంటే, జీవితాన్ని ఇంతకన్నా ప్రశాంతంగా, నిర్భయంగా గడుపవచ్చు" అన్నా.

"నిజమేకాని సీటుదొరకడం చాలా కష్టమేమోనండీ" అంది.

"అభ్యర్థుల ఎన్నిక రాజమండ్రిలో జరుగుతుంది కాబట్టి మీగురించి ప్రయత్నించమని, చిరంజీవికి రాస్తా" అన్నా.

"అయితే ప్రయత్నించండి, అదృష్టముంటే ఈ నరకంనుండి బయటపడతా. మా అమ్మ, తమ్ముడూ కూడా నావద్దే ఉండవచ్చు" అంది ఆశగా.

ఆతరువాత "అయితే ఈ విషయాలన్నీ మా అమ్మకు రాస్తా. అవసరమైతే కాపురం బళ్ళారినుండి రాజమండ్రీ మార్చడానికి సిద్ధంగా ఉండమని తెలియజేస్తా" అంది.

"సరే రాయండి" అన్నా, అప్పటికే ఎనిమిది దాటడంనుంచి ఆమెను క్వార్టర్సుకు దిగబెట్టి ఇంటికి వెళ్ళిపోయాను.

* * *

అమర్నాడే ఆమె అప్లికేషన్ పంపుతూ, వేరే చిరంజీవి పేర విషయాలు వివరిస్తూ ఏమాత్రం అవకాశంఉన్నా ఆమె సీటు గురించి గట్టిప్రయత్నం చెయ్యమని జాబు రాశా. వారం దినములతరువాత జవాబు రాశాడు. తనకు హైద్రాబాదు ట్రాన్సఫర్ అయిందనీ, మరో పదిదినములో సకుటుంబంగా వెళ్ళిపోవాలనీ, అయినా ఒక హెడ్ గుమాస్తా తనకు బాల్యస్నేహితుడవడంనుంచి అతనితో, అనసూయ సీటు గురించి గట్టిగా చెప్పేనని, అదృష్టవంతులు సీటు దొరకవచ్చనీ.

ఎలాగయితేనేం అన్నీ సవ్యంగా జరిగాయి. అనసూయకు సీటు లభించింది. ఆస్పత్రిలో ఆమె రాజీనామాకూడా తేలిగ్గా అంగీకరించారు. ఆమె రాజమండ్రి వెళ్లేనాడు, స్టేషనుకు వెళ్ళి దిగబెట్టా. నా అడ్రసును ఒక కాగితంమీద రాసి అప్పుడప్పుడు "మీ యోగక్షేమాలు తెలియజెయ్యండి" అని ఇచ్చాను. "తప్పకుండా రాస్తా. మీరు మాత్రం నన్ను మరచిపోకండేం" అని కన్నీళ్లు తుడుచుకుంటూ రైలెక్కింది.

# అనసూయ

మరోవారం దినాలకు రాజమండ్రినుంచి శీను వచ్చాడు. చిరంజీవి కుటుంబంతో సహా హైదరాబాదు వెళ్ళిపోయేడనీ, అనసూయ స్కూల్లో ప్రవేశించిందని, వాళ్ళ అమ్మగారు తమ్ముడూ కూడా. కాపురం ఎత్తేసి బళ్లారి నుంచి వచ్చారనీ, వాళ్లకు పదిహేను రూపాయలకు ఒక ఇలు చిరంజీవే చూశాడని, ఈ సంగతులు విన్న తరువాత నామనస్సు కొంత తేలిక పడింది.

* * *

ఇంటర్ ఫలితాలు వచ్చాయ్. శీను సెకండు క్లాసులో ప్యాసయ్యాడు. నేను ఒక పార్టులో తప్పేను. మా కుటుంబ పరిస్థితులు తారుమారవడంచేత చదువుకు స్వస్తి చెప్పి ఉద్యోగ ప్రయత్నంలో పడ్డాను. అదృష్టవశాత్తూ రైల్వేలో, కురదారోడ్ లో దొరికిన గుమాస్తా గిరీకి అతుక్కుపోయా. శీను బి. యస్. సి. లో చేరాడు. తప్పక జాబు రాసానన్న అనసూయవద్ద నుంచి ఒక్క జాబైనా లేదు. చిరంజీవివాళ్లు వెళ్లిపోవడంచేత రాజమండ్రిలో మరెవరూ బంధువులు లేకపోవడంచేత ఏసందర్భంలోనూ, రాజమండ్రి వెళ్ళవలసిన అవుసరం లేకపోయింది. అతరువాత అనసూయ విషయమే ఏమీ తెలియలేదు.

రెండు సంవత్సరాలు దొర్లిపోయాయి. ఎడతెరిపిలేని ఆఫీసుపనితో విసిగి, దానికి తోడు చిరంజీవి రమ్మని పదేపదే జాబులు రాయడంవల్లా, పదిహేను రోజులు శెలవు పెట్టి, హైదరాబాదు వరకూ పాస్ తీసుకుని బయలుదేరా. విజయవాడ అంతకుముందెప్పుడూ చూడకపోవడంచేత ఒకటిరెండు రోజులుండి చూచిపోదామని విజయవాడలో దిగా. హోటల్లో సామాన్లుపడేసి కాఫీతాగి, ఇంకా ఉదయం తొమ్మిది గంటలే కావడంచేత వీధిలో పడ్డా. బజారులో ఒక పెద్ద బటలషాపులోని షోరూమ్ లోంచి కనపడుతున్న రకరకాల బట్టలు పరిశీలనగా చూస్తూ నడచిపోతున్నా. ఆ షాపుదాటి పది అడుగులు వేశానో, లేదో "సార్ మిమ్మల్ని ఇన్‌స్పెక్టరుగారు రమ్మంటున్నా"రని ఒక కానిస్టేబుల్ పిలిచాడు.

నా తలమీద పిడుగుపడ్డట్టయింది.

చేసేదిలేక, భయపడుతూ "ఎక్కడున్నారు?" అన్నా.

"ఆ బట్టల షాపులో సార్" అన్నాడు.

వెనక్కి నాలుగు అడుగులు వేసి షాపు చూద్దునుకదా షాపు గుమ్మంలో ఒక పోలీసు ఇన్‌స్పెక్టర్, ఆయనపక్క ఒక ఇరవై సంవత్సరాల అమ్మాయ్, ఆమె చంకలో ఒక పాప!

ఆమెను ఎక్కడో చూచినట్లుందే అనుకుంటూ దగరగా వెళ్ళాను.

ఆమెకూడా నన్ను ఆత్రుతగా చూస్తూ, బాగా దగ్గరకు వెళ్ళినతరువాత "ఏమండీ నేను జ్ఞాపకం ఉన్నానా?" అంది నవ్వుతూ.

ఇంకెవరు. అనసూయ! "బాగుంది. జ్ఞాపకం లేకపోవడమేమిటి!" అన్నా.

"దూరంనుంచి చూసి, మీరేనన్న అనుమానంతో, ఆయనతో చెప్పి పిలిపించా. ఒకవేళ మీరు కాకపోతే క్షమాపణ చెప్పకోవచ్చునని. ఇంతకీ ఈ ఊరు ఎప్పుడువచ్చారు ఎక్కడ దిగారు" అంది.

"హైదరాబాదు వెళుతూ, ఈ ఉదయం ఇక్కడ దిగేను. హోటల్లో ఉన్నాను," అన్నాను.

"ఏమండీ, ఈయన సామానులు ఇంటికి తెప్పించండి," అంది ఇన్‌స్పెక్టరుగారి వైపు తిరిగి.

అంతవరకూ మౌనంగావున్న ఇన్‌స్పెక్టరుగారు, "రా. ఆ. ఏయ్ 407 నువ్వువెళ్ళి ఈయన సామాన్లు తీసుకురా" అన్నారు.

చేసేదమీ లేక, హోటలుగది తాళం, ఒక ఐగురూపాయల నోటు తీసి కానిస్టేబులుకు ఇచ్చి, వాళ్ళతోనే టేక్సీ ఎక్కి కూర్చున్నా.

* * *

ఇంటికి వెళ్ళిన తరువాత స్నానం వగైరాలు చేసి, వాళ్ళ వంటవాడు ఇచ్చిన కాఫీ తాగి, అనసూయ, నేను, ఇన్‌స్పెక్టరుగారు కొంతసేపు మాట్లాడుకున్నాము. తరవాత ఆయనకు పనివుందని స్టేషనుకు వెళ్ళారు. ఇంతలో దేవాలయంనుంచి అనసూయ తల్లిగారు రాగా, "అమ్మా, ఈయనే నే మూర్తిగారు" అని నన్ను పరిచయంచేసింది.

"నమస్కారమండీ" అన్నా.

"బాబూ మీరా. చాలా సంతోషం. మిమ్మల్ని ఇంతవరకూ ఎన్నడూ చూడకపోయినా, అనూ, మీగురించి తరచు చెప్తూనే ఉంటుంది. ఆస్పత్రిలో అను పనిచేస్తూ వుండగా, మీరు స్వంతచెలెలుకన్నా హెచ్చుప్రేమగా చూస్తూ అన్నివిధాలా సహాయపడేవారట. అసలుమీవల్లనే తనకి అదృష్టం పట్టిందని, అంటూంటుంది" అన్నారు.

"అబ్బే, నేనుచేసింది ఏమీ లేదండి, దీనికంతకూ ఆమె మంచినడవడికా, అదృష్టమే కారణం" అన్నా.

మధ్యాహ్నం భోజనాలయిన తరువాత అనసూయ చెప్పింది. రాజమండ్రిలో తాము అద్దెకున్న ఇంటికి ఎదురుగా, ఇన్‌స్పెక్టర్ గారు ఉండేవారట కొంతకాలానికి వారిద్దరకూ చనువు ఏర్పడి క్రమంగా ప్రేమగా మారిందట.

ఇనస్పెక్టరుగారి తల్లిదండ్రులు ఈమె ప్రవర్తనచూచి తృప్తిపడబట్టే, పైగా ఒకే కులం కాబట్టీ అట్టే ఇబ్బందులు లేకుండానే పెద్దల అనుమతితోనే వివాహం జరిగిందట. అంచేత ట్రైనింగుకు సగంలోనే స్వస్తి చెప్పానని, తన తమ్ముడుకూడా స్కూల్ ఫైనల్ ప్యాసై మచిలీపట్నంలో ఆంధ్రా బ్యాంకులో పనిచేస్తున్నాడని, ఆమె తల్లి అతనివద్దే ఉంటున్నా ఆ మర్నాడు పాపకు అన్నప్రాశన అవడంనుంచి వచ్చిందనీ, మూడు నెలలక్రితమే ఇనస్పెక్టరుగారికి ట్రాన్స్ఫర్ కాగా విజయవాడ వచ్చామనీ చెప్పింది.

అంతా విన్నతరువాత "చాలా సంతోషమండీ, ఇంతకూ మీలో ఉత్తమ ఇల్లాలు అయే లక్షణాలు ఉన్నాయని ఆనాడే అన్నా. జ్ఞాపకం ఉందా" అన్నాను.

ఆమె నవ్వి "ఆయన చాలా ఉదార స్వభావులు. వివాహమైన తరువాత, నా కష్టాలన్నీ గట్టెక్కి ఏ కొరతా లేక పోయినా ఈ విషయం మీకు తెలియజేయలేకపోయాను కదా అని అప్పుడప్పుడు బాధపడేదానిని. మీరురాసిన ఎడ్రస్ కాగితం ఎక్కడో పారేసుకోవడంనుంచి. మీకు జాబులు రాయలేకపోయా. అదృష్టవశాత్తు ఈ దినం మీరు అనుకోని విధంగా కలియడంచేత ఇక నాకు ఏ కొరతా లేదు" అంది.

ఆ మర్నాడు బజారుకువెళ్ళి పదిహేను రూపాయిలుపెట్టి ఒక వెండిగిన్నెకొని పాపకు అన్నప్రాశన సమయంలో ఇచ్చాను.

సాయంత్రం రైలుకు బయలుదేరేముందు "ఏమండీ మీ ఎడ్రసు ఇవ్వడం మరచిపోయారు" అంది.

"ఎందుకండీ మళ్ళీ పారేయడానికేనా" అంటూ నవ్వుతూ రాసి ఇచ్చాను.

"మీరూ, చిరంజీవిగారు కలిసి తప్పక వస్తారుకదూ" అంటూ వీడ్కోలు ఇచ్చింది.

వద్దంటున్నా ఇనస్పెక్టరుగారు స్టేషన్ దాకా వచ్చారు. తేలికపడ్డ మనస్సుతో, ఈ విషయాలు చిరంజీవికి ఎంత వేగం చెప్తానా అన్న ఆత్రుతతో హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ ఎక్కాను. 

# ★ మనిషిలో మనిషి ★

(19-వ పేజీ తరువాయి)

రఘు : (నవ్వుతూ) మీనా!

మీనాక్షి : ఇంకెప్పుడూ ఇలా చెయ్యనండీ. బుద్ధొచ్చింది.

(రఘు రుమాలు ముడి విప్పిచూస్తాడు. నాటకం టిక్కెట్టు—సహించించింది—తీస్తాడు.)

రఘు : ఇదేమిటి? నాటకానికి టిక్కెట్టు కొన్నావా? నువ్వొచ్చావా నాటకానికి?

మీనాక్షి : (తలవూపుతుంది).

రఘు : ఎందుకు?

మీనాక్షి : మిమ్మల్ని వదిలివెళ్ళిన దగ్గర్నుంచీ మళ్ళీ మీ దగ్గిరికి రావాలని ఆరాటం — నే నొదిలి పెట్టేనతర్వాత మీరెలా వున్నారో చూద్దామని కుతూహలం — ఇవాళ తెలుసుకున్నాను. నన్నొదిలి మీరుండలేరని తెలుసుకున్నాను. మిమ్మల్ని వదిలి నేనసలే వుండలేనని తెలుసుకున్నాను. మీరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నారని తెలుసుకున్నాను.

రఘు : నన్ను వదిలేసి లేచిపోయి చూసేగాని నీకా సంగతి తెలియలేదన్నమాట. నీకోసం నేనెన్ని దారుణాలు చేశానో - ఎన్ని ఘోరాలకొడిగట్టానో తెలుసా?

మీనాక్షి : నాకు తెలుసు, నన్నురాత్రి బాకుతో పొడిచి పొడిచి చిత్రవధ చేశారు. అన్యాయమన్న ప్రాసిక్యూటరు ప్రాణాలు తీశారు. పోలీసులతో జడ్జీతో జూరితో కూడా హోరాహోరి తలపడ్డారు — స్టేజిమీది కొనూ కూడా నన్ను మర్చిపోలేక తప్పతాగారు — నాటకం సహంలో ఆపించేశారు — నాకు నిజంగా ఆనందంగా వుందండీ!

రఘు : మీనా!

మీనాక్షి : మీ రెప్పుడూ అంటూంటారు - ఆమాట నిజం! బాబీకీ మీకూ పోలికలేదు. వొరిపిరికి వెధవ వాడు - మీరు - మీరు నిజంగా నేకలుక! నా కోసం మీ రేమైనా చేస్తారు! ఎంత సాహసమైనా చెయ్యగలరు! మీరు నన్నెంత గాఢంగా ప్రేమిస్తున్నారో ఇప్పటికి తెలుసుకోగలిగారు!

[మీనాక్షి రఘు చేతులుపట్టుకుని దగరకు తీసుకుంటుంది. రఘు చిరునవ్వుతో ఆమె కళ్ళల్లోకి చూస్తున్నాడుగాని ఆలోచన లెక్కడో వున్నట్టున్నాయి.]

ఏమిటండీ - ఆలోచిస్తున్నారు?

రఘు : బాబీనిగురించి.

మీనాక్షి : వాడి సంగతెందు కిప్పుడు? మీ రేం బాబీ కాదు.

రఘు : అవును—నేను బాబీనే.

మీనాక్షి : ఏమిటీ?

రఘు : అవున్నేను బాబీనే. ఇప్పటికి అర్థమైందనుకుంటాను. ప్రతివాడూ—ప్రతి మానవుడూ ఒక బాబీయే ఓ మోసరుగా చూస్తే ప్రతివాడికీ ప్రతి విషయం తెలుసు. తాను ప్రేమించబడుతున్నది మోసగించబడుతున్నది ప్రతివాడూ ఎరుగు. కాని ఎరగనట్టు నటిస్తాడు. నటించి తీరాలి—లేకపోతే వాడి సాంఘిక సౌధాలన్నీ సమూలంగా కూలిపోవూ? నే మేలుకుని వున్నప్పుడు—ఈ లోకపు వాతావరణం నన్ను క్కిరిబిక్కిరి చేస్తున్నంతసేపూ నేను అందరిలాగా, బాబీలాంటి వాణ్ణే. ఏ అబద్ధమైనా నమ్మటానికి సిద్ధం. ఏం అర్థం కాకపోయినా అర్థమైనట్టు నటించడానికి సిద్ధం. జీవితం తన గాడిదకాళ్ళెత్తి బాబీని తన్నినట్టు మొహంమీద తన్నినా వాడిలాగే కిక్కురుమనలేను. కాని నిద్రలో—నా ఏకాంత జీవితంలో—అంతా వేరు! అంతా మారిపోతుంది! అప్పుడు నేను మిగతావాళ్ళలాంటివాణ్ణి కాదు. ప్రతివాడూ కావాలని ఆశించే మనిషిని నేను! భార్యచేత మోసపోయిన ప్రతిభర్తా ఆ భార్యను చంపి అవతల పారెయ్యాలనుకుంటాడు. కాని ఎవడూ చంపలేడు. నువ్వు నన్ను మోసగిస్తే నేను నిద్రలో నిన్ను చంపుతాను. నిన్న నవసరంగా ఖూనీ చేశానని కారుకూతలు కూసిన ఆ ప్రాసిక్యూటర్ని ఖూనీచేస్తాను. అవసరమైతే జడ్జీనీ జూరీనీ అందర్నీ ఖూనీచేస్తాను. నిద్రలోనే నేను కరుకు—నిద్ర పోతున్నప్పుడే నేను......

మీనాక్షి : డార్లింగ్ — డార్లింగ్ — మీ రిప్పుడు మేలుకునేవున్నారు. మీకు కల గంటం లేదు. నేను—మీ మీనాక్షినండీ—మీ ముందున్నాను! చూడండి—నా వంక చూడండి — నేను! మీనాక్షిని!

రఘు: అవును-నిన్ను గుర్తించాను. నువ్వు నా మీనాక్షివి.

[ఆమెను చేతుల్లోకి తీసుకుంటాడు-అతని కంఠస్వరం మారింది.]

నీకో సంగతి తెలుసా? నేను ఇందాక కర్టెన్ వేయించకపోతే ప్రేక్షకులు చాలా అసాధారణమైన విషయం చూసేవాళ్ళు! నిజానికి నేనే ఐన బాబీగాడి ప్రియురాలు మొదటి అంకంలో లేచిపోతుంది - ఆఫ్ కోర్స్ - అది మూడో అంకంలో ఎలాగో తిరిగివస్తుందనుకో - అంతా సుఖాంతమే అయ్యేది - కాని మూడో అంకం మటుకు వుండేదికాదు. ఎందుకనంటే రెండో అంకం మధ్యలోనే వస్తుతః బాబీయే ఐన రఘుపతిగాడి భార్య తిరిగి వస్తుంది కనక! (ఆమె కళ్ళలోకి చూస్తూ-) శాశ్వతంగా?

మీనాక్షి: శాశ్వతంగా.

రఘు: ఆ చంద్రతారార్కంగా?

మీనాక్షి: ఆ చంద్రతారార్కంగా.

రఘు. ఐతే మనిద్దరం—

[ఆమెతో చెట్టాపట్టాలు పట్టుకుని ప్రేక్షకుల కభిముఖంగా వస్తూ-]

చెట్టాపట్టా లేసుకుని-

[పక్కకు తిరిగి, మిగతా ట్రూపు.అంతా అక్కడే వున్నట్టు వాళ్ళ కభివాదంచేసి-]

మీనాక్షి లేడీస్ అండ్ జెంటిల్ మేన్!-

రఘు: ఒక్కమనవి! మీరిప్పుడు చూసిన నాటకం మేము రిహార్సలుచేసిన నాటకం కాదు -

మీనాక్షి: కాని ఫైనల్ కర్టెన్ దాకా వచ్చేశాం.

రఘు: నాటకం అయిపోయింది.

మీనాక్షి: మాలాగే మీరంతా కూడా-

రఘు: తొలిగిపోయే ఆశల్ని జడపట్టుకు లాక్కొచ్చి -

మీనాక్షి: (గునుస్తూ) తొంగిచూచే ఆనందంతో -

రఘు: పొంగిపోయే హృదయాలతో -

మీనాక్షి: చిరకాలం మనండి!

రఘు స్వస్తి ప్రజాభ్య స్శుభమస్తునిత్యమ్-

మీనాక్షి: లోకా స్సమస్తా సుఖినో భవన్తు -

రఘు: అన్నిగా: ప్రేమిణస్సన్తు -

మీనాక్షి: } జీవన్తు శరదాం శతమ్.
రఘు : }

[ తెర ]

—అయిపోయింది]

[ఈ నాటకాన్ని ప్రదర్శించాలంటే, రచయితకు (18/222, రామారావు వీధి. గాంధినగరం. విజయవాడ) వ్రాసి అనుమతి పొందాలి ]

# ★ సంజీవరావు సంసారం ★

(౩౬-వ పేజీ తరువాయి)

మూడు పల్టీలు కొట్టింది.

'వచ్చేరా సంజీవరావుగారూ!' అంటూ లోపలికివెళ్ళి పన్నెండేళ్ళ పెద్ద కొడుకుని రెక్కపట్టుకొని బరబర ఈడ్చుకువచ్చి 'ఇప్పుడు చెప్పరా వెధవా! వాళ్ళెలాగా తేలుతుంది. వాళ్ళు నిలువునా చీల్చేస్తాను. చెప్పు! ఆ పదిరూపాయిలేవయ్యేయి. ఇవి నీ నిక్కరు జేబులో కెలావొచ్చేయి. ఊఁ కక్కరా వెధవా!' అని గర్జిస్తున్నాడు.

ఆ కుర్రాడితల్లి వాడిమీదకివంగి 'అబ్బబ్బ వాడేవలా బెదరగొట్టేకండీ జడుసుకుంటే ప్రాణంపోస్తుంది. వాళ్ళో చెప్పకొంటాబూ భర్యారేదు. నువ్వు తియ్యలేదుకదూ? మా బాబు నా చెవిలో నిజంచెపాడు? అంటూ అతని తలని తన చెవిదగ్గరకి తీసుకుంది.

'తియ్యలేదమ్మా!' అంటూ బిక్కమొగం పెట్టేడు కుర్రాడు.

'నోర్మూయ్! నిజంచెప్పు! సంజీవరావు గారూ!'

సంజీవరావులేచి వారిదగరకి వెళ్ళేడు.

అనంతరావు నిముషనిముషానికీ కోపంతో గాలి ఊదుతున్న బుంగలాగ ఉబ్బిపోతున్నాడు. అతను పళ్ళుకొరుకుతూంటే నాటకాలలో దుష్టపాత్రవ్యక్తిలాగ ముగుసుగ్గయి పోతూ అనిపిస్తుంది.

'చెప్పరా! దొంగవెధవా!' అని ఉరిమేడు అనంతరావు.

కూముతిలు పెత్తగానే తోసుకువచ్చే నీరులాగ ఒక్కసారిగా ఏడ్చేసేడు ఆ కుర్రాడు. '...కొట్టుకి... హ్హి హ్హీ ఊ...' అని సంజీవరావువైపు చూస్తూ వణికిపోతూ ఏగేడు.

'ఇచ్చేవా? పింజారివెధవా! దేనికి?'

'కుల్ఫీకి...'

'ఊఁ ఇంకా దేనికి? చెప్పు నిజం!'

కుర్రాడు మాటాడలేదు.

తంపుల మొట్టికాయపడింది వాడి తలమీద.

'అమ్మో, చెప్తున్నాను నాన్నోయ్. నన్ను చంపకు నాన్నోయ్! అంతా చెప్తున్నాను! నిజమేఁ చెప్తానే అమ్మో! కుల్ఫీకి సిగ—'

'అప్రాచ్యపు వెధవా! పిల్లాళ్ళ సిగరెట్టుకీ కుల్ఫీకీ తోమిచ్చిందిపావలా తగలేశావా?" అంటూనే ఫెడేలుమని కొడుకు చెంపమీద కొట్టేడు అనంతరావు.

'పంతులుగారూ!' అని అరిచేడు సంజీవరావు ఆ దెబ్బ తీవ్రతకి వాడిలిపోయి.

అనంతరావు భార్య గబుక్కున కొడుకుని కౌగలించుకుని 'అయ్యో అయ్యో చంపేసేరే గుంట నాగమ్మని. ఈ ఇంట్లో ఎందుకు పుట్టేవురా తండ్రీ? కూటికిలేకపోయినా కడుపులో పెటుగు చూసీ వాళ్ళ ఇంట్లో పడలేక పోయేవురా నాయనా! అయ్యో! వెళ్ళిటుకుపోయేరా నీ లేతబుగ్గమీద, నన్ను కన్నతండ్రీ!...' అని గోలపెడుతూంటే సంజీవరావు గుండె చెరువయింది.

అనంతరావు భార్యతో పెనగులాడుతున్నాడు. 'నువ్వోగులు వాణి! అలా ముద్దుచేసి వాణ్ణిలా మొద్దులాగ తయారుచేసేవు! వొదులు ముందు?

సంజీవరావుకి వాలిగుండెకితోడు నూతుక్కబుద్దికూడావుంది, చటుక్కున 'పంతులుగారూ! మీరు క్షమిస్తానంటే అసలు విషయం నేను చెపాను వినండి!' అన్నాడు.

అనంతరావు తెల్లబోయి చూసేడు.

'నిన్న సాయంకాలం మీరిచ్చిన రూపాయిలో పొరపాటున ఈ మూడు చెల్లని పావలాలుకూడా వున్నాయి తర్వాత నేను మీ యింటికివచ్చి, ఇది మీ అబ్బాయికిచ్చి మార్పిమ్మన్నాను. నా బుద్ధిపొరపాటువల్ల నే రహస్యంగా నాకో పదియూపాయిలు పట్టుకురమ్మన్నాను. ఒక టోకారీఖున మీకు తీర్చిద్దామనితప్ప నాకు వేరే దురుద్దేశం లేదు. అత్యవసరంగా యీపని చేసేను.' అని తలదించుకున్నాడు సంజీవరావు.

అనంతరావు మొగం కందగడ్డలాగయింది. 'ఎంతపనిచేసేరు! గుంట గాడిదకి పెద్దరికం ఇచ్చి దొంగతనంగా అప్పుపుచ్చుకున్నారూ?! ఆ ముచ్చోకా మినహాయించుకుని నాకు ఒకటో తారీఖుకలా అప్పు తీర్చండి. వెళ్ళండి. ప్రయివేటు చెప్పండి. ఇకమీద చెప్పడూ చదివించకండి. ఇలాటి చీకటి చాటు వ్యవహారాలు!' అని చీవాట్లు వేసి నిసవిస తనగదిలోనికి 'డామిట్! మనం చెల్లని పావలాలు అంటగట్టినట్టు కనిపెట్టేసి మనకే దెబ్బ కొట్టేడు వాలిముచ్చు వెధవ!' అని తిట్టుకున్నాడు.

సంజీవరావు సిగ్గూ అవమానాలతో సంగోరు వచ్చిపోతేడు. కుర్రవాడిని కూర్చోబెట్టుకుని మోతీమహాలులోని కీలుబొమ్మలలాగ నడచుకుని ఏవో రెండు ముక్కలు చెప్పేడు: 'నారింజకాయ భూమిలాగ గుండ్రంగా వుంది, అంచేతనే ఎక్కడినుంచి బయలుదేరిన పోస్తువు అక్కడికి వస్తాయి...'

'అలా అయితే అన్నలు కెరేరడమెందుకు మేస్టారూ?' అని ప్రశ్నించేడు శిష్యుడు.

'మీ అన్నయ్య థాక్ పెల్లరవడం మాటఎలాగున్నా నువ్వు మాత్రం చిత్తరంజన్‌దాసు కాకావురా!' అనుకుటూం హాలులోని గడియారంతో మిద్దిన్నర చూపించే సరికి లేచి కొంపకి వెళ్ళి, రెండు మెతుకులు ఎంగిలిపడి కచ్చేరికి తయారౌతున్నాడు.

ఇంతలో ఉమాబాయి అక్కడికి వచ్చి 'అలా వున్నారేం? ఒక్క మెతుకైనా ముట్టుకోలేదు' అన్నది జాలిగా.

పలకలేదు సంజీవరావు. అతని తలదువ్వుతూ 'అదంతా మరిచిపొండి! చాలా మంచి పని చేసేరు మీరు. అవిడొచ్చి పాపం వూరుపోయింది. "సమయానికి మీ అయిన నవ్వుల్లా అడుక్కోకపోతే అయినా నా కిరికోపంలో ఆపనివాణ్ణి చంపేస్తు రమ్మా. చెడుపావాసాల వల్ల వాడిలాగ తయారైనప్పటికీ కన్న బిడ్డలని చంపుకో గలవాఁ తల్లి. ఎన్ని నోవుఁలు నోచి ఇలాటి ఉత్తమ బ్రాహ్మడి భార్య కాంగలిగేనో!" అంటూ తెగ పొగిడి సిందముకొండి! మూట్లాడుతున్నంత సేపూ సంతోషం పట్టలేక ముక్కు చీదిస్తూనేవుంది అని నవ్వుతూ అతని దగరచేరింది అతని జేబులో పదరూపాయలనోటు పెడుతూ గుండీలు సవరించి 'ఎన్ని నోవుఁలు నోచగా మీకిలాటి ఆడగుండె గల మగవారు కలిగారో కదా!' అంటూ అతని గుండెలలో తల దాచుకోబోయింది.

'ఏయ్ ఏయ్! చొక్కా జిడ్డయిపోతుంది మళ్ళీ చాకలాడొచ్చే దాకా ఇదొక్కటే!' అంటూ అతనామె పనసతొన బుగ్గ గట్టిగా గిల్లి నవ్వుకుంటూ వెళ్ళిపోయేడు.

ఉమాబాయి చప్పున పావలా కాసంత మొగం చేసుకుని 'ఏం మగాళ్ళమ్మా వీళ్ళ మాట—' అప్పుడే కెరమని తల్లికి 'రింగ్' చేసిన పాపాయి నెత్తుకుని 'ఏవిఁరా కన్నా, నువ్వూ మీ నాన్నలాగే తయారౌతావా?' అని ముద్దుల వానకురిపించేసింది. ★



# సినిమా

ముడిఫిలిం 'కట్'కట' నానాటికీ ముమ్మరం అయిపోతున్నందువల్ల, పరిస్థితులు—ఒక మద్రాసు నిర్మాత మాటలలో—భయంకరంగా తయారవుతున్నాయి. అసలు కంట్రోలు అనేది లేకపోతే యీ సమస్య ఇలా పెరిగి పెద్దదై పిల్లల్ని పెట్టేది కాదేమో అనికూడా ఒకరు అన్నారు. కాని దిగుమతిని ఆపుచేసినప్పుడు వాడకంలో పొదుపు చెయ్యడం తప్పనిసరి జాగ్రత్త. అలా చెయ్యకపోతే, వెంటనే కొనకపోయినా కొత్త సెప్పుడిమీదనైనా సరుకునంతా తమ అదుపులో ఉంచుకుని (బ్లాక్) మార్కెట్ని కంట్రోలు చేయగల సమర్థులు అన్ని వ్యాపారాలలోను ఒకటో అరో ఉంటూనే ఉంటారు.

## కారణాలతో రణాలు

ముడిఫిలింకు సంబంధించినంత వరకూ, నిర్మాతలకు అవసరాలనుబట్టి కోటాలు ఇవ్వడానికి పరిశ్రమలో వారు ఏర్పాటు చేసుకున్న పథకం చాలామందికి అసంతృప్తి కలిగించినట్లు కనిపిస్తోంది.

ఇలాంటి వ్యవహారాలలో ఎవరికో ఒకరికి, ఎక్కడో ఒకచోట అసంతృప్తి కలగడం మామూలే. వర్తమాన పరిస్థితుల్లో చిన్న నిర్మాతలు చాలమందిమీద దెబ్బతీశాయి' కోటాలకు రూపాయి లెక్కలో అర్థం చెప్పుకోవలసిన ఈ వ్యాపారంలో అలసత్వాన్ని తెలుసుకునే సామతు, ఆర్తినులను అక్కడక్కడ వినే పలుకుబడీ ప్రముఖంగా లేని చిన్న నిర్మాతలకు ముడిఫిలిం కోటాలతో తంటాలుపడడం

బి. ఆర్. చోప్రా కొత్త చిత్రం 'సాధనా'లో వైజయంతిమాల





చంద్రికా ఫిలిమ్స్ వారి "ఇంద్రజిత్"లో జగ్గయ్య.

ముమ్మరంగా తయారవుతోంది.

* * *

గతివారం కేంద్ర ముడిఫిలిం కోటాల సంఘం పరిశ్రమ ప్రతినిధులతో సమాలోచించి, వారు ప్రతిపాదించిన జాబితాను ఆమోదించింది. కోటాలకు ఎవరెవరు అర్హులో, ఎవరికి మొదట ఇవ్వాలో, ఎవరి తరవాత ఎవరికి ఇవ్వాలో ఈ జాబితాలో చేశారు. దాదాపు పది తరగతుల అర్హతలు తేలాయి. వీటి సారాంశం ఒక్క ముక్కలో చెప్పుకోవాలంటే, చిన్న, కొత్త నిర్మాతలు ఎక్కువవుతుంది నెలలతరపడి రాబోయే కోటాలో తమకి రాబోయే వాటాగురించి ఫిలించేంబరుదగ్గర శిష్టప్రకారం తపస్సు చేస్తూవుండాలి. (ఆదివారం విశ్రాంతి తీసుకోవచ్చు) ఇలాటి స్థితిలోపడ్డ నిర్మాతలు చాలామంది ఉన్నారు. పరిశ్రమలో పెదవారికన్న వీరిదే సంఖ్య ఎక్కువ. అందువల్ల వీరు దెబ్బతింటే పరిశ్రమకు శ్రేయస్కరంకాదు.

ఇందుకు బాధ్యులెవరు?

కోటాలు వేసేందుకు పైన ఎవరు కూర్చున్నా కొంత అటూ ఇటూగా ఇదే రకం పరిస్థితులు ఏర్పడతాయి. నిస్స్వార్థ పరాయణులతో దేశం కిటకిటలాడిపోయే కాలం కాదు కాబట్టి ఎన్ని రకాల జాబితాలు చేసినా ఏదో ఒక వర్గం దెబ్బతింటుంది. చివరికి పరిశ్రమను నమ్ముకుని ఉన్న పనివారు చాలామంది దెబ్బతింటారు. ఇలా ఒకదానికొకటి కారణం అవుతునే ఉంటుంది. ఎక్కడికక్కడ కొరతలు ఏలోచినా — వీరికి కోపం ఎందుకువచ్చింది; వారలా ఎందుకు చేశారు అని వెతుకుతూ, ఎప్పటికప్పుడు పరిస్థితులతో రణం సాగినా, వాటిలో సవరణలు చేస్తూ కూర్చోవడం తీవ్ర పర్యవసానాలకు దారితీస్తుంది. అందువల మూల కారణం చూసుకుని దాన్ని నివారించడానికి ప్రయత్నించాలి. ఇది మళ్ళీ ఆరునెలల నించీ వినిపిస్తున్న నినాదం లాగే కనిపిసుంది నినాదంలా కనిపించినా, కొన్ని నినాదాలు అబద్ధం కావు; నిజం. దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్య చాలా పెద్దది. అందులో సినిమా భాగం చాలా చిన్నది. దీనివల్ల ఇప్పటిలో ఒరిగేది లేదు; తరిగేదీ లేదు. ఆ మాటకొస్తే రాబడే ఎక్కువ ఉందని అంతా ఒప్పుకుంటున్నారు. అందువల్ల, ఈ పరిశ్రమ విచిత్ర స్వభావాన్ని బట్టి, దీని ప్రత్యేక లక్షణాలనుబట్టి, ప్రభుత్వం ఈ సారి ఈ ఏడాది నాలుగో పాదానికీ, పై సాలులో ఏపాదానికీ దిగుమతి కోటాలు వేసినపుడు ఫిలిం పరిశ్రమకు ముడి ఫిలిం దిగుమతి భేదం లేకుండా చేయడం అవసరం. ★

## ఇంద్రజిత్

చంద్రికా ఫిలింస్ వారి పౌరాణికం 'ఇంద్రజిత్' ముమ్మరంగా తయారవుతోంది. ముఖ్యపాత్రను జగయ్య నిర్వహిస్తున్నాడు. ఇతరులు : గుమ్మడి, కాంతారావు, మిక్కిలినేని, చెలం, జమున, హేమలత మొదలగు వారు. మాటలు పాటలూ సముద్రాల రాఘవాచార్య వ్రాస్తున్నారు. దర్శకుడు ఎస్. రజనీకాంత్ సంగీతం అశ్వత్థామ– ఛాయాగ్రహణం సి. నాగేశ్వరరావు.



ఎస్. అండ్. పి. వారి 'వీరసింహ'లో మైనావతి



శ్రీ వేంకటేశ్వరావారి 'సతీ సుకన్య'లో రాజనాల.



# వెనిస్ చలన చిత్రోత్సవం

## గినెస్‌కు బహుమతి

ఈయేడాది వెనిస్ చలన చిత్రోత్సవంలో, 'రిక్షామాన్' అనే జపనీస్ చిత్రం ప్రథమ బహుమతిని అందుకొంది. సూటిగా, ఆడంబరం లేకుండా కథను చెప్పిన దర్శకుడి శిల్పాన్ని అందులో ఆయన నిల్పిన కావ్యాంశను, భావుకతనూ, పరస్పర సమన్వయంతో సాగిన కళాకారుల నటనను, విశుద్ధమైన, అవధులు దాటని భావోద్వేగాన్ని ప్రశంసిస్తూ, బహుమతి నిర్ణాయక సంఘం ఈ చిత్రానికి 'సువర్ణ సింహ' విగ్రహాన్ని బహూకరించారు. ఈ చిత్రం దర్శకుడి పేరు హిరోషి ఇనగాకి.

ఈ ఉత్సవంలో ఉత్తమ నటుడుగా అలెక్ గినెస్‌ను ఎన్నిక చేశారు. ప్రసిద్ధ బ్రిటిష్ దర్శకుడు రొనాల్ నీమ్ తీసిన 'ది హార్సెస్‌మౌత్' చిత్రంలో గినెస్ నటనకు ఈ బహుమతిని ఇచ్చారు. 'ది బ్లాక్ ఆర్చిడ్' అనే అమెరికన్ చిత్రంలో నటించిన ఇటాలియన్ నటి సోఫియాలారెన్ ఉత్తమ నటిగా ఎన్నిక అయింది.

* * *

బి. ఆర్. ఫిలింస్‌వారి కొత్త చిత్రం 'సాధన' మొన్న విడుదల అయింది. 'నయాదౌర్'లో మనుగడకోసం యంత్రశక్తిని ఎదిరించి జయించిన మానవుడి కథను చెప్పిన దర్శక నిర్మాత బి. ఆర్. చోప్రా ఇందులో ఒక పతితస్త్రీ పునరుద్ధరణ సమస్యను చిత్రించే ఇతివృత్తాన్ని తీసుకున్నారు. ముఖ్యపాత్రను వైజయంతిమాల ధరించింది. సునీల్ దత్, లీలాచిట్నిస్, రాధాకిషన్, మనోమోహన్‌కృష్ణ, నందిని మొదలగువారు పాల్గొన్నారు. కథ, మాటలూ పండిట్ ముఖ్‌రాం శర్మ వ్రాశారు. పాటలు సాహిర్ లూధియానవీ.

సంగీతం దర్శకుడు ఎస్. దత్త.

## అబ్బాస్ చిత్రం

అంతర్జాతీయ స్నేహానికి రహదారులు వేసి 'పరదేశి' తీసిన ఖ్వాజా అహమద్ అబ్బాస్ ఈసారి, దేశీయ రహదారులకేసి చూసి కొత్తచిత్రం ఆరంభించారు. పేరు "చార్ దిల్-చార్ రాహేఁ."

ఇందులో అబ్బాస్ భూతభవిష్యద్వర్తమానాల రహదారులమీద, జీవనపథం మీదా తనపాత్రలను నడిపిస్తారట. ఈ దారులమీదసాగే బాటసారులలో దుష్టులు, శిష్టులు, కలవారూ, లేనివారూ, నవాబులూ ఫకీరులూ, గ్రామికులూ, పారిశ్రామికులూ, ఇంకా కొత్త చిత్రాల టైటిల్స్‌కు పనికివచ్చే హోటలుకీపర్లు, మోటరు షాఫర్లు, ఇంకా రకరకాల 'నగైరా ఉగైరా యిలా' ఉంటారట. ఈ పాత్రలను మీనాకుమారి, షమ్మీకపూర్, జైరాజ్, షీలారామానీ, బల్‌రాజ్ సాహ్నీ, కిషోర్‌కుమార్, నిమ్మీ మొదలగువారు ధరిస్తారు. మాటలు అబ్బాస్ వ్రాస్తారట.

సంగీత దర్శకుడు అనిల్ (పరదేశి) బిశ్వాస్.

* * *

'భాభి' చిత్రంతో ఉత్తరాదిన అపూర్వ విజయం సాధించిన ఎ. వి. మెయ్యప్పన్ అఖిలభారత స్థాయి చిత్రాల నిర్మాణం మీద శ్రద్ధకేంద్రీకరించారు. వీటిలో కొన్ని సంయుక్త నిర్మాణాలు. వీరితో కలసి హిందీ మార్కెట్‌లో ప్రవేశించబోతున్న తెలుగు సంస్థ అన్నపూర్ణా పిక్చర్స్. ఈ సంస్థ అధిపతి మధుసూదనరావుగారూ, మెయ్యప్పన్‌గారూ, త్వరలోనే ఒక హిందీచిత్రం నిర్మాణం ఆరంభించబోతున్నారు. అన్నపూర్ణావారి తొలి చిత్రం 'దొంగ రాముడు' కథనే వీరు హిందీలో పునర్నిర్మిస్తారు.

సంయుక్త నిర్మాణాలలో, ఎ. వి. ఎం. వారి సరికొత్త ఒప్పందం బెంగాలీ నిర్మాత అరుంధతీ ముఖర్జీతో. వీరి తొలిచిత్రం బెంగాలీలోనే తీస్తారు. రచన దర్శకత్వం అరుంధతి భర్త ప్రభాత్ ముఖర్జీ నిర్వహిస్తారు. 'భాభి' లో నటించి ప్రసిద్ధికెక్కిన పండరీబాయ్ ఇందులో ప్రముఖ పాత్ర ధరిస్తుంది, ఇతరులు ఛబీ బిశ్వాస్, దుర్గాఖోటే, పహాడీ సన్యాల్, జహర్ రే, అనిల్ చటర్జీ, శుక్లా సేన్ మొదలగువారు.

ప్రస్తుతం ఎం. వి. ఎం. లో రాజా పరంజ్‌పే దర్శకత్వాన తయారవుతున్న హిందీ చిత్రం ఒకటి ఉంది. దాని పేరు 'మా బేటీ' కాని, మొన్ననే 'బాప్ బేటీ'గా ఫిరాయించారు.

* * *

## భాయ్ బెహన్

సిప్పీ ఫిలింస్ వారు 'భాయ్ బహన్' అనే చిత్రం తీస్తున్నారు. ఇది అమ్మాయి, అబ్బాయి ప్రేమకథలో జారిపడిలేచి యుగళగీతాలుపాడే తరహాదికాదు. ఆహ్లాదకరమైన కౌటుంబిక ఇతివృత్తంతో దర్శకనిర్మాత ఈ చిత్రాన్ని రూపొందిస్తున్నారు. కుటుంబంలో రెహమాన్, నిషి. బేబినాజ్, డెయిసీ ఇరానీ ఉంటారు. జోకర్ జానీవాకర్

సంగీతం ఎస్. దత్త.

ఎస్. అండ్ పి. వారి 'వీరసింహ' చిత్రంలో పండరీబాయి, పాపాయి, సహస్రనామం.

చిన్నరాజ్: నమస్కారమండీ పద్మిని గారూ.

పద్మిని: నమస్కారమండి

చిన్నరాజ్: అఖిల భారత— కాదు కాదు... ప్రపంచఖ్యాతి వహించిన నాట్యతారయిన మీరు వాయిస్ ఆఫ్ అమెరికాలో ఈ ఇంటర్వ్యూ ఇస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది.

మీరు సినిమాలలో చేరాలనే ఉద్దేశ్యంతో భరతనాట్యం నేర్చుకొన్నారా లేక—

# నాట్యతార పద్మిని



పద్మిని: నా నాలుగోఏట నాట్యం నేర్చుకొన్నాను. మేము తిరువాన్కూరు సంస్థానంలో ఉండేవాళ్ళం. భరతనాట్యం నేర్చుకొనటానికి తగిన ఆసరా మా పెత్తల్లి ఇచ్చింది. అప్పుడు నేను బక్కచిక్కి ఉండేదాన్ని. నాట్యం నేర్చుకొంటే నా శరీర సౌష్టవం పెరుగుతుందని అన్నారు.

ప్రశ్న: నాట్యకళ అభ్యసించడంలో ఎవరెవరు మీకు ప్రోత్సాహమిచ్చారో చెప్పగలరా?

జవాబు: మా పెత్తల్లిగారు అందరికంటే ఎక్కువ ప్రోత్సాహమిచ్చారు. మాకు నాట్యం, అభినయం నేర్పి ఆ కళలు అభివృద్ధి పరచుకోవటంలో మా కెంతో తోడ్పడింది. మాకు వచ్చిన పేరు ప్రతిష్ఠలకు ఆమే బాధ్యురాలు. ఆమె తర్వాత చెప్పుకోవలసిన వ్యక్తి ఉదయ శంకర్. అతని చిత్రం 'కల్పన' లో మాకు అవకాశం కల్పించారు. అదే మా జీవితంలో ప్రప్రథమ చలనచిత్ర నటనానుభవం.



పాతికేట్లు దూరంలో అమ్మలేని పక్షంలో కోపం, ధైర్యం నటించగల భీరుహీరో, అతన్ని చూసుకుని నవ్వాలో ఏడవాలో తేల్చుకోలేక మందర నవ్వుకుని, దరిమిలా రెండో కార్యక్రమం ఆరంభించిన అర్ధాంగి—'అత్తా ఒకింటి కోడలే' చిత్రంలో రమణమూర్తి, ప్రమీల.

ప్ర: మీరు ప్రముఖ నటీమణిగా రూపొందటానికి భరతనాట్యం కారణమంటారా?

జ:— భరతనాట్యం ఒక్కటే కాదు, ఏ రకం నాట్యమైనా నటనలో రాణించటానికి అధికంగా తోడ్పడుతుంది. డైరక్టరుకు కావలసినదేమిటో సులభంగా తెలుసుకోవటందుకూ, పాత్రలను రసభరితంగా, భావస్ఫోరకంగా పోషించేటందుకూ నాట్యం ఎంతో దోహదమిస్తుంది.

ప్ర:— మీరు నాట్యతారలలో అందెవేసిన చెయ్యి కదా నృత్య నాటక సమన్వితమైన వర్ణ చలనచిత్రం ఒకటి మీరే నిర్మించటం గురించి మీ అభిప్రాయం ఏమిటి?

జ:— ఐడియా చాలబాగానే ఉంది కానీ ... నాకు టైము లేదు. ఏమైనా మంచి చిత్రం ఒకటి సాధ్యమయినంత త్వరలో నిర్మిద్దామనే అనుకొంటున్నాను.

ప్ర:— మీరు రంగస్థలంమీద ప్రదర్శనలిస్తూ—అంటే నాటకాల్లోనే నటిస్తూ ఉండిపోతే ప్రస్తుతం ఉన్నంత సాఫల్యం సంపాదించి ఉండేవారనంటారా?

జ: అది ఎవరు చెప్పగలరు? నాటకాల్లో నటించాలని నాకూ అభిలాష ఉంది. కాని కాలం కలిసిరావాలి.



దుర్గాఫిలింస్ వారి 'పతిభక్తి'లో ఎం. ఎన్. రాజం, శివాజిగణేశన్.

ప్ర: మీరింతవరకూ చాలారకాల పాత్రలు ధరించారు కదా! ఇంతవరకు ధరించని, ధరించాలనిఉన్న పాత్ర ఏమైనా ఉందా?

జ: ఉంది. మూగపిల్లలాగ నటించాలని నా కోరిక. ఆ అవకాశంకోసం ఆతురతతో ఎదురుచూస్తున్నాను.

ప్ర: ఇంతవరకు ఎన్ని హిందీ చిత్రాల్లో నటించారు?

జ: నాలుగైదు ఉంటాయి.

ప్ర: ప్రస్తుతం మీకు బొంబాయినుంచి ఛాన్సులేమైన వస్తున్నాయా?

జ: చాలవస్తున్నాయి. కాని రాకపోకలే చాలకష్టం అవుతున్నది. అందుచేత ఎక్కువ చిత్రాలలో పనిచేయడానికి ఒప్పుకోలేక పోతున్నాను.

ప్ర: యూరోపు, అమెరికాల్లో పర్యటించి రావాలని కొన్నాళ్ళ క్రితం అనుకొనేవారట కదా, ఆ ఆలోచన ఎంతవరకు వచ్చింది?

జ: మూడు, ఏళ్ళకు ముందు అనుకొన్నాం! కాని కుదరలేదు. ఇంకో రెండేళ్ళలో వెళ్ళవద్దామనుకుంటున్నాము.

ప్ర: ఎప్పుడో ఒకప్పుడు తప్పక అమెరికా వెళ్ళివస్తారనుకొంటాను.

జ: తప్పకుండా వెళ్ళిరావాలనుకొంటున్నాను.

ప్ర: అలా అయితే హాలీవుడ్ కూడా వెళ్ళిరావచ్చు. మరి హాలీవుడ్ చిత్రాలను గురించి మీ అభిప్రాయం కొంచెం చెబుతారా?

జ: హాలీవుడ్ చిత్రాలు నేను విపరీతంగా చూస్తాను. నటన మొదలైన ఎన్నో విషయాలు వాటినుంచి తెలుసుకోగలుగుతున్నానుకూడా.

ప్ర: హాలీవుడ్ తారలలో మీ అభిమానులెవరండి?

జ: నటులలో గ్రెగరీ పెక్; నటీమణులలో ఆవా గార్డనర్.

ప్ర: నాట్యంలో మిమ్మల్ని ఉత్తేజపరిచే హాలీవుడ్ నాట్యతార ఎవరయినా ఉన్నారా?

జ: ఉన్నారు వెరా ఎలెన్. ఆమె నటించిన నాట్య చిత్రాలన్నీ తప్పకుండా చూస్తుంటాను.

ప్ర: బాగుంది...తమిళ చిత్రరంగంలో మీ అభిమానతార ఎవరు?

జ: నేనెలా చెప్పగలను? నేను చాలా మందితో నటించాను. కాని తన పాత్ర అర్థం చేసుకొని రసభరితంగా నటించగల శివాజీగణేశన్ అంటే నాకు ఇష్టమని చెప్పవచ్చునేమో.

ప్ర: రెండు మూడేళ్ళకు పూర్వం చలనచిత్ర రంగంనుంచి మీరు తప్పుకొని విశ్రాంతి తీసుకొంటారనే వదంతి ఉండేది అది నిజమేనా?

జ: అటువంటి వదంతి ఉన్నమాట నిజమే. అప్పట్లో మేము 30 చిత్రాలకు పైగా నటించవలసి ఉంది. ఆ స్థితిలో మరి కొంతమంది నిర్మాతలు వారి చిత్రాలలో నటించమని ఒత్తిడి పెడుతుండేవారు. మేము వారి కోరిక నిరాకరించవలసి వచ్చింది. అందువలన మేము విరమించుకొంటున్నామన్న వదంతి పుట్టింది. అది ఉత్తపుకారని నేను చెప్పనక్కరలేదనుకొంటాను.

ప్ర: అయితే మీ నటనలో మీ అభిమాన ప్రేక్షకులను చాలకాలం సంతోషపెట్టగలరని మేము ఆశించవచ్చుగా?

జ: ఓ!

ప్ర: మీ అక్కగారు (శ్రీమతి లలిత) పెళ్ళిచేసుకొని పిల్లతల్లికూడా అయింది. మరి మీరు ఎప్పుడు చేసుకోవాలనుకొంటున్నారో అడగవచ్చాండి?

జ: (నవ్వుతూ) నేనా విషయమై ఇంతవరకు ఆలోచించనేలేదు; ఆలోచించే టైమూ లేదు.

ప్ర: ఎప్పుడో ఒకరోజున మీకూ ఆ మూడుముళ్లు పడతాయి.

జ: హా! హా! అవును...అవ్వను కాక పూర్వం (నవ్వు.)

ప్ర: మీ కెలాంటి భర్త కావాలని కోరుకొంటున్నారు!

జ: నేనా విషయాన్ని గురించికూడా ఇంకా ఆలోచించలేదు.

ప్ర: సాధారణంగా ఇద్దరు అక్కచెల్లెళ్ళకంటే ఎక్కువమంది ఉంటే చిల్లరకజ్జాలు తెగవస్తుంటాయి కద. మీ ముగురి మధ్యా అలాంటి వేమీ రావా?

జ: అందరి ఇళ్లల్లో వందగిల్లికజ్జాలొస్తే మా ఇంట్లో వెయ్యి వస్తాయి. కాని మరుక్షణం వాటిసంగతి మరిచిపోయి కలిసిపోతుంటాము.

ప్ర: నాట్యకళలో మీరు అందెవేసిన చెయ్యి; మరి స్త్రీలకు సహజమైన పాకకళలో కూడా మీకేమైనా ప్రవేశం ఉందా?

జ: ఉంది. ప్రతి ఆదివారం మా ఇంట్లో పాకశాస్త్ర ప్రయోగాలు చేస్తుంటాము. నేనిప్పుడిప్పుడే వంట నేర్చుకొంటున్నాను. ఒకమోస్తరుగా చెయ్యగలను కూడా.

ప్ర: వండటమే కాదు తినటం కూడా ఒక చక్కని కళే. మీకే ఏ పదార్థాలంటే ఇష్టమో చెబితే మాపాఠకులు ప్రత్యేకంగా సంతోషిస్తారు.

జ: ఊరగాయలు.....ఆవకాయంటే నాకు మహాప్రీతి. ఆతర్వాత అవియల్... నాకు అన్నీ ఇష్టమే.

ప్ర: మీరు నటించకుండా ఉన్నప్పుడు అంటే మీ విరామసమయాల్లో ఏంచేస్తుంటారు?

జ: విరామమా? సాధారణంగా నాకది అనుడదూరం. అయినా దొరికినప్పుడల్లా ఫోటోలు తీస్తుంటాను; షటిల్—కాక్, టేబుల్ టెన్నిస్ ఆడుతుంటాను.

ప్ర: చలనచిత్ర సీమలో పేరుప్రతిష్ఠలు సంపాదించాలన్న మీ అభిలాష సిద్ధించింది. అలాంటివి ఇంకేమయినా కోరికలు ఉన్నాయా?

జ: ఎందుకు లేవు? కావలసినన్ని. ప్రతి రోజూ ఒక కొత్తకోరిక పుట్టుకొస్తుంది— ప్రపంచ పర్యటన చేసివద్దామనీ, పాఠశాల నిర్మిద్దామనీ. అలా ఎన్నో అభీష్టాలు, అభి

...లాపలు ఉన్నాయి.

చిన్నరాజ్: ఈ ఇంటర్వ్యూ ఇచ్చినందుకు హృదయపూర్వకాభివందనలు. నమస్కారమండీ.

పద్మిని: నమస్కారమండీ.

('వాయిస్ ఆఫ్ అమెరికా'లో ప్రసారితమైన గోష్ఠి.) ★

# స్టార్లూ పోస్టర్లూ

విడుదల అయిన చలనచిత్రాల గురించి ప్రచారం చేయడానికి పోస్టర్లు వేసే విషయంలో అమెరికన్ల కన్న యూరప్ దేశాల వారిదే పైచెయ్యి అని ఆ దేశాలలో పర్యటించి వచ్చిన అమెరికన్ ఆర్ట్ డైరెక్టరు (యూనివర్సల్ ఇంటర్‌నేషనల్) మారిస్ కాలిన్ అనే ఆయన చెప్పారు. యూరప్‌లో చలనచిత్ర ప్రచార కార్యక్రమంలో పోస్టర్లకే ఎక్కువ ప్రాధాన్యం అనీ, పరిమాణాన్ని బట్టి ప్రమాణాన్ని బట్టి కూడా ఇక్కడి (న్యూయార్క్) కన్న అక్కడి పోస్టర్లే బాగుంటాయనీ ఆయన చెప్పారు. అమెరికన్, యూరోపియన్ ఫక్కీలలో కొట్టొచ్చినట్టు కనబడే తేడా ఒకటి ఉంది. యూరోపియన్ పోస్టర్లు తెరిపిగా శుభ్రంగా నిర్మలంగా, అందంగా ఉంటాయి. అమెరికన్ పోస్టర్లు ఆడంబరంగా, కొండొకచో గలీజుగా కూడా ఉంటాయని చేరీజు వేసిన కాలిన్ తేల్చారు. అమెరికన్ పోస్టరు గలీజుగా, ఇరుగ్గా ఉండడానికి ఒక కారణం, స్టార్లకుగల పేర్ల పట్టింపు. ఆయా కళాకారులతో చేసుకున్న ఒప్పందాలనుబట్టి పోస్టరు మీద అందరి పేర్లూ వేసి తీరాల్సి వస్తూ ఉంటుంది. కంపెనీ, డిస్ట్రిబ్యూషన్ కంపెనీ, నిర్మాత, నిర్వాహకులు నటులు ఒకొక్కసారి దర్శకుడు, కొండొకచో రచయిత ఇందరి పేర్లు, సెక్సపీల్ బొమ్మలూ ఇవన్నీ పట్టించాలి. అటువంటప్పుడు, పోస్టరు డిజైన్ చేసేవాడు ఎంతసమర్థుడైనా అది ఉండతగినంత తీరుగా నదురుగా ఉండపోవచ్చు అని ఆయన తాత్పర్యం.

## మేరియా మాంటెజ్ కథ

పేరు విషయంలో స్టార్లకి పట్టింపు ఎక్కువంటారు. పదిహేళ్లనాడు డగ్లస్ ఫెయిర్ బాంక్స్ జూనియర్ 'ఎగ్జయిల్' అనే చిత్రం తీశాడు. అందులో అతడు, మేరియా మాంటెజ్ ముఖ్యనటులు. అతడు పోస్టర్లు వేయించినప్పుడు తన పేరు మొదట వేసుకుని, తరవాత హీరోయిను పేరు వేశాడు. ఆమె అందుకు కోపగించి తన పరువు పోయిందని దావా తగిలించి పరిహారంగా పదిలక్షల డాలర్ల డబ్బుకీ, తన పేరు పైన వేయించడానికీ దావా వేసి గెల్చింది. ఫెయిర్ బాంక్స్ సినిమాలో లాగే జీవితంలో కూడా సాహసి. ఆవిడకి ఇవ్వాల్సిన డబ్బు ఇచ్చేశాడు. కొత్త పోస్టర్లు వేయించాడు. అయితే ఈసారి 'ఫెయిర్ బాంక్స్ ప్రెజెంట్స్ మేరియా మాంటెజ్ ఇన్' అనేది పోస్టరు పైన చిన్న అక్షరాలలో, భూతద్దంలోంచి మటుకే కనబడే సైజులో వేసి ఆ తరవాత చిత్రం పేరు 'ఎగ్జయిల్' అనేది కొంచెం పెద్ద అక్షరాలలో వేశాడు. తరవాత 'విత్' డగ్లస్ ఫెయిర్ బాంక్స్ జూనియర్ అని తన పేరు ఒకొక్క అక్షరం ఒకొక్క చదరపు అడుగు పరిమాణంలో ఈ మూలనించి ఆ చివరదాకా వేయించుకున్నాడు...

ఈ పేర్ల పట్టింపులో మనంకూడా తీసి




'నైట్ క్లబ్' చిత్రంలో అశోక్‌కుమార్, కామినీ కౌశల్.



తాగితందనాలాడడం అనే పామేతను, పోటుమీరాయించి మరీ అమలు జరుపుతున్న అల్లుడూ కూతురూ–చూసేవాళ్ళందరికీ చూడ ముచ్చటగా ఉన్నా, సూర్యకాంతానికి మాత్రం కన్నుల విందుగా ఉండిఉండదు. 'అత్తా ఒకింటి కోడలే' చిత్రంలో తందనాలాడుతున్న అల్లుడుగా జగయ్య, తందానపాడుతున్న కోడుగా గిరిజ, (బహుశా చూడలేక ఔట్‌ఫీల్డ్‌లోకి తప్పుకున్న సూర్యకాంతం)

పోము. (అయితే మన పోస్టర్లు అమోఘంగా ఉండక పోవడానికి ఇదిమటుకు కారణం కాదు.) ఒక దక్షిణ భారత చిత్రంలో ఇద్దరు పెద్దలపేర్లు ఢీకొన్నాయి. ఎవరి పేరు ముందర వెయ్యాలనేది తెగని సమస్య అయిపోయి చివరికి, ఏ. పీ. వెయ్యకుండా నిర్మాత తప్పించుకోవడం జరిగింది!

## బాక్సాఫీస్ వైద్యం

ఇంతకీ, అమెరికన్ పోస్టరు, యూరోపియన్ పోస్టర్లంత శోభగా, సుందరంగా ఉండకపోవడానికి అమెరికన్ ప్రవీణుడు చెప్పినట్లు పేర్ల రద్దీ ఒక్కటే కారణం అంటే నమ్మ బుద్ధికాదు. బాక్సాఫీస్ సూత్రధారుల ప్రభావం అన్ని శాఖలలోకి వ్యాపించింది. అన్నిటికీ అదే పరమావధి అయింది. ఒక వేళ చిత్రకారులు పోస్టర్లను కథా వస్తువునుబట్టి రూపొందించబోయినా, బాక్సాఫీస్ ప్రభావంవల్ల దానికీ అలాటి వైద్యమే జరుగుతుంది. జూరీల తీర్పుకు ప్రాముఖ్యం ఇచ్చే న్యాయ పరిపాలన వ్యవస్థనే సవాలుచేసే కథా వస్తువుతో కరుణ, న్యాయంకోసం ఆక్రోశించే పాత్రలతో ఉత్తమశ్రేణి కథన శిల్పంతో, నటనతో రూపొందిన 'ట్వెల్వ్ యాంగ్రీమెన్' అనే చిత్రానికి హాలీవుడ్ వేయించిన పోస్టర్ చూస్తే అదేదో గాంగ్‌స్టర్ చిత్రం అనిపించేలా కనిపిస్తుంది. ఇలాటివి, ఆలెక్‌గిన్నెస్ వంటి నటులుండగా, విలియంహోల్డన్ వంటి వారి (ఈయనకూ అకాడెమీ అవార్డు వచ్చిన మాట నిజమే) పేర్లు ప్రచారానికి వాడుకోవడంలాంటివి ఎన్నో కనిపిస్తాయి. వీటికి కారణం బాక్సాఫీస్ ప్రభావమే ఐతే కొందరు అమెరికన్ ప్రవీణులే ఒప్పుకున్నట్టు ప్రజ్ఞ ఉంటే ఏవీ అడ్డురావు ఇందుకు షేన్, హైనూన్, సెయింట్ జోన్ వంటి చిత్రాల పోస్టర్లు నిదర్శనం

## సంప్రదాయ బద్ధకం - కణం

మన దేశంలో పోస్టరు వేసే కళమీద ఇంకా ఇలాటి దుష్ప్రభావాలు పడలేదు కాని, వీటిలో అక్షరాల, బొమ్మల అమరిక ఇంకా చెప్పుకోతగ్గస్థాయికి (మొత్తంమీద చూస్తే) వచ్చిందని చెప్పుకోలేము, ఇటీవలగా మన చిత్రకారులు కొత్తకొత్త ప్రమాణాలను అందుకొంటున్నది. పత్రికలలో వేసే లేఔట్‌ల విషయంలో. దక్షిణాదికన్నా, బొంబాయి చిత్రకారులు గత ఏడాదిలో చాలా అందమైన, భావస్ఫోరకమైన లేఔట్‌లు వేశారు. దక్షిణభారతంలో వారు మటుకు, 'సంప్రదాయబద్ధకంకణం' ఇప్పట్లో విప్పి, కొత్తపద్ధతులు అవలంబించడానికి సిద్ధంగా ఉన్నట్లు కనిపించటంలేదు. పోస్టర్లు కానీండి మరేది కానీండి ఓ పెద్ద తలకాయ, దాని పక్కన రెండు చిన్న బొమ్మలూ, అడుగున పన్నెండు చిన్న తలకాయలూ పేర్చేస్తారు. మహా అయితే కొత్తదనంకోసం 11 వేస్తారు. కొత్త ప్రయోగాలూ, ప్రయత్నాలూ లేకుండా ఇలా 'సంప్రదాయ బద్ధకా'నికి లొంగిఉండడం ఆరోగ్యకరం కాదు. ★

* * *

కిషోర్‌కుమార్ సొంతచిత్రం "చల్తీకా నాం గాడీ" చురుకుగా తయారవుతోంది. ఇందులో అన్నదమ్ములు ముగ్గురూ, అశోక్, కిశోర్, అనూప్ ఉన్నారు. దుష్టుడు కె. ఎన్. సింగ్. అమ్మాయి మధుబాల.

ఈ చిత్రానికి సచిన్‌దేవబర్మన్ సంగీతం సమకూర్చుతున్నారు

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



వి కృ తి

—ఫొటో : జి. రామమూర్తి]

